# దయాశతకము.

ఆంధ్రపద్య టీకాతాత్పర్య విశేషార్థ సహితము.



గ్రంథకర్త.

యన్. యె. నరసింహాచార్య్యులు.

శ్రీమాన్, యన్. ఏం. నరసింహాచార్యులు, బి. ఏ., యల్. టి.,

గారిచే వ్రాయబడిన ఇతరపుస్తకములు.



1 బాలభారతము (వచనము)

2 సృష్టివిషయవార్తలు ,,

3 ద్విపద భగవద్గీతలు (అచ్చుకాలేదు)

4 గంగావతరణము (ద్విపద అచ్చుకాలేదు)

5 ఎలిమెంటరీ ఫిజియాలజి (వచనము)

6 ఆంధ్రముకుందమాల (పద్యములు)

7 ఆంధ్రహంససందేశము ,,

8 ఘటికాచలమాహాత్మ్యము ,,

9 రామాయణకీర్తనలు (పద్యములు పాటలు)



శ్రీః

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమన్నిగమాంత మహాదేశిక

# దయాశతకము.

ఆంధ్రపద్య టీకాతాత్పర్య విశేషార్థ సహితము.

మద్రాస్ సైదాపేట వాస్తవ్యులును, స్కూల్స్ డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ వారు నగు

శ్రీ. ఉ. వే. ప్ర. శ్రీమాన్

నడాదూరు అమ్మాళ్ నరసింహాచార్యులు. బి.ఏ., యల్.టి., వారిచే

ఆంధ్రీకరింపబడి

పెంబపాడు

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడి

శ్రీవైష్ణవపత్రికాధిపతులచే

ప్రకటింపబడినది.

1938.

శ్రీవైష్ణవ పత్రిక చందాదారులకు రు 0-12-0. | కాపీరైటు. | ఇతరులకు రు 1-0-0.




శ్రీమ ద్వేంకటనాథ దేశికోత్తములచే రచితమగు నీ శ్రీనివాసుని దయావిషయకమగు స్తోత్రరత్నము, శ్రీవైష్ణవులు గురూపదేశ పురస్సరముగా ప్రతిదిన మనుసంధించు ద్వయమంత్రముయొక్క వివరణమై, సంసారబంధమున చిక్కిన చేతనునకు మోక్షప్రాప్తి దయావిధేయుడైన భగవంతుని సంకల్పముచేతగాని, ఇతరోపాయములచే సమకూరదను ముఖ్యవిషయమును ప్రతిపాదించుచున్నది. అందుచే భగవానుడు సకలగుణ సార్వభౌముడై భగవద్గుణాంతరములకు గుణత్వసిద్ధిని గల్గించునట్లు వర్ణింపబడినది. అట్టి భగవానుని పురస్కరింపనొల్లక కేవలము స్వబోధా ద్యుపాయాంతరములచే ముక్తిని సాధింపగోరువారు, నీరుత్రాగుటకై గంగాతీరమున నుయ్యి త్రవ్వువానివలె హాస్యాస్పదు లగుదురు. భగవద్వైకశరణ్యులు కృతకృత్యులు. వారే సారవిదులు. చాతకములు మేఘోదకమును నమ్మినట్లు వారు భగవానుని విడిచి వేరొండు నాశ్రయింపరు. భగవంతుడు దయాగుణప్రధానుడు. దయకు విధేయుడై తననిరంకుశ స్వాతంత్ర్యమును బోగొట్టుకొని యాశ్రిత పరతంత్రుడగుట సర్వశాస్త్రప్రసిద్ధము. అతని కోపము పైకిమాత్రమే. అంతరంగము కేవలము కరుణామయము. అతని సృష్టి స్థితి సంహారాది కృత్యములు అవతారలీలలు మున్నగునవి దయాకార్యములు. దయ మృతసంజీవని, కృపణజనులకు కల్పలతికయై సర్వాభీష్టసిద్ధు లొనరించును. శ్రీనివాసుని దయావిగ్రహమునుబోలు శ్రీదేవి యాశ్రిత రక్షణవిషయమున పురుషకార మొనరించునట్టి జగన్మాత.

చేతనుడు సంప్రదాయసిద్ధులగు గురువర్యులద్వారా శ్రియః పతిని శరణమని యాశ్రయించినచో, నతనిదయకు పాత్రుడై, క్రమముగా సంసారబంధనిర్ముక్తుడై భగవచ్చరణారవింద కైంకర్య

రూపమగు మహానందము ననుభవించును. ఇదియే పరమపురు
షార్థలాభము. కృపాళువగు భగవంతుడే చేతనునకు సదాచార్య
సమాశ్రయణ మొనరించి, యవిద్యాదులు తొలగించి, నిజచరణ
కమల పరిచరణరూపమగు సాయుజ్యసౌఖ్యమును కలిగించుచు
న్నాడు. కావున చేతననకు భగవత్ప్రాప్తికి విరోధములగు పాపపుంజ
ములను రూపుమాపుటకు, సతని యను ఆశ్రయించుటకంటెను,
అతనియందు నిజాత్మభరణ సమర్పణము చేయుటకంటెను వేఱు
హితమగు కృత్యము లేదని యీగ్రంథము తెల్పుచున్నది.

నిరుపమ నిరతిశయ వైభవముచే నొప్పు వేదాంతదేశికులవా
రిట్లు సర్వమతస్థులచే సమాశ్రయింపతగిన భగవద్దయావైభవ
ప్రకటన మొనరించు స్తవరాజ మొక్కటి సంస్కృతమున మృదు
మధుర శైలితో వ్రాసియుంచుట ననేకు లెఱుంగరు. ఆంధ్రదేశ
మున భాషాంతరంగా వ్యాప్తిలో లేనట్టి యీ దయాశతకమును, మూల
శ్లోకములు వాని యవతారికలతోను, టీకాతాత్పర్య విశేషార్థ
ములతోను, మూలశ్లోకములకు సరియగు తెనుగుపద్యములతోను
వ్రాసి ప్రకటించి, యాంధ్రులకు సమర్పింపబూనిన నాపూర్వకృత
భాగ్యవిశేషమునకు సంతసించుచున్నాను. ఇందనేక లోపములు
తప్పులుండవచ్చును. పండితుల యనుమతిని వానిని పునర్ముద్రణ
మున సవరింపగలవాడను. ఈ నాయుద్యమమునకు తోడ్పడి, గ్రంథ
మును చక్కగా ముద్రింపించిన శ్రీవైష్ణవపత్రికాధిపతులగు శ్రీమత్తిరు
మల వేంకటాచార్యులవారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను. శ్రీవైష్ణవ
మతాభిమానులును, భగవత్కృపార్థులగు సకలజనులును, ఈ స్తవ
మునెడ తగిన యాదరము చూపగలరని నమ్ముచు, విస్తరభీతిచే
నీవిజ్ఞప్తి నింతటితో విరమించుచున్నాను.

సైదాపేట,
29-12-37.

ఇట్లు విన్నవించు భగవత్కృపార్థియగు,
సదాదూరు అమ్మాళ్ నరసింహాచార్య దాసుడు,
గ్రంథకర్త.

# ప్రస్తావన.



ఈ స్తవరాజము కవితార్కికసింహులును, సర తన్త్రులు నగు శ్రీమన్నిగమాంత మహాదేశికులవారిచే శ్రీశ్రీనివాసుని దయావిషయముగా సంస్కృతభాషను శ్లోకరూపములుగా జెప్పఁబడి యున్నది. ఇయ్యది వారియొక్క హృదయమునుండి 107 వ శ్లోకమున "జంఝామారుత ఘాతచూతసయత" యనినట్లు పొంగిపొరలి తనంతట వచ్చిన కవితాధారగాని యన్యముగాదు. అందుచే నీ శ్లోకము లెంతో మనోహరములై యున్నవి. ఇట్టి స్తవరాజమునకు వ్యాఖ్యానానుసారముగా నాంధ్రభాషను టీకను వ్రాయయత్నించిన శ్రీమాన్ యన్. ఏ. నరసింహాచార్యులు బి.ఏ., యల్.టి., గారి పాండిత్య మెంతో నతిపాత్రమై యొప్పుచున్నది. కొన్ని కొన్ని స్థలములందు అనగా నవసరమగుస్థలములందు సంస్కృతవ్యాఖ్యకన్న నీ తెనుగుటీకయందే యర్థము బాగుగా స్పష్టపరిచి పండితపామర జనంబు లెఱుంగునట్లు రచించియున్నారు. ప్రతిశ్లోకమున కొక్కొక తెనుగు పద్యముగూడా మిగుల హృద్యమగు శైలిని రచించిన వీరి పాండిత్యప్రకర్షయు, కవితాపాటవము కడుంగడు ప్రశంసనీయము. వీరు మద్రాస్ ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటునందు డిప్యూటీఇన్‌స్పెక్టర్ పదవియందుండియు నిట్టి గ్రంథమునకు విపులముగా నర్థతాత్పర్యములను వ్రాసిన వీరిపట్టునల మిగుల నాదర్శపాత్రియము. వీరు హూణభాషా పాండిత్యము గలవారైనను వీరి యాంధ్రగీర్వాణ భాషాభిమానమును, వానియందలి ప్రజ్ఞయు నీగ్రంథమునందలి వీరి రచనాపాటవమే వేనోళ్ల చాటుచున్నది. వీరిట్టిగ్రంథమునకు నాంధ్రమున విపులవ్యాఖ్యవ్రాసి ధన్యులయి రనుట కెంతమాత్రము సందియము లేదు. వీరిప్రజ్ఞావిశేషము లెన్న సుధీజనసాధ్యముగాని నాబోటియల్పజ్ఞునికి చెప్పనలవిగాదు. అయినను బుద్ధికిగోచరించినట్లు వ్రాసినాడ. గుణగ్రహణపారీణులై దాసుని సాహసమును క్షమింతురుగాక.

పెంటపాడు,
29-12-37.

ఇట్లు,
శ్రీవైష్ణవ పత్రికాధిపతి.

# పండితుల యభిప్రాయములు.



రాజమహేంద్రవరము మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ కవిరాజ కవిసార్వభౌమ ఆంధ్రవ్యాస అభినవశ్రీనాథాది బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలుగారు వ్రాయునది.

"శ్రీమాన్ నడాదూరు అమ్మాళ్ నరసింహాచార్యులవారు తెలిఁగించిన 'దయాశతకము' నేను చాలాభాగము గ్రంథకర్తగారు చదువగా సావధానమనస్కుండనై వింటిని. వీరు ద్రావిడులైనను ఆంధ్రభాషను జక్కగా నభ్యసించి యింతకుమున్ను ముకుందమాల, హంససందేశము లోనగు గ్రంథములు మనోహరముగా రచించి ప్రఖ్యాతిగాంచిరి. ఈ దయాశతకము మిక్కిలి చక్కని పాకమునం బడినది. నేను విన్న పద్యము లన్నియు మూలముతో సరిపోల్చి చూచితిని. ఈ పద్యములు మూలాభిప్రాయమును బోధించుచు శ్లాఘాపాత్రముగా నున్నవని చెప్పుటతిశయోక్తి కాఁజాలదు. కావున నాంధ్రులెల్లరు నీగ్రంథమును చదివి యానందింతురుగాక యని కోరుచున్నాను."

విజయనగరం మహారాజాగారి సంస్కృతకళాశాల సంస్కృత పండితులగు శ్రీమాన్ పరవస్తు గోవిందాచార్యస్వాములు వ్రాయునది.

"శ్రీమాన్ నరసింహాచార్యులుగారు వ్రాసిన దయాశతకము టీకాతాత్పర్యములు మూలార్థమును చక్కగా విశదీకరించునవిగా నున్నవి. ఈపండితులవలన తెనుగువారలకు శ్రీమద్వేదాంత దేశికులవారి స్తోత్రార్థముల జ్ఞానము కల్గుటనుబట్టి, యాంధ్రులు వీరియెడ కృతజ్ఞులుగా నుండవలసియున్నది. వీరిట్లే తక్కిన వేదాంత దేశిక స్తోత్రములనుకూడ టీకాతాత్పర్యములతో వ్రాసి ప్రచురింతురుగాక యని కోరుచున్నాను."

శ్రీరస్తు.







శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః.

# దయాశతకము.

[ టీకా తాత్పర్య సహితము. ]

1. అవతారిక. శ్రీమన్నిగమాన్త మహాదేశికులనియు, కవితార్కికసింహమనియు, సర్వతంత్రస్వతంత్రులనియు జగత్ప్రసిద్ధిగాంచిన యీ గ్రంథకర్త శ్రీమద్వేంకటనాథార్యులు, భగవంతుండగు శ్రీశ్రీనివాసుని దయాగుణస్తోత్రమునం దాసక్తులై "ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖం" అను నార్యోక్తిననుసరించి యీ మొదటిశ్లోకమునందు దయానిధియగు శ్రీనివాసునకు నివాసభూతమగు శ్రీవేంకటగిరిని నమస్కరించుచున్నారు.

శ్లో॥ ప్రపద్యే తం గిరిం ప్రాయః శ్రీనివాసానుకంపయా ।
ఇక్షుసారస్రవంత్యేవ యన్మూర్త్యా శర్కరాయితం॥

టీక. ఇక్షుసారస్రవంత్యేవ(స్థితయా) = చెఱకురస ప్రవాహము వలె నొప్పుచున్న, శ్రీనివాసానుకంపయా = శ్రీవేంకటేశుని దయాగుణము, యన్మూర్త్యా = ఏగిరిరూపముగా, శర్కరాయితం = చక్కెరగా పరిణమించినదో, తం గిరిం = ఆ వేంకటాద్రిని, ప్రపద్యే = సేవించుచున్నాను. భగవంతుని దయను చెఱకురసముతో బోల్చి

టచే, దాని మధురత్వ శీతలత్వ పాపహరత్వాదులు వ్యంజితము. సమస్తపాపహరమగుటచే నీగిరికి వేంకటాద్రియని పేరు గల్గినది. దీనికే అంజనాద్రియనియు, వృషభ (వృష)గిరియనియు, శేషశైలమనియు, నామాంతరములు. భగవంతుడు చేతనుల రక్షణార్థము స్వయంవ్యక్తుడై యావిర్భవించిన ముఖ్యస్థలములలో నీవేంకటగిరి యొక్కటి.

క॥ శ్రీనివాసుని కరుణారస
మావిధమున నిక్షుసార ♦ మై స్రవియింపన్
దానెలసె శర్కరాకృతి
నా వసుధను దోచు వేంక ♦ టాద్రిం గొలుతున్॥

తాత్పర్యము. చెఱకురసప్రవాహమును బోలుచు, శ్రీశ్రీనివాసుని దయప్రవహింపగా, నది తుదకు శర్కరయై యీగిరి రూపముగా పరిణమించినట్లు భావింపబడునో, ఆవేంకటాద్రిని నమస్కరించుచున్నాను.

2. అవ. జగదుపకారార్థము భూమియందు దవతరించిన గురుపరంపరను ధ్యానించుచున్నారు.

శ్లో॥ విగాహే తీర్థబహుళాం శీతలాం గురుసంతతిం ।
శ్రీనివాసదయాంభోధి పరీవాహపరంపరాం॥

టీ. శ్రీనివాసదయాంభోధి పరీవాహపరంపరాం = శ్రీనివాసుని దయాసముద్రమునుండి వెడలినకలుజులవరుసను బోలునదియు, తీర్థబహుళాం = నాథ యామున యతీశ్వరు లాదిగాగల గురువర్యులచే నొప్పునదియు, పరీవాహపక్షమున రేవులచేనిండినదనియర్థము; శీతలాం = శమ దమాది గుణములచే సుఖాస్పద మైనదియు, పరీవాహపక్షమున చల్లదనము కలిగినదియునైన, గురుసంతతిం = గురు

పరంపరను, విగాహే = విశేషముగా అనుభవించెదను, మానసిక నమస్కారాదులు వివక్షితము. పరీవాహపక్షమున విగాహే = మునిగెదను; ఉభయత్ర తాపహరత్వము ఫలితము. వకుళభూషణ యామున యతీశ్వరు లాదిగురూత్తములు భగవద్దయా ప్రభవ ప్రకటనపరులగుటచే, వారిని దయాసాగరమునం దుద్భవించిన పరీవాహపరంపరగా నుత్ప్రేక్షింపబడినది. భగవంతుడు వారిని లోకోపకారార్థము జన్మింపచేసెనని భావము. అందుచే వారు వందనీయులు. జలాశయములోని నీరు కాలువలమార్గముగా దూరముగానున్న భూములందు ప్రవహించురీతి, దురితవశమున భగవద్దయకు దూరవర్తులైన మనకును గురుపరంపర సంజీవినియై యుండునని యాశయము.

తే॥ కొలను బయి త్రొవ్వి ♦ శిష్టమహులను
శ్రీనివాసుని కరుణాబ్ధి ♦ లోనఁ గ్రోడఁబు
వెలికిఁ బఱవించి జలవాహ ♦ సూనుఁ గోలు
గురుపరంపరలో భక్తిఁ ♦ గుఱింతు లిమదు॥

తా. శ్రీనివాసుని దయాసాగరమున బుట్టి బయటికి ప్రవహించు పరీవాహములను బోలినదియు, తాపహరత్వాది గుణములచే ప్రసిద్ధినందినదియు గురూత్తములచే నిబిడమైనదియునైన శ్రీవైష్ణవగురుపరంపరను నేను భక్తితో ధ్యానించెదను. గురువందన పూర్వకముగా భగవద్వందన మాచరింపవలయునని శాస్త్రములు తెల్పుచున్నవి.

3. అవ. గురుపరంపరా నమస్కృతిచే దనివినొందక, యందు ముఖ్యముగా భగవదేకశరణులగు శఠగోపయతీంద్రులు మున్నగువారిని ప్రత్యేకముగా నమస్కరించుచున్నారు.

శ్లో॥ కృతినః కమలావాస కారుణ్యైకాంతినో భజే।
దత్తే యత్సూక్తిరూపేణ త్రివేదీ సర్వయోగ్యతాం॥

టీ. యత్సూక్తిరూపేణ = ఎవరి ద్రావిడ ప్రబంధములకు చేరిన తిరువాయ్‌మొళ్లులచే (పాశురములచే), త్రివేదీ=వేదసమూహములు, సర్వయోగ్యతాం ధత్తే = సర్వ స్త్రీశూద్రాది జనులకును అనుసంధింప యోగ్యములైనవో; అట్టి కమలాకాంత కారుణ్యైకాంతినః = శ్రీశ్రీనివాసుని దయైకనిరతులును అందుచేతనే, కృతినః = కృతకృత్యులైన మహాత్ములునగు పరాంకుశ పరకాలాదులను, భజే = సేవించెదను. ఈగురువర్యులుప్రసాదించిన దివ్యప్రబంధములు వేదతుల్యములై, సర్వజనపఠనీయములై, సర్వపురుషార్థప్రదము లగుచున్నవని భావము. అందుచే వారు మహోపకారులు, వందనీయులు.

క౦॥ కృతకృత్యుల గురువుల శ్రీ
పతి కరుణాశ్రితుల ద్రమిడ ♦ పాశురములచే
శ్రుతితతికి సర్వజనయో
గ్యత నొసఁగిన వకుళభూష ♦ ణాదులఁ గొలుతున్॥

తా. భగవద్దయైకనిరతులైనపుణ్యాత్ములగు నమ్మాళ్వారు మొదలగు గురుముఖ్యులు సకలజను లుజ్జీవింపగా, వేదసమానములైన ద్రావిడప్రబంధములు రచించి మహోపకారులైరో యట్టి వారిని నమస్కరించెదను.

4. అవ. శ్రీవిష్ణుపురాణ భారత రామాయణగ్రంథములచే వేదార్థములను విశదీకరించి జగదుపకారకులైన పరాశరాది మునిప్రవరులను ప్రత్యేకముగా సేవించుచున్నారు.

శ్లో॥ పరాశరముఖాన్ వందే భగీరథనయే స్థితాన్।
కమలాకాంత కారుణ్య గంగాప్లావిత మద్విధాన్॥

టీ. కమలాకాంతకారుణ్యా = శ్రీపతిదయయను, గంగా = గంగాజలముచే, ప్లావిత = తడుపబడి పుణ్యులై చేయబడిన, మద్విధాన్ = నాగరులనుబోలు నావంటి దురితవర్తనులను, అందుచేత భగీరథనయే, స్థితాన్ = భగీరథునివలె గంగావతరణమునం దాసక్తులైనవారునగు, పరాశరముఖాన్ = పరాశర పారాశర్య ప్రాచేతసులను, వందే = సేవించెదను. నావంటి దురితదూషితులను భగవద్దయకు పాత్రులుగా జేసినచో మితదోషులగు నితరుల రక్షణము సులభసాధ్యమని యర్థము. భగీరథుండు అతికుపితుడై కపిలమహర్షి కోపానలముచే గ్రాగిన తనపూర్వుల అఱువదివేవుర సగరపుత్రుల గంగాజలప్లావనమున స్వర్లోకప్రాప్తి యగున ట్లొనరించినది పురాణ ప్రసిద్ధము. భగవంతుని కరుణను గంగతోఁ బోల్చుటచే దాని పావనత్వ శీతలత్వ మధురత్వ పాపహరత్వాదులు సూచితము.

ఆ॥ ఇల భగీరథప్ర ♦ వృత్తులైననుం బోలు
కలుషమతుల విభుని ♦ కరుణ యనెడు
గంగనీట ముంచి ♦ కడుపుణ్యులై యొన
ర్చిన పరాశరాదిమునులఁ ♦ గొలుతు.

తా. భగవద్దయానై భవమును ప్రకటించుశ్రీవిష్ణుపురాణాది గ్రంథములు రచియించి, గంగను భూలోకమునకు దెచ్చిన భగీరథ చక్రవర్తిని బోలుచు, గంగాప్రవాహసామ్యమును ధరించిన భగవద్దయచే కలుషాత్ములగు నావంటివారిని పవిత్రులుగా జేసిన పరాశర వ్యాస వాల్మీకులను నమస్కరించెదను.

5. అవ. భగవద్దయచేఁ బ్రేరితులై గురుపరంపరలోఁ బ్రథమగురుత్వము వహించిన శ్రీవిష్వక్సేనులవారిని ప్రత్యేకముగా నిర్విఘ్నగ్రంథపరిసమాప్తికై ప్రణమిల్లుచున్నారు.

శ్లో॥ అశేషవిఘ్నశమన మనీకేశ్వర మాశ్రయే।
శ్రీమతః కరుణాంభోధౌ శిక్షాస్తోత్ర ఇవోత్థితం॥

టీ. శ్రీమతః కరుణాంభోధేః = శ్రీమన్నారాయణునియొక్క దయాసాగరమునుండి (లేక గొప్పజలాశయమునుండి), శిక్షాస్రోత ఇవ = రక్షణార్థము తనంతట బయలువెడలిన పరీవాహమువలె, ఉత్థితం = పొడమిన, అశేషవిఘ్నశమనం = చతుర్విధ పురుషార్థముల ప్రాప్తికి విరోధముల నన్నింటిని దొలఁగఁజేయునట్టి, అనీకేశ్వరం = సేనానాయకులైన విష్వక్సేనుల వారిని, ఆశ్రయే = ఆశ్రయించుచున్నాను. వకుళధరముని యోగదశయందు శ్రీవిష్వక్సేనులచే నుపదేశము పొందుటవలన, వారికి ప్రథమాచార్యత్వము సిద్ధించెనని శ్రీవైష్ణవ సాంప్రదాయము. నిండిన తటాకముయొక్క గట్లు తెగిపోకుండుటకై రక్షణార్థముగా పరీవాహము అనగా కలుఁజు ఏర్పడినది. అపారకారుణ్యనిధియగు భగవంతుడు స్వయముగా లోకరక్షణార్థము మొట్టమొదట విష్వక్సేనులను సృష్టింపఁ జేసెనని యర్థము. అందుచే వారు శిక్షాస్రోతముగ నుత్ప్రేక్షింపఁబడిరి.

కం॥ శ్రీమంతుని కరుణాబ్ధిన్
క్షేమార్థము మొదటఁ దాన • శిక్షాస్రోతం
బై మెఱసెనో నాఁదగు సే
నాముఖ్యుని సకలవిఘ్న • నాశనుఁ గొలుతున్॥

తా. శ్రీమంతుడైన నారాయణుని దయావారిధిలోనుండి ప్రథమమున లోకరక్షణార్థము స్వయముగా వెడలిన కలుఁజువలె నొప్పు సర్వవిఘ్ననాశకుడైన ప్రథమగురువగు విష్వక్సేనుని భక్తిపూర్వకముగా నాశ్రయించెదను.

6. అవ. విష్వక్సేనులతర్వాత ఆరోహణక్రమప్రాప్తయు, భగవదాశ్రయణమునకు పురుషకార భూతయునైన శ్రీదేవిని స్తుతించుచున్నారు.

శ్లో॥ సమస్తజననీం వందే చైతన్య స్తన్యదాయినీం
శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీం॥

టీ. శ్రేయసీం = శ్రేయస్కరియు, భక్తరక్షణవిషయమున శ్రీనివాసునిచే అపేక్షితయగుటచే ప్రశస్తయు, చైతన్య స్తన్యదాయినీం = ప్రాణులకు దేహాత్మోపయుక్తమగు సత్తువనుగలిగించునదియు శ్రీనివాసస్య కరుణామివ రూపిణీం = శ్రీనివాసునిదయయే విగ్రహరూపమును బొందినదో యని తలంపదగినదియునైన, సమస్తజననీం = సకలభువనమాతయగు శ్రీదేవిని, వందే= సేవించుచున్నాను. దయామూర్తియగుటచే, లక్ష్మీదేవియొక్క భక్తానుగ్రహపరతయు, నిగ్రహమున నెట్టిదియో యెరుగమియు, వ్యంజితములు. ప్రాణులకు స్వస్వరూపజ్ఞానమను స్తన్యము నిచ్చి భగవదాశ్రయణమున సహాయమొసగుటచే శ్రీదేవి ప్రశస్తయు లోకమాతయునై వెలుగుచున్నది.

ఆ॥ శ్రేయములనొసంగు ♦ శ్రీనివాసుని దయా
విగ్రహంబు నాఁగ ♦ వెలిఁగి సర్వ
జంతుజాలములకుఁ ♦ జైతన్యమయమగు
స్తన్యమొసఁగు లోక ♦ జననిఁ దలఁతు॥

తా. శ్రీనివాసునికరుణయే మూర్తిమంతమైనదో యన్నట్లు భావింపతగినదియు, సర్వప్రాణులకు స్వస్వరూపజ్ఞానమను చనుపాలిచ్చి సత్తువకలిగించి, సకలశ్రేయస్సుల నొసగునదియు, సమస్తలోకములకు జననియునైన శ్రీదేవిని భక్తితోఁ దలంచెదను.

7. అవ. శ్రీదేవి కంగభూతయగు భూదేవిని స్తోత్రముచేసి ప్రణమిల్లుచున్నారు.

శ్లో॥ వందే వృషగిరీశస్య మహిషీం విశ్వధారిణీం।
తత్కృపాప్రతిఘాతానాం క్షమయా వారణం యయా॥

టీ. క్షమయా = క్షమయను పేరుగలదానిచే లేక ఓర్పుఅను గుణవిశేషముగల యయా (భూమ్యా) ఏభూదేవిచే, తత్కృపాప్రతిఘాతానాం = ఆశ్రీనివాసుని కృపకు పాత్రులుగాక దూరముగాఁ జేయఁబడినవారికి, వారణం (భవతి) = నివారణము గల్గుచున్నదో, అనగా భగవదాజ్ఞనుమీఱి వర్తించువారిపై స్వామికి కోపముగలిగినప్పుడు, సర్వంసహాయనియు క్షమాదేవియనియు ప్రసిద్ధిగాంచిన భూదేవిముఖనిరీక్షణముచే సర్వమును భగవంతుఁడు సహించుచున్నాఁడు అట్టి వృషగిరీశస్యమహిషీం = శ్రీనివాసుని దేవిని విశ్వధారిణీం = భూమిని; వందే = సేవించుచున్నాను. "క్షమయా పృథివీసమః" "తాలిమివసుధఁబోలు" అని క్షమావిషయమున భూమి దృష్టాంతముగా జెప్పబడినది. భగవత్కృపకు హేతువైన విశ్వంభరాదేవి వందనీయురాలు.

ఆ॥ వృషభశిఖరినాథు ♦ కృపకు దూరగులైన
వారి కేక్షమ యని ♦ వారకంబు
నెలయఁజేయునట్టి ♦ విశ్వంభరాదేవి
కతులభక్తి నేను ♦ నతు లొనర్తు॥

తా. పాపవర్తనులై వేంకటాద్రినాథుకృపకు పాత్రులుగానట్టి వారికి, నేభూదేవియొక్క క్షమాగుణవిశేషముచే నివారణ కలుగుచున్నదో అట్టి శ్రీనివాసుని మహిషియగు భూదేవికి భక్తితో నమస్కారము లాచరించెదను.

8. అవ. అనంతరము మహిషీత్రయములో కనిష్ఠయగు నీళాదేవిని స్తుతించుచున్నారు.

శ్లో॥ నిశామయతు మాం నీళా యద్భోగపటలై ర్ధ్రువం।
భావితం శ్రీనివాసస్య భక్తదోషే ష్వదర్శనం॥

టీ. యద్భోగపటలైః = ఏదేవియొక్క నిరంతరావలోకన సంభాషణాలింగానాదులైన భోగానుభవముచే లేక భోగపరంపర యను తెరచే, లేక నేత్రదోషముచేత, శ్రీనివాసస్య = శ్రీనివాసునకు, భక్తదోషేషు = భక్తుల దోషములందు, అదర్శనం=చూపు లేకుండుట, భావితం = కలుగుచున్నదో, అట్టి నీళా = నీళాదేవి, మాం = నమస్కరించుచున్న నన్ను, నిశామయతు=దయతోవీక్షించుగాక. ధ్రువం ఉత్ప్రేక్షావ్యంజకము. భగవంతుని స్వాభావికమగు "నస్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా" యనునట్లు భక్తదోషములను బాటింపమి యను గుణము, నీలాదేవిభోగపరంపరలచే సంభవించినట్లు చెప్పుటచే, హేతూత్ప్రేక్ష. భూదేవి సహాయమువలన శ్రీనివాసుడు భక్తదోషములనుజూచి సహించుచున్నాడు. కాని నీలాదేవియొక్క వాల్లభ్యాతిశయమున భక్తుల యందలి దోషజాతములను మొదలే చూడకుండుట కల్గుచున్నది; కావున నీలాదేవి యెంతయు వందనీయురాలు.

తే॥ హాస్య సంభాష ణాలింగ ♦ నాది భోగ
పటలసంయుక్తి విభునకు ♦ భక్తజనుల
నేరములు గప్పిపుచ్చెడు ♦ నీల నన్ను
నేలుఁ గావుతఁ గరుణాలి ♦ లోల యగుచు॥

తా. హాస్య సంభాషణాదులైన బహువిధభోగవర్గములను తెరచే శ్రీనివాసునకు భక్త దోషాదర్శనత్వము కల్గునట్లు ఏదేవి యాచరించుచున్నదో, యా నీల నన్నుఁ గరుణతోఁ గనుఁగొనుం గాక.

9. అవ. "లక్ష్మీనాథ సమారంభాం" అన్నట్లు గురుసంతతి కాద్యుఁడును, సర్వేశ్వరుండును, దయానిధియు నగు వృషభాద్రినాథుడైన శ్రీనివాసునకు వందనము లర్పించుచున్నారు.

శ్లో॥ కమ ప్యనవధిం వందే కరుణా వరుణాలయం।
వృషశైల తటస్థానాం స్వయం వ్యక్తి ముపాగతం॥

టీ. కరుణావరుణాలయం=కరుణాసముద్రుడును, వృషశైల తటస్థానాం = శేషశైలమందున్న సమస్త చేతనాచేతన పదార్థములకు, స్వయంవ్యక్తి ముపాగతం = స్వయముగా దివ్యమంగళవిగ్రహమును ధరించి యావిర్భవించి కనిపించువాడును, కమపి = ఒకానొక అవాఙ్మానసగోచర స్వరూపుడును, అనవధిం = దేశకాల వస్తు పరిచ్ఛేదరహితుడునగు శ్రియఃపతిని, వందే = నమస్కరించుచున్నాను. కొండనెక్కి చూచినగాని విస్పష్టముగా సముద్రముకనబడదు. ఇది ప్రసిద్ధమైన కరుణాసముద్రము. భగవంతుడు సంసారచక్రమున పరిభ్రమించు జీవుల రక్షణార్థము స్వయముగా నావిర్భవించి వెలుగుచున్నట్టి ముఖ్యమైన యెనిమిదిదివ్యస్థలములలో వేంకటాద్రి యొక్కటి స్వయంవ్యక్త డగుటచే భగవంతు నిఅవ్యాజకరుణ తెల్లమగుచున్నది.

తే॥ దివ్యమంగళ విగ్రహ • దీప్తు లెసఁగ
స్వయముగా వృషభాద్రిని • వ్యక్తుఁడైన
యవధిరహితుని వాఙ్మన • సాతిదూరు
శ్రీనివాసుని హరిఁ గృపా • సింధుఁ గొలుతు॥

తా. ఆశ్రితరక్షణార్థము స్వయముగా వేంకటగిరిపైసుందర మంగళవిగ్రహము చేకొని వెలసినట్టి త్రివిధ పరిచ్ఛేద రహితుడును, వాక్కునకును మనస్సునకును గోచరము గానట్టి ప్రభావయుక్తుడు నగు, శ్రీశ్రీనివాసునకు నమస్కారము లాచరించెదను.

10. అవ. గురువందనపూర్వకముగా భగవద్వందన మాచరించి, యంజనాచలేశ్వరుడైన శ్రీనివాసుని దయను స్తోత్రముచేయ దేశికులవారు సంకల్పించుచున్నారు.

శ్లో॥ అకించననిధిం సూతి మపవర్గ త్రివర్గయోః।
అంజనాద్రీశ్వర దయా మభిష్టౌమి నిరంజనాం॥

టీ. అపవర్గత్రివర్గయోః = మోక్షము ధర్మార్థకామములు అను నాల్గువిధములైన పురుషార్థములను, సూతిం = కలిగించు నదియు, అకించననిధిం = భగవంతుని కరుణయే దిక్కని నమ్మిన దీనులకు లేక నిరుపేద లగువారికి, నిధిం = పెన్నిధివంటిదియును, నిరంజనాం = నిష్కల్మషమై పరగునదియు (అంజనా పేక్షరహితయు నని స్ఫురించును) అగు అంజనాద్రీశ్వర దయాం = శ్రీనివాసుని దయను, అభిష్టౌమి = అభితః స్తౌమి అగాధమగుటచే దయావైభవమును పూర్తిగా నెఱుంగుటకు శక్తిలేమిచే, తెలిసినంతవరకు నుతించెదను. కొండలో దాచబడిన నిధిని జూచుటకు కాటుక వేసికొనవలయును. అయితే శ్రీనివాసమహానిధిని జూచుట కవసరములేదు వేంకటాద్రిపై నంజనాదేవి తపస్సుచేసి సిద్ధిని బొందుటచే దానికంజనాద్రియను నామము గల్గినది.

తే॥ సకలవిధ పురుషార్థంబు ♦ లకుం బ్రసూతి
నిలయమై యకించనులకు ♦ నిధియు నగుచు
సర్వజన సేవ్యయును నిరం ♦ జనయు నైన
యంజనాచలేశ్వరు దయ ♦ నభినుతింతు॥

తా. ధర్మార్థకామ మోక్షము లను పురుషార్థముల నొసంగునదియు నిర్ధనులకు పెన్నిధియు, సర్వజనులచే నాశ్రయింపదగినదియు, నిష్కల్మషయు నైనట్టి శ్రీ శ్రీనివాసుని దయను బొగడెదను.

11. అవ. శ్రీనివాసునిదయను శృతి స్మృతి పురాణాదుల ననుసరించి స్తోత్రము చేయుటకు ప్రారంభించుచున్నారు. ఇక్కడ నుండి స్తుతి ప్రారంభము.

శ్లో॥ అనుచరశక్త్యాదిగుణా మగ్రేసరబోధ విరచితాలోకాం।
స్వాధీనవృషగిరీశాం స్వయంప్రభూతాం ప్రమాణయామి
దయాం॥

టీ. అనుచరశక్త్యాదిగుణాం = అనుచరులగు అనగా వెంబడించుచున్న, శక్తి వీర్య తేజోబలాదులైన గుణములను గలదియు, దయ గుణేశ్వరి కావున తక్కిన భగవద్గుణములన్నియు నాయికను అనుసరించి ప్రవర్తించునని తాత్పర్యము. (అగ్రే) = ఆలోకాం అగ్రేసరబోధ=ముందుగా సంచరించు జ్ఞానమను గుణముచే, విరచితాలోకాం = చూపబడిన మార్గము కలదియు, అనగా దయకు పాత్రమైన విషయమును ముందు బోధము తెలియజేయునని భావము (మార్గము చూపువారు ప్రభువులకు ముందుగా జనుట సహజము) స్వాధీనవృషగిరీశాం = తనకు వశ్యుడైన నాధుడగు వృషాద్రిప్రభువును గలిగినదియు, స్వాధీనభర్తృకయను నాయికవంటిది యని భావము. అందుచేతనే స్వయంప్రభూతాం = తనకుదానబొడసూపునదియు నైన, దయాం = దయను, ప్రమాణయామి = శాస్త్రోక్త ప్రకారముగా వర్ణించెదను. శరణ్యత్వముచే నధ్యవసించెదనని భావము స్వయంప్రభూతాం అనుటచే భగవంతునిఅవ్యాజకరుణయు దయావిధేయత్వమును ప్రకటితము లగుచున్నవి. "వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్" అన్నట్లు శ్రీరాముడు కృపావిధేయుడై మహాపరాధియగు కాకాసురుని రక్షించినది దీనికి నిదర్శనము.

తే॥ వీర్య శక్తి బలాదులా ♦ విభుని గుణము
లనుగమింపంగ మును ప్రసా ♦ దార్హవిషయ
మెఱుక తెల్ప వశ్యవృషగి ♦ రీశ యగుచు
దనకుఁ దాఁ దోఁచు దయను మా ♦ దలయెునర్తు॥

తా. వెనుక శక్తివీర్యాదిగుణములు రాగా, ముందు దయనీయమగు వస్తువును జ్ఞానమనుగుణము తెలియఁజేయగా, స్వాధీనభర్తృకవలె శ్రీవేంకటేశ్వరుని లోఁబఱచుకొని తనకుదానై షోడ సూపునట్టి దయయను భగవద్గుణేశ్వరుని ప్రమాణపూర్వకముగా నిరూపించెదను.

12. అవ. అతిపాపప్రసక్తిచేత మిక్కిలి దూషితుడగుతన్ను సంజీవింపఁ జేయవలయునని దయను దేశికులవారు ప్రార్థించుచున్నారు.

శ్లో॥ అపి నిఖిలలోకసుచరిత ముష్టింధయ దురితమూర్ఛనా దుష్టం।
సంజీవయతు దయే మా మంజనగిరినాథరంజనీ భవతీ॥

టీ. అంజనగిరినాథ రంజనీ = శ్రీనివాసునకు హృదయాహ్లాదమును గూర్చు, దయే! భవతీ = దయా నీవు, నిఖిలలోక సుచరిత = సమస్తలోకములయొక్క పుణ్యసమూహములను, ముష్టింధయ = ఒక్కమా టువ్వెత్తు కొనఁజాలునట్టి, దురిత = పాపముల, మూర్ఛనా = వ్యాప్తిచేత, దుష్టం = దుష్టుఁడైన (మూర్ఛనారూప దోషావిలుండైనన్ను) జుష్టం అను పాఠాంతరమున కూడియున్నను అని అర్థము. మాం = నన్ను, సంజీవయతు = సంజీవితునిగాఁ జేయుము. నీ లీలావిహారములచే శ్రీనివాసుని లోఁబఱచి సర్వలోక సుకృత నిశ్శేషశోషకములగు మదీయపాపములను దలపక నన్ను రక్షించినచో, మితదోషులగు నితరులు తప్పక రక్షితులగుదురని యాశయము.

ఆ॥ నిఖిలలోక సుకృత ♦ నిచయ ముష్టింధయ
దుష్కృతముల మూర్ఛ ♦ తుడగు నన్ను
నంజనాద్రివిభుడు ♦ రంజిలగా దయ!
నీవ చేయరాదె ♦ జీవితునిఁగ॥

తా. దయా! నేను భగవదపచార భాగవతాపచారాదు లగు మహాపాపసముదాయముచే జగత్పుణ్యములను హరింపజాలు నట్టి దుష్టుడై మృతకల్పుడై యున్నను, నన్ను భగవద్దయకుం బాత్రుని గావించి సంజీవితునిగాం జేయుము.

13. అవ. నన్నుం బాపరహితునిగాం జేయ నిన్ను వేడ నవసరము లేదు. నీ యనర్గళప్రవాహమున సర్వోన్నతుడైన శ్రీనివాసుడే మునింగిపోవుచుండగా, నా పాపము లన్నియు స్వయముగా మునిగి నశించుచున్నవని తెలుపుచున్నారు.

శ్లో॥ భగవతి దయే భవత్యా వృషగిరినాథే సమాప్లుతే తుంగే
అప్రతిఘ మజ్జనానాం హస్తాలంబో మదాగసాం మృగ్యః॥

టీ. భగవతిదయే=జ్ఞానశక్త్యాదులైనభగవద్గుణాంతరములు దయకు పరికరీభూతము లగుటచే, భగవతియని సంబోధనము. భవత్యా = సర్వోత్కృష్టయు స్వయంప్రభూతయునగునీచేత, తుంగే వృషగిరినాథే = స్వరూపరూపగుణ విభవాదులచే మహోన్నతుడైన శ్రీనివాసుడు (వృషాఖ్యగిరిశ్రేష్ఠమనియు స్ఫురించుచున్నది.) సమాప్లుతేసతి = నిమగ్నుడై పోవుచుండ అనగా పరవశుడైయుండగా, అప్రతిఘ మజ్జనానాం = ఏవిధమైన ఆటంకములేక మునుగుచున్న, మదాగసాం=నాయపచారములకు (పాపచయములు మునుగుట యనగా దయావిధేయుడైన శ్రీవేంకటేశ్వరుడు స్వయముగా వాని నెల్ల క్షమించుచున్నాడని యర్థము.) హస్తాలంబో మృగ్యః = మహానదీప్రవాహ నిమజ్జనావసరమున చేయూతయొసగునట్టి దాత వెదకవలసినవాడై యున్నాడు. అనగా మహోన్నతుడైన శ్రీవేంకటేశ్వరుడే దయాప్రవాహమున మగ్నుడై పోవుటచేతను అతనికంటెగొప్పవస్తువు లేనికారణమునను, స్వయముగామునిగి నశించు

చున్న నీచులతోఁసమానమగు నాపాపవర్గములకు చేయూతయొసగు నట్టి దాత మఱెవ్వఁడు లేడని యర్థము. సర్వపాపప్రణాశనము దయాకార్యమగుటచే నిందు చేతనునకు అనిష్టనివర్తకత్వము వర్ణితము.

ఆ॥ ఉరగశైలనాథుఁ ♦ డుత్తుంగుఁ డయ్యు త్వ
న్మహిత సంప్రవాహ ♦ మగ్నుఁ డయ్యె
నడ్డులేక డోఁగు ♦ నస్మదాగములకుఁ
గరుణ ! చేయొసంగ ♦ నొరులు గలరె ?

తా. ఓదయా ! నీవు సర్వతత్త్వాతీతుడై సర్వోన్నతుడై వెలుగు శ్రీనివాసునికూడ మునిగిపోవునట్లు నిరర్గళముగా ప్రవహించుటచే, స్వయముగా మునిగి నశించునట్టి నాపాపసముదాయములకు చేయూతయొసగువా రెవ్వరు లేరు. అనగా నా పాపములన్నియు ప్రతిబంధములేక శ్రీనివాసునిచే క్షమింపబడుచున్నవని భావము. "మేరుమందర మాత్రోఽపి రాశిః పాపస్య కర్మణః । కేశవం వైద్య మాసాద్య దుర్వ్యాధిరివ నశ్యతి॥ "అను శ్లోకార్థము స్ఫురించును.

14. అవ. ముందుపద్యమున జీవునకు భగవత్ప్రాప్తికి విరోధమగు అనిష్టనివృత్తి వర్ణితము. ఈపద్యమున ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థముల నొసగి యిష్టావాప్తి గావించుటకు దయయే కారణమని తెలుపుచున్నారు.

శ్లో॥ కృపణజన కల్పలతికాం కృతాపరాధస్య నిష్క్రియా మాద్యాం।
వృషగిరినాథదయే త్వాం విదంతి సంసారతారిణీం విబుధాః॥

టీ. హే వృషగిరినాథదయే ! త్వాం = నిన్ను, కృపణజన కల్పలతికాం = ఐహికాముష్మికఫలములను గోరి యవి లభింపమిచే

దీనత్వముచే గుందు జనులకు వారివారి మనోరథముల నీడేర్చుట వలన కల్పవల్లివలె బరగుదానవనియు, కృతాపరాధస్య = మహా భాగవతాపచారాది దోషములుచేసినవారికి, ఆద్యాంనిష్కృతియాం= ముఖ్యమైన ప్రాయశ్చిత్తమైనదనియు, "కృతాపరాధస్యహి తే నాన్య త్పశ్యా మ్యహం క్షమం। అంతరే ణాంజలిం బధ్వా లక్ష్మణస్య ప్రసాదనాత్॥" అని రామకార్యము మఱచిన సుగ్రీవునకు ఆంజనేయులవారు తెలిపినది స్మారిత మగుచున్నది. "కృతే పాపేఽనుతాపో వై యస్య పుంసః ప్రజాయతే। ప్రాయశ్చిత్తం తు తస్యైకం హరిసంస్మరణం పరం" "ప్రాయశ్చిత్తా న్యశేషాణి తపః కర్మాత్మకాని వై। యాని తేషా మశేషాణాం కృష్ణానుస్మరణం పరం॥" అన్నట్లు అఘనివృత్తికి హరిసంస్మరణమే ముఖ్యమైన ప్రాయశ్చిత్త మగుట విశదము; సంసారతారిణీం = సంసారమను మహాసముద్రమును దరింపజేయుదానవుగాను (అనగా దయామయుఁడైన భగవంతుడు తనయందు భక్తిప్రపత్తులు స్వయముగా గల్గించి సదాచార్య సంపాదనద్వారా తనయాశ్రితులకు మోక్ష మొసగుచున్నాడని భావము.) విబుధాః = విద్వాంసులు అనగా భగవద్దయావైభవపారము నెఱింగినవారు, విదంతి = తెలియుచున్నారు. "కి మలభ్యం భగవతి ప్రసన్నే శ్రీనికేతనే" "రత్నపర్వత మారుహ్య యథా రత్నాని మానవః। శక్త్యానురూప మాదత్తే తథా కృష్ణా న్మనోరథాః" "చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ" "మా ముపేత్యతు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" అనబడు బహుప్రమాణబలములచే నెఱుగుదురని యర్థము.

తే॥ దీనిజనముల కల్పల • తిక యటంచుఁ
 గృతదురితముల కాది ని • ష్కృతి యటంచు

భవమహాంబోధిదాటించు ♦ ప్లవ మటంచు
వృషగిరీశ్వరదయ నిన్ను ♦ విబుధు లందురు॥

తా. దయా! కోరినవరములు దీనజనుల కొసగుటచే కల్ప వల్లివనియు, చేయబడిన పాపములు తొలగుటకు ముఖ్యమైనప్రాయశ్చిత్తమైనదానవనియు, సంసారమను మహాసముద్రమును దాటింప జేయుటకు తెప్పవలె నొప్పుదాన వనియు, నిన్ను జ్ఞానులైన మహాత్ములు తెలిసికొనుచున్నారు.

15. అవ. దురితముల బోగొట్టి యాశ్రితులకు శుభములు సమకూర్చు శక్తి నీకు గల్గు టేమియాశ్చర్యము ; సాక్షాత్పరవాసు దేవుడగు శ్రీవేంకటనాథుని జ్ఞానశక్తిబలాదులగు గుణములెల్ల గుణత్వసిద్ధిని బొంది కల్యాణగుణములై విలసిల్లుట, నీ సాహచర్యమహిమచేతనేకదా యనియు, నీ సాంగత్యరహితములై యాగుణములెల్ల ననర్థదాయకము లగుచుండుననియు తెలుపుచున్నారు.

శ్లో॥ వృషగిరి గృహమేధి గుణా బోధబలైశ్వర్య వీర్యశక్తిముఖాః।
దోషా భవేయు రేతే యది నామ దయే త్వయా వినాభూతాః॥

టీ. హేదయే! వృషగిరి గృహమేధి గుణాః=వేంకటాద్రిపై పద్మాలయాసహాయుడై వర్తిల్లుచున్న శ్రీనివాసుని గుణములు (గృహమేధియనుటచే వృషగిరినాథుని పద్మాపారతంత్ర్యము ప్రకటితము) బోధబలై......ముఖాః బోధము = సర్వసాక్షాత్కారాత్మకమైన జ్ఞానము, బలము = శ్రమపరిసంగరహితమును సర్వసామర్థ్యరూపము నగునట్టి బలము, ఐశ్వర్యము = సర్వాధార సర్వవ్యాపక సర్వనియామకరూపమగు వైభవము, వీర్యము = సర్వాధారత్వ సర్వనియమన కృత్యములందు వికారరాహిత్యస్వరూపమైనది వీర్యము, శక్తిముఖాః=అఘటనఘటనారూపమైనశక్తి, ముఖాః

అనుటచే తేజస్సు మొదలగు అనంతములైన గుణములు వివక్షితము; ఈభగవద్గుణంబు లన్నియు "అబహిష్కృత నిగ్రహార్హ" అని వెనుక 25 వ శ్లోకమున సాయించినతీరున అపరాధులను నిగ్రహించుట కుపయుక్తము లగుటచే, త్వయా వినాభూతా యదినామ = నీసాంగత్యమును వీడినయెడల, ఏతే దోషాభవేయుః = ఇవియన్నియు నిగ్రహోపయుక్తములై కీడాచరింపగలవు. కావున భగవద్గుణాంతరము లన్నిటికి గుణత్వమును గలిగించుట నీసాహచర్యమే కారణము. అందుచేత దయా! నీవు గుణసార్వభౌమివగుదువని ఫలితార్థము.

తే॥ వృషభగిరినున్న గృహమేధి ♦ వీర్యశక్తి
బోధతేజోబలైశ్వర్య ♦ ముఖగుణములు
నీదు సాంగత్యమెడలిన ♦ నింద్యములగుఁ
గాదె యనుకంప! సుగుణాగ్రి ♦ గణ్య వీవు॥

తా. వేంకటాద్రిపై సంసారివలె రమాదేవితోఁగూడి కాపురమున్న శ్రీనివాసుని జ్ఞానశక్త్యాదిగుణము లన్నియు, నీసాహచర్యాభావమున అపరాధులను దండించుట కుపయుక్తములై నింద్యము లగుచున్నవి కావున, దయా! నీవే సర్వోత్కృష్టురాలవు. నీమహిమ అవాఙ్మానసగోచరము.

16. అవ. అనంతములైన భగవద్గుణంబులు దయాసంబంధముచే గుణములై విలసిల్లుననుటకు దృష్టాంతముగా, క్రింది అయిదు శ్లోకముల భగవంతుని సృష్టిస్థితిసంహారాది లీలలుజగదుపకారముగాఁ బరిణమించుచున్నవని తెల్పుచు ఈ శ్లోకమున ప్రళయకృత్యముచే నగు జగదుపకృతిని వివరించుచున్నారు.

శ్లో॥ ఆసృష్టిసంతతానా మపరాధానాం నిరోధినీం జగతః।
పద్మాసహాయకరుణే ప్రతిసంచరరూపకేళి మాచరసి॥

టీ. హే పద్మాసహాయకరుణే! సంబోధనము, "సహధర్మ చరీం శౌరేః సమ్మంత్రిత జగద్ధితాం । అనుగ్రహమయీంవందే నిత్య మజ్ఞాతనిగ్రహాం॥" అని లోకహితచింతాసక్తయగుచు నిగ్రహమన నెట్టిదియో యెఱుగక, భక్తానుగ్రహమునందు దీక్షితురాలై వర్తిల్లు శ్రీదేవిని సహాయముగా గల్గిన శ్రీనివాసుని కరుణా! ఆసృష్టిసంత తానాం అపరాధానాం = సృష్టిమొదలుకొని విడువక చేతనులు స్వయముగాను, ఇతరులప్రేరణవలనను గావించునట్టి బహువిధ భగవ దాజ్ఞాతిలంఘన రూపములగు అపరాధపరంపరలను, నిరోధినీం = అడ్డగించునట్టి అనగా భగవత్ప్రవర్తిత శ్రుతిస్మృతినిర్దిష్టములగు క్రియలను జేయకుండుటచేతను అకార్యకరణముచేతను పాపము గల్గుచున్నది. అట్టి అపరాధములు గావించుటకు హేతువగు కరణ కళేబరమును నశింపజేయుటచే వానికినిరోధమని యర్థము. జగతః= లోకముయొక్క, ప్రతిసంచర కేళిం = సంహారరూపమగు లీలను, ఆచ రసి = చేయుచున్నావు. ప్రజల పాపకరణనివర్తకముచేతను, సాం సారికదుఃఖములను దొలగించుటచేతను, సంహారరూపమగు క్రియను భగవత్కృపయొక్క లీలావ్యాపారముగా వర్ణింపబడినది. "ఆచరసి" యనుటచే జగత్ప్రళయవ్యాపార నిత్యత్వము స్ఫురించుచున్నది.

తే॥ సృష్టి మొదలుగ జనములు ♦ సేయునట్టి
భగవ దాజ్ఞాతిలంఘన ♦ పాపవృత్తు
లడఁగ హితవృత్తి భువనసం ♦ హారకేళి
యాచరింపుదు పద్మాస ♦ హాయకరుణ!

తా. సృష్టిమొదలుగా శ్రుతిస్మృతిరూపములైన భగవదా జ్ఞను మీఱి వర్తించువారల. పాపచయములు తొలగింప నెంచి, పాపాచరణమునకు సాధనభూతమైన కరణకళేబర విఘటనముచే

లోకములకు పరమోపకారము చేయుచున్నావు. కావున దయా! ప్రళయాఖ్యక్రియచే జగదుపకారమే కల్గుచున్నది.

17. అవ. ప్రళయానంతరము అర్థక్రమప్రాప్తమగు సృష్టి రూపమైన జగదుపకారమును వివరించుచున్నారు.

శ్లో॥ అచిదవిశిష్టాన్ ప్రళయే జంతూ నవలోక్య జాతనిర్వేదా ।
కరణకళేబరయోగం వితరసి వృషశైలనాథకరుణే త్వం॥

టీ. హేవృషశైలనాథకరుణే! ప్రళయే—ప్రళయకాలమందు, అచిదవిశిష్టాన్ జంతూన్ = అచిత్కల్పములైన అనగా అచిత్తుకంటె వేఱు కానట్టి జంతువులను (చిన్మయుడైన భగవంతునితో సామ్యము నొందవలసిన జీవులు ప్రకృతియందు లీనులై ఱెక్కలులేని పులుగుల వలె యాదృచ్ఛికాది రక్షణవ్యాజశూన్యులై దీనదశలోనున్నట్టి చేతనులను,) అవలోక్య = కనుగొని, జాతనిర్వేదా = పరితాపము గలదానవై, త్వం = నీవు, కరణకళేబరయోగం వితరసి = పరమ పురుషార్థరూపమగు మోక్షమును బొందుటకై కర్మేంద్రియములతో గూడిన శరీరయోగమును కలిగించుచున్నావు. "కర్మ బ్రహ్మోద్భవం విద్ధి" అను గీతోక్తి చొప్పున శరీరయోగము లేనిదే జీవుడు నిష్కామకర్మయోగ మవలంబించి భగవత్ప్రీణనముగ కర్మలాచరించి ముక్తిని బొందలేడు. కావున మోక్షసాధన ముద్దేశించి నీవు జీవులకు దేహసంయోగము కల్గించుచున్నావు. "విచిత్రా దేహ సంపత్తి రీశ్వరాయ నివేదితుం। పూర్వమేవ కృతా బ్రహ్మన్ హస్త పాదాది సంయుతం॥" అను శ్లోకార్థ మిందు వివరింపబడినది. ప్రస్తుత దయాకార్యవర్ణనమున లోకమందు తల్లి కదలమెదలలేని శిశువువిషయమై మిక్కిలి ప్రేమగల్గి, దానిని ఆరోగ్యము కలదిగాను, స్వాయత్త శరీరేంద్రియాదులు కలదిగాను జేయు విషయము స్ఫురించుటచే సమాసోక్తి అలంకారము.

తే॥ ప్రళయమందట్టు లవశతఁ ♦ బ్రజ్ఞ మొదలి
ప్రకృతి నొందిగిన జీవుల ♦ పాలు సూచి
తాళఁగాలేక సృష్టించు ♦ వేళ వాని
కొసగుదువు దయ! దేహసం ♦ యోగ మెలమి॥

తా. ప్రళయకాలమున చేతను లచిత్కల్పులగుచు దీనదశ యం దుండుటను జూచి మిక్కిలి పరితపించుచు, నీవు వానికి మఱల కరణకళేబరవితరణమున మేలు చేయుచున్నావు. అట్టి కర్మసాధన భూతమగు శరీరమును బొంది జీవులు భగవత్కైంకర్యరూపమగు కర్మలు గావించి ముక్తిని బొందుచున్నారు.

18. అవ. కృపాళువైన భగవంతుడు కరణకళేబర ప్రదానానంతరము, ప్రజలు దుర్వృత్తులచే నాత్మనాశము పొందకుండునట్లు భగవత్స్వరూప రూప గుణవిభవాతిశయములను దెల్పుశాస్త్రములును, త్రివర్గసాధనములగు శాస్త్రములును ప్రకటించి, వానిచే జీవుల కజ్ఞానమును చీకటిని తొలఁగించుచున్నాడని తెలుపుచున్నారు.

శ్లో॥ అనుగుణ దశార్పితేన శ్రీధరకరుణే! సమాహిత స్నేహా।
శమయసి తమః ప్రజానాం శాస్త్రమయేన స్థిరప్రదీపేన॥

టీ. హే శ్రీధరకరుణే! సంబోధనము, సమాహితస్నేహా త్వం = ప్రజలయందు సమర్పింపబడిన అనురాగమునుగల నీవు (దీప పక్షమున దీపపాత్రిలో పూరితమగు తైలముగలదని యర్థము.) అనుగుణ దశార్పితేన = అనుకూలమైన సత్వగుణమును గల దశ యందు, అర్పితేన=ప్రజలయందు నిక్షేపబడిన (దీపపక్షమున అనుగతములగు తంతువులు గల వర్తియం దారోపింపబడినదని యర్థము) శాస్త్రమయేన = త్రివర్గాపవర్గ సాధనములను తెలియజేయు శాస్త్ర రూపమైన, స్థిరప్రదీపేన = స్థిరమగు దీపముచే (ఈదీపము తైలా

దులు లేకున్నను ఎప్పుడు స్థిరముగా వెలుగుచుండునని భావము.) ప్రజానాం = జనులకు, తమః=అజ్ఞానమును (దీపపక్షమున చీకటిని) శమయసి = తొలగింపజేయుచున్నావు. "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ। జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తు మిహార్హసి" యను గీతావాక్యముచొప్పున జనులు శాస్త్రదృష్టిచే కృత్యాకృత్యములెఱిగి ప్రవర్తించి యైహికాముష్మిక సుఖము లనుభవింపవలయును. ఆశాస్త్రప్రదానము భగవత్కారుణ్యకార్య మని తెలుపబడినది. బిడ్డలను గన్నతల్లి ప్రజాదృష్టి నిరోధకమగు అంధకారమును నిరసింప నింటిలో దీపమెత్తు విధము దయాకార్యవర్ణనమందు స్ఫురించుటచే అలంకారము సమాసోక్తి.

కం॥ వరగుణదశా సమర్పిత
పరిపూర్ణ స్నేహ యగుచుఁ ♦ బ్రజలకుఁ దమముఁ
నిరసింపఁగ శాస్త్రమయ
స్థిరదీపం బొసఁగి మేలు ♦ సేయుదు కరుణా॥

తా. కరుణా! జనులయందెక్కువఅనురాగముగలనీవు, వారు కృత్యాకృత్యము లెఱిగి ప్రవర్తించి, చతుర్విధపురుషార్థములను బడయుటకై అజ్ఞానాంధకారము తొలగునట్లు శాస్త్రమనే గొప్ప స్థిరమైన దీపమును ప్రదర్శించుచున్నావు. శాస్త్రవిధుల ననుసరించి ప్రవర్తించుటచే జనులు సుఖించుచున్నారు.

19. అవ. చేతనులకు శాస్త్రప్రదానమున సదసద్వివేకము గలిగించుటచే వారు నిన్ను శాస్త్రోక్తరీతిగా నాశ్రయించుచున్నారు. నీవు కల్పలతవై వెలిగి వారికి కోరిన త్రివర్గరూపములగు ఫలము లొసంగి, మనోరథపూరణ మొనరించుచున్నావని తెలుపుచున్నారు.

శ్లో॥ రూఢా వృషాచలపతేః పాదే ముఖకాంతి పత్రలచ్ఛాయా ।
కరుణే సుఖయసి వినతా౯ కటాక్షవిటపైః కరాపచేయఫలైః॥

టీ. హేకరుణే! వృషాచలపతేః పాదే రూఢా = శ్రీనివాసుని పదకమలములం దుదూ్భతయగుచు, పాదప్రణామానంతరము దయ ప్రకాశమానమగుటచే నందు రూఢాయనబడినది, (తీగపక్షమున కొండయందుగున బుట్టినదని యర్థము) ముఖ కాంతి పత్రల చ్ఛాయాం = ఆశ్రితుడు మ్రొక్కిన యనంతరము భగవంతునకు హర్షముచే గల్గిన ముఖవిలాసమును లేక ముఖోల్లాసముచే గల్గిన శోభను, పత్రబాహుళ్యముచే కలిగిన దట్టపు శ్యామలవర్ణముగాగల నీవు, కరాపచేయఫలైః=చేతులకు సులభముగా నందెడు ఫలములు గల, కటాక్షవిటపైః = భగవంతుని కడగంటిచూపులను కొమ్మలచే (భగవత్కటాక్షవీక్షణములు కామితఫలదాయకములగుటచే వానికి విటపత్వరూపణము), వినతాన్ సుఖయసి=నమ్రులగువారిని సుఖింపజేసెదవు. (తీగపక్షమున వినతాన్ వామనులగువారికి నీడను ఫలములను నిచ్చి సుఖింపజేసెదవు.) కరాపచేయఫలైః యనుటచే అందని మ్రానిపండ్ల కఱ్ఱుచాచెడు విధముగాక భగవదనుగ్రహముచే సులభముగా ఫలప్రాప్తియగుట వ్యంజితము.

తే॥ అహిగిరీంద్రుని పదరూఢ ♦ యగుచుం గరుణ!
సప్రసాదాస్య రుచిదళ ♦ శ్యామ నిబిడ
కరతల గ్రాహ్యఫల ధురం ♦ ధర కటాక్ష
విటపములఁ బ్రీతి సల్పుదు ♦ వినతులకును॥

తా. ఓకరుణా! నీవు వృషాద్రినాథుని పదకమలములందు బొడమి, యతని ముఖకాంతిని పచ్చని యాకుల సముదాయశోభగా గల్గి, చేతుల కందునట్టి ఫలవిశేషములుగల భగవద్దయాపాంగములను విటపములచే నొప్పుచు, నాశ్రితులకు కల్పకలతిక వలె కోరిన ఫలము లిచ్చుచున్నావు.

20. అవ. "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥ "అను గీతోక్తిచొప్పున మోక్షఫలవితరణమునకు దగిన మహాత్ములు దుర్లభు లగుటచే, నట్టివారినిగూడ దయాళువగు భగవంతుఁడు సంపాదించి, "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం। దదామి బుద్ధియోగం తం యేన మా ముపాయాంతి తే॥" అన్నట్లు వారికి భక్తిజ్ఞానాదులు గల్గించి స్వయముగా మోక్ష మొసగుచున్నాఁడు. మోక్షమను మహాఫలము నిరతిశయ పురుషార్థమగుటచే నట్టిదానిని గూడ నొసగెడు భగవత్కృపాతిశయమును బ్రకటించుటకై ప్రత్యేక పద్యము నుడువుచున్నారు.

శ్లో॥ నయనే వృషాచలేందోః తారామైత్రీం దధానయా కరుణే ।
దృష్ట స్త్వయైవ జనిమా నపవర్గ మకృష్టపచ్యం మనుభవతి॥

టీ. కరుణే! వృషాచలేందోః = వృషగిరిపైనున్న శ్రీనివాసుడను చంద్రునియొక్క, (సర్వ లోకాహ్లాదకరుడగుటచే చంద్రునితో సామ్యము.) నయనే = కన్నులందు లేక విషయమందు, తారామైత్రీం = కంటిపాపతో స్నేహమును, (చంద్రపక్షమున నక్షత్రములతోటి మైత్రిని) చంద్రునకు తారామైత్రి నిత్యమైనది. అట్టి అవినాభావమగు లేక ఎన్నడు పాయని చెలిమిని, దధానయా = తాల్చునట్టి, త్వయైవ = నీచేతనే, దృష్టః = చూడబడిన, అనగా నీచే నధిష్ఠింపబడిన నేత్రములుగల శ్రీనివాసునిచే చూడబడినట్టి, జనిమాన్ = ఒకానొక సుకృతపరిపాకముచే ప్రశస్తమగు జన్మగల పురుషుడు, ఈయర్థము "జన్మాంతర సహస్రేషు తపోజ్ఞాన సమాధిభిః । నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే ॥"అనుటచే సిద్ధము. అట్లు భగవంతునిచేతను "సుదుర్లభః" అని కొనియాడదగిన మహాత్ముడు దయావీక్షణపరిభావముచే, అకృష్టపచ్యాం

అపవర్గం అనుభవతి = అయత్నసిద్ధమైన మోక్షానందమును అనుభవించుచున్నాడు. అనగా నతనికి ముక్తి కరతలామలకమై యున్నదని భావము. ఈ మోక్షానందము "పరిపూర్ణ బ్రహ్మానుభవ జనిత ప్రీతికారిత తచ్చరణారవింద నిత్యకైంకర్య రసరూప" మని తెలియవలయు. ఇందు "జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః। సాత్త్వికస్సతు విజ్ఞేయస్సవై మోక్షార్థచింతకః॥" అను శ్లోకార్థము వివృతము.

ఆ॥ శేషశైలచంద్రు ♦ శ్రీనాథు నయనతా
రాసఖిత్వ మీవు ♦ రమణఁ దాల్చి
యనఘు నొకనిఁ జూడ ♦ నతఁడు యత్నము లేక
బంధముక్తి సుఖముఁ ♦ బడయుఁ గరుణ॥

తా. కరుణా ! నీవు శ్రీనివాసుని కన్నులందు జేరియుండగా నత డేమహానుభావుని జూచునో, యాత డేవిధమైన ప్రయాసములు లేక భగవద్దాస్య సుఖైకసంగియై, సంసారబద్ధుడు గాకుండును. శ్రీనివాసు డట్టి నిరతిశయమోక్షానంద మొసగుటకు నీవే కారణ మగుచున్నావు. ప్రపన్నులకు మోక్షము సులభ మని భావము.

21. అవ. దయాప్రసాదముచే జీవులు సదాచార్య సమాశ్రయణమున భగవంతుని సర్వభోగ్య వస్తుజాతములకంటె నధికునిగా నెఱింగి, యతనినే శరణని యాశ్రయించుచుండగా, శ్రీనివాసుడు తనకృషి నెరవేరుటను జూచి సంతోషించుచున్నా డనుచున్నారు.

శ్లో॥ సమయోపనతైస్తవ ప్రవాహై రనుకంపే కృతసంప్లవా ధరిత్రీ।
శరణాగత సస్యమాలినీయం వృషశైలేశ కృషీవలం ధినోతి॥

టీ. హే అనుకంపే = దయా ! సమయోపనతైః తవ ప్రవాహైః=చేతనరక్షణోచిత సమయమున పొందింపబడిన, (ప్రవా

హాపక్షమున సస్యాభివృద్ధికి అనుకూలమైనకాలమున తేబడిన)నీప్రవా
హములచే, కృతసంప్లవా=లెస్సగాతడుపబడినట్టి,(చేతనులను దయా
ప్రవాహమున తడుపుట యనగా వారియందు దయార్ద్రభావము
గల్గుటని యర్థము.) శరణాగతసస్యమాలినీ, ఇయం ధరిత్రీ =
భగవంతునియందు రుచికలిగి యతడే ప్రాప్యుడని శరణు సొచ్చిన
వారనే పైరులవరుసలను హారముగా ధరించిన యీభూమి, వృష
శైల కృషీవలం = వృషాద్రిపతియగు శ్రియఃపతి యనే కర్షకుని లేక
వ్యవసాయదారుని, ధినోతి=ప్రీతికలవానిగా చేయుచున్నది. చెడిన
చేనును జూచి యొడయడు మెచ్చడు ; కాని బాగుగా పండినచేనును
జూచి రైతు సంతోషించునట్లు శ్రీనివాసుడు తనకృషి సఫలమైనదని
సంతోషించుచున్నాడు. అతని ప్రసిద్ధకృషి యేమనగా, నతడు
బద్ధజీవులం దాదరణము గల్గి, ప్రోషితసుతోత్సుక పితృ న్యాయమున
(అనగా దూరదేశమునకు పోయిన కొడుకు రాకకై యెదురుచూచు
తండ్రివలె) తదుజ్జీవనార్థము "మయాఽపి పరమానందః త్యక్త్వా
వైకుంఠ ముత్తమం। స్వామిపుష్కరిణీతీరే రమయా సహ మోదతే"
అనినట్లు స్వోచితనిలయ మగు శ్రీవైకుంఠమును బరిత్యజించి, శ్రీదే
వితోకూడ దివ్యమంగళవిగ్రహమును గైకొని, శ్రీవేంకటాద్రిపై
స్వామి పుష్కరిణియను నొక జలాశయతీరమున నావిర్భవించుటయే.
భగవంతు డట్లు చేతనరక్షణోచితమగు దివ్యస్థానమునం దర్చావతా
రుడై యుండ, తన్ను శరణముగా జేరు భక్తులను జూచి యెక్కు
వగా తృప్తి నొందుచున్నాడు. శ్రీవైకుంఠములో నున్నదానికంటె
చేతనుల నాకర్షించు నిమిత్తము దివ్యదేశములందు నెలవు గైకొను
టయే భగవంతున కధిక ప్రీతికరము. "రాజ్యంవా వనవాసోవా
వనవాసో మహోదయః" అనిన శ్రీరామచంద్రుడు సీతాసమే
తుడై చిత్రకూటగిరిపై వేంచేసి "సురమ్య మాసాద్యతు చిత్ర

కూటం నదీం చ తాం మాల్యవతీం సుతీర్థాం। ననంద హృష్టో మృగపక్షి జుష్టం జహౌచ దుఃఖం పురవిప్రవాసాత్॥" అన్నట్లు ఆశ్రితులైన దండకానిలయులగు మునులను రక్షింపను, తద్విరోధులగు రాక్షసులను శిక్షింపను తగిన నెలవు దొరకుటచే పరమానందమును బొంది, అయోధ్యను విడుచుటచే గల్గు దుఃఖమును మఱచిన విధముగానే శ్రీవైకుంఠమున నిత్యసూరులగు అనంత గరుడ విష్వక్సేనాదుల గోష్ఠిని విడిచి, భక్తరక్షణార్థము వేంకటాద్రిపై పురుషకారభూతయగు పద్మాలయాదేవితో వర్తించుటయే భగవంతునకు నిరతిశయానంద హేతు వయ్యెనని యెఱుఁగునది.

మంజుభాషిణి॥ ఉరగాద్రివర్తి కృషి ♦ యొప్ప నీవు మే
దుర సంప్రవాహములఁ ♦ దోడ్పడన్ దయా!
శరణాగతానుపమ ♦ సస్యమాలయై
ధరఁ గాలఁ జూచి హరి ♦ తాల్చు మోదమున్॥

తా. ఓదేవీ! దయా! శేషాద్రివిభుని కృషికి తగినట్లు నీవు తెలియెఱింగి ప్రవహింపగా, నా దేవదేవుని శరణమని యాశ్రయించిన మహాత్ములను సస్యహారముగా ధరించిన పృథ్విని జూచి, యాశేషగిరీశుడను కృషీవలుడు మిక్కిలి సంతోషించుచున్నాడు.

22. అన. "వైకుంఠే తు పరే లోకే శ్రియాసార్థం జగత్పతిః। ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతైస్సహ॥" అన్నట్లు శ్రీవైకుంఠనిలయుఁడును, సదా సూరిజనసేవ్యుడును, పరమకారుణికుడు నైన భగవంతుడు, సంసారచక్రమున దిరుగు చేతనుల నాకర్షించు నిమిత్తము, సౌందర్య మాధుర్య లావణ్యాది గుణోజ్జ్వలమైన దివ్యమంగళవిగ్రహమును ధరించి, యర్చావతారరూపమున వేంకటాద్రిపై నావిర్భవించుట, కేవలము దయాకార్యమని తెలుపుచున్నారు.

శ్లో॥ కలశోదధిసంపదోభవత్యాః కరుణే సన్మతిమంథసంస్కృతాయాః।
అమృతాంశమవైమిదివ్యదేహం మృతసంజీవన మంజనాచలేందోః॥

టీ. హేకరుణే! ప్రతిపద్యమున కరుణా, దయా యని సంబోధనము నాలుక కమృతసేచనమై యున్నది. అంజనాచలేందోః= అంజనగిరిపై వర్తించు చంద్రునియొక్క, (సకల నయనానందకరుడగుటచే శ్రీనివాసుని చంద్రునితో నధ్యవసింపబడినది.) మృతసంజీవనం దివ్యదేహం= భగవద్రుచ్యాదు లెఱుంగక సంసారసుఖసంగులై అందుచే మృతప్రాయులై యున్న జనులకు సంజీవనౌషధమై పరగు భగవంతుని అత్యద్భుతమగు దివ్యమంగళవిగ్రహము, కలశోదధిసంపదః = క్షీరసాగరముయొక్క పౌష్కల్యమును దాల్చిన, అనగా శీతలత్వ మధురత్వ మహత్త్వాది గుణములుగలదానవును, సన్మతిమంథ సంస్కృతాయాః " సంభవామ్యాత్మమాయయా " అన్నట్లు భగవత్సంకల్పమను మంథానము, లేక కవ్వముచే బాగుగా మథింపబడినదానవును అగు, భవత్యాః = నీయొక్క; అనగా మథించనిదే యమృతము పుట్టదు. భగవంతుని సంకల్పము లేక స్వేచ్ఛయే మంథము, దానిచే ద్రవ్వబడిన నీయొక్క, అమృతాంశం అవైమి= అమృతస్వరూపమని తలచెదను. సన్మతిమంథ సంస్కృతాయాః అనుటకు సాధువులు లేక భక్తులు వారియొక్క పునఃపునః ప్రార్థనముచే నావిర్భవించెననియు తెల్పవచ్చును. దివ్యదేహమను అమృతమును గల్గించుటకు పాలకడలియొక్క సంపదను దాల్చిన నీయొక్క మహిమయే కారణము. " న తేరూపం నచాకారో నాయుధాని నచాస్పదం। తథాపి పురుషాకారో భక్తానాం త్వం ప్రకాశసే॥ " అనునట్లు భగవంతుడు భక్తప్రార్థనచేతనే వారి రక్షణార్థము అప్రాకృత దివ్యశరీరమును ధరించుచున్నాడు. చంద్రు డమృతకిరణుడైనట్లు శేషాచల చంద్రుని దివ్యదేహము దయాసారభూతమై మృత

కల్పులగు చేతనులకు సంజీవనామృతమయమై యున్నది. సాధార ణామృతము మృతజీవనము, శ్రీనివాసుని దివ్యమంగళశరీరము మృత సంజీవనమని విశేషము.

మంజు॥ మహి దుగ్ధసింధు గరి ♦ మా దనర్చి స
త్సమ్మహాచే ప్రచాల్య యగు ♦ దేవి ! నీకతం
బహిరా డ్గిరీందుఁ డమ్మృ ♦ తాంశమైన వి
గ్రహ మొందెనోకొ మృత ♦ కల్పజీవియై॥

తా. దయా ! పాలకడలిసొంపుచే మించుదానవును, సాధు వుల ప్రార్థనయను మంధరగిరిచే ద్రవ్వఁబడినదానవు నగు నీయొక్క సారాంశభూతమగు అమృతమయ దివ్యశరీరమును శేషశైలవర్తి యగు శ్రీనివాసుడను చంద్రుడు ధరించెను గాఁబోలును.

23. అవ. సంసర జ్జంతు వశీకరణానుగుణ దివ్యమంగళ విగ్రహ స్వీకారము దయావిధేయత్వముచే నని చెప్పబడినది. అయితే నిజాజ్ఞాతిలంఘనశీలురగు జనులపై నిగ్రహసంకల్పము బూనువాఁడును, దానికి హేతువగు క్రోధవశ్యతను బొందు భగవం తుని విషయములో, దయైకశరణ్యుల మగు మనకు రక్షకుండగు నని నమ్మ కెట్లను శంకను బరిహరించుటకై క్రింద రెండుశ్లోకములు చెప్పుచు, అందీశ్లోకమున స్వాశ్రితుల విషయమున భగవంతుడు నిగ్రహ సంకల్ప వర్జితు డగుచున్నాడని వక్కాణించుచున్నారు.

శ్లో॥ జలధేరివ శీతతా దయే త్వంవృషశైలాధిపతే స్స్వభావభూతా।
ప్రళయారభటీనటీంతదీక్షాంప్రసభంగ్రాహయసిప్రసక్తరోషాం॥

టీ. దయే ! జలధేః = సముద్రముయొక్క, శీతతేవ = చల్ల దనమువలె, త్వం = నీవు, వృషశైలాధిపతేః = శ్రీనివాసునియొక్క స్వభావభూతా = నైజమగు గుణమై పరగుదానవు. సముద్రము

లోని నీరు సూర్యకిరణతప్తమైనను పైభాగమునందు మాత్ర ముష్ణత్వమును బొందును. లోపల నంతటయు చల్లదనమునే కల్గియుండును. 98 వ శ్లోకమున దీనినే "జహ్యాత్ వృషాచలపతిః ప్రతిఘేపి న త్వాం ఘర్మోపతప్తఇవ శీతలతా ముదన్వాన్" అని క్రోధసమయమునందును స్వాభావికమైన దయను భగవంతుడు విడువడని నిదర్శనముగా తెల్పుచున్నారు. సముద్రమునకు శీతలత్వము నైజమగునట్లు భగవంతునకు దయ నైజమనుటచే, కోపమును దాల్చుట సముద్రమున కుష్ణత్వమువలె, నైజముకాదని ధ్వనించుచున్నది. అట్టి శ్రీనివాసునకు స్వభావభూతయగు నీవు ప్రళయారభటీనటీం = ప్రళయమునను అతిప్రచండరూపమగు ఉద్ధత నృత్యమునందు రుచిగల, తదీక్షాం=ఆశ్రీనిలయునిదృష్టిని లేక సంకల్పమును, ప్రసత్తిలాస్యం=ప్రసాదము అనుగ్రహమను సుకుమారనాట్యముగా, ప్రసభం = బలాత్కరించి, గ్రాహయసి = పరిణమించునట్లు చేయుచున్నావు. భగవంతుని కోపోద్రేకముచేతనగు దండన కృత్యము భయంకరమగు ఆరభటీ నటనము వంటిది. దానిని దయ, కింకరీభూత జ్ఞానశక్త్యాదిగుణములు గలదగుటచే, శక్తిమంతురాలై ప్రసాదించుటను సుకుమార అంగవిన్యాసము గల లాస్యలీలగా మార్చుచున్నది. అనగా భగవంతుని నిగ్రహ పారవశ్యతను బోగొట్టి, యాశ్రితుల విషయమునం దనుగ్రహపరునిగా జేయుచున్నదని యాశయము. "రిపూణామపివత్సల" యని గరుడుడు పొగడదగిన గుణాతిశయము గల శ్రీరామచంద్రమూర్తి "సతం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతం। వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్॥" అని కాకాసురునిపైఁ జూపిన దయావిధేయత్వము దీనికి నిదర్శనము.

మ॥ జలరాశి శీతలత • చాడ్పునన్ రమా
నిలయ స్వభావయగు • నీవు నాథునిన్

ప్రళయాఖ్య దుర్ఘటన ♦ రక్షన్తీ దయా !
లలితాశ్రితాదరణ ♦ లాస్యం జేయవే॥

తా. దయా ! సముద్రమునకు చల్లదనము నైజమైనట్లు, దయనుజూపుటయే తనకు స్వభావముగా గల శ్రీనాధుడు, నిజాజ్ఞను మీఱు పాపవర్తనులపై క్రోధము బూనినను, నీవు బలాత్కారముగా నతని లోఁబఱచి, యాశ్రితుల విషయమునందు సర్వదా ప్రసాదమునే చూపునట్లుచేయుదువు. ఏమి నీమహిమ !

24. అవ. స్వాశ్రితవిషయమున నిగ్రహసంకల్పవర్జితుడగుటయేగాక, వారికి మేలుచేయనెంచి, తద్విరోధులను సమూలముగా భగవంతుడు నిరసించుచున్నాడని తెలుపుచున్నారు.

శ్లో॥ ప్రణతిః ప్రతికూలమూలఘాతీ ప్రతిఘః కోపి వృషాచలేశ్వరస్య।
కలమే యవసాపచాయనీత్యా కరుణేకింకరతాం తవోపయాతి॥

టీ. ప్రణతః ప్రతికూల మూలఘాతీ = పాదప్రణామము చేయువారికి భగవత్ప్రాప్తికి విరోధమై యుండువానినెల్ల సమూలముగా నశింపఁజేయునట్టి (మూలఘాతము చేయుటచే తిరిగి వృక్షము పెరుగకుండునట్లు, ఒక్కమాటే ఆశ్రితులకు విరోధమైన సమస్తపాపములను తొలగజేయుచున్నదని భావము.) వృషాచలేశ్వరస్య= శ్రీనివాసునియొక్క, కోపి ప్రతిఘః = ఒకానొక అనగా అనిర్వాచ్యమైన కోపము. ఈకోపము లౌకికక్రోధమునకు వేఱైనది. "క్రుద్ధో హన్యా ద్గురూనపి" "గురునైననిందించు క్రుద్ధుడైన," "క్రోధః పాపస్య కారణం" అని పలువిధములుగా తెలుపబడిన కోపమనే గుణము మనుష్యుల దుర్గుణములలో ముఖ్యమైనది. అయితే భగవంతుని చెందు కోపము, ఖరాదుల వధసందర్భమున శ్రీరామచంద్రుని విషయమై "క్రోధ మహారయ త్తీవ్రం," "కోపస్య వశ

మేయివాక్ " అని చెప్పియుండునట్లు ఆశ్రితరక్షణార్థ మావ్యాత్తమై తద్విరోధులపై విసర్జింపబడుటచేత శ్లాఘనీయమును, కల్యాణగుణములలో ప్రధానముగాను గణింపబడును. అట్టి భగవంతుని క్రోధము, కలమే యవసాపచాయనీత్యా = పైరుల అభివృద్ధికై కలుపుమొక్కలను తీసివేయు న్యాయము ననుసరించి (పనికిమాలిన కలుపుమొక్కలు పైరుల వృద్ధికి హానికరములు, సమూలముగా వానినెల్ల నశింపజేయుట పైరుల వృద్ధికి కారణము. అట్లే ఆశ్రితుల అభివృద్ధిని గోరిన శ్రియఃపతి తద్విరోధులను నశింప జేయుచున్నాడని భావము.) ఆశ్రితులకు మేలుచేయునట్టిదియై నీమహిమచే బరిణమించి, తవ కింకరతాం ఉపయాతి = నీకు విధేయమై నీవు చెప్పినట్లు ప్రవర్తించుచున్నది. దీనినే వెనుక " దిశత్యేవం దేవో జనితసుగతిం దండనగతిం " అని దృష్టాంతములతో 63 వ పద్యమున వివరించుచున్నారు. ఆశ్రితవిరోధినిరసనముచే నాశ్రితునకు అభివృద్ధియే కల్గుచున్నదని భావము.

మంజు॥ శ్రితవైరిమూల హతిఁ ♦ జేయు వేంకట
క్షితిభృత్పతిక్ గుణ ♦ చెందుకోప మా
యతసస్యవృద్ధి యవ ♦ సాంతినీతి స
త్కృతిమై భజించు భవ ♦ దీయ దాస్యముక్॥

తా. శ్రీవేంకటేశ్వరుని కోపము, నిజాశ్రితుల శత్రువులపై ప్రసరించి సమూలముగా వానిని నశింపజేయుటచేత దయా! యవసాపచాయము సస్యాదులవృద్ధికి మూలమైన న్యాయము ననుసరించి నీక్రోధము విధేయమై వర్తించి యాశ్రితులకు శతృహననము చేసి మే లాచరించు చున్నది.

25. అవ. సకలగుణంబులకు ప్రభ్వియు, నిగ్రహ ప్రసంగరహితయు సర్వదా అనుగ్రహైకరసికయునగు దయా! నిన్నే జ్ఞాను

లగువారు శరణముగా భావించి యాశ్రయించెదరని తెలుపుచు న్నారు.

శ్లో॥ అబహిష్కృత నిగ్రహాన్ విదంతః కమలాకాంతగుణాన్ స్వతం త్రితాదీన్। అవికల్ప మనుగ్రహం దుహానాం భవతీ మేవ దయే భజంతి సంతః॥

టీ. హేదయే! కమలాకాంతగుణాన్ = శ్రీనాథునిగుణాంత రములగు, స్వతంత్రితాదీన్ = నిరంకుశ స్వతంత్రిత, లేక అనన్యా ధీనత్వము మొదలగు సర్వగుణాంతరములును, అబహిష్కృతనిగ్రి హాన్ విదంతః = వెలికిద్రోయని నిగ్రిహాపయుక్తత్వమును గల విగా నెఱింగినవారై, అనగా నిగ్రిహమున కనుగుణమైనట్టివిగా నెఱిగి, సంతః = సారాసారవివేకముగల జ్ఞానులు, అవికల్పం అను గ్రిహం దుహానాం -- ఒకప్పుడు నిగ్రిహమును మఱియొకప్పు డను గ్రిహము చూపుటయని వేఱుపాటులేక సర్వకాల సర్వావస్థల యందు అనుగ్రిహమునే కురియునట్టి (దుహానాం అనుటచే పొదువు బరువుచే లోఁ బట్టలేక తనంతట క్రిందికి పాలను స్రివింపజేయు ధేనువుపగిది యని ధ్వనించుచున్నది.) భవతీమేవ = నిన్నే; ఏవ అనుటచే గుణాంతరములను కాదనియు, గుణేంశుడగు శ్రీనివాసుని గూడ కాదనియు నిశ్చయార్థము; భజంతి = సర్వవిధపురుషార్థము లను బొందుటకు ప్రాపకముగాను ప్రాప్యముగాను దలచి సేవించు చున్నారు; లేక శరణమని భావించుచున్నారు.

మంజు॥ త్రియుగేశు వీర్యబల ♦ ధీ గుణాదు ల
న్నియు నిగ్రహంబునకు ♦ నేర్చునంచు, ని
శ్చయ సుప్రసాద మని ♦ శం బొసంగు నిన్
దయ! సంశ్రయింతు రిలఁ ♦ దద్దయున్ బుధుల్॥

తా. దయా! సారాసార మెఱింగిన చతురమతులు నిగ్రహమునకు పనికివచ్చు భగవద్గుణాంతరములైన నిరంకుశ స్వాతంత్ర్య తేజో బల జ్ఞాన శక్త్యాదుల నెల్ల విడిచి, సర్వకాలము అనుగ్రహ బుద్ధిగల నిన్నే శరణమని యాశ్రయించెదరు. అట్టి మహాత్ముల యొక్క యోగక్షేమములను నీవే భరించెదవని యర్థము.

26. అవ. కమలాపతిని విడిచి దయను శరణమని భావించుటకు మఱియొక కారణమును విశదీకరించుచున్నారు.

శ్లో॥ కమలానిలయ స్త్వయా దయాళుః కరుణే నిష్కరుణా నిరూపణే త్వం। అతఏవ హి తావకాశ్రితానాం దురితానాం భవతి త్వదేవ భీతిః॥

టీ. హేకరుణే! సంబోధనము; కమలానిలయః = శ్రీనివాసుడు, త్వయా దయాళుః = నీచేత అనగా నీసాహచర్యముచేతగాని నీయుపదేశముచేతగాని దయగలవా డగుచున్నాడు; త్వం = పతి కుపదేశించు నీవు, నిరూపణే=విచారించిచూడ లేక నీవుచేయు కార్యమును బట్టిచూడగా, నిష్కరుణా = కరుణలేనిదానవే, అదెట్లని సమర్థించుచున్నారు; అతఏవహి = అందుచేతనేకదా, తావకాశ్రితానాం దురితానాం = నీ యండ చేరినవారి పాపసముదాయములకు, త్వదేవ = నీవలననే, భీతిః భవతి = భయము కలుగుచున్నది. నీయాశ్రితుల పాపరాసులు నీవలని భీతిచేత, వారలను విడచి తొలగుచున్నవని భావము. “ మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ ” అని గీతలందు చెప్పబడినరీతిగా ఆశ్రితుల పాపములను దయాళువగు భగవంతుడే తొలగఁ జేయుచున్నాడు. కరుణను ‘ నిష్కరుణా ’ యని చెప్పి దానిని ఉత్తరార్థముచే సమర్థించుటచే, అలంకారము కావ్యలింగము ; మఱియు కరుణను “ నిష్కరుణా ” యనుట పైకి నింద

కాని, సమాశ్రితులను దురితవర్జితులుగా జేయుచున్నదనుటచే, స్తుతిగర్భితమగు నిందయగును, కావున వ్యాజస్తుతి యలంకారము.

మంజు॥ భవదీయసంగతిఁ గృ ♦ పాళువయ్యె మా
ధవుఁ డీవ నిర్దయతఁ ♦ దాల్తు వందుచే,
నవధీరితంబు లయి ♦ యాశ్రితాఘముల్
దవుదవ్వులఁ బఱచుఁ ♦ దల్లి భీతిచే॥

తా. దయా! నీసాంగత్యముచేతనే శ్రీనివాసుడు దయాళు వగును. నీవన్ననో కరుణ యించుక కూడ లేనిదానవు. ఏలననగా నిన్నాశ్రయించినవారి పాపము లన్నియు నీవలన భయమును జెంది వారిని విడిచి పారిపోవుచున్నవి.

27. అవ. ఇక క్రింది రెండుపద్యములచే కరుణను నీవే భగవంతున కాపత్సఖియని వర్ణించుచున్నారు.

శ్లో॥ అతిలంఘిత శాసనే ష్వభీక్ష్ణం వృషశైలాధిపతి ర్విజృంభితోష్మా।
పునరేవ దయే క్షమానిదానై ర్భవతీ మాద్రియతే భవత్యధీనైః॥

టీ. హేదయే! "శ్రుతి స్స్మృతి ర్మమైవాజ్ఞా యస్తా ముల్లంఘ్య వర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః॥" అన్నట్లు, అతిలంఘిత శాసనేషు=భగవదాజ్ఞారూపములైన శాస్త్రోక్తక్రియలను వర్జించుటచేతను, అకృత్యాచరణముచేతను దూషితులగు మాబోటి జనులయందు, అభీక్ష్ణం = ఎక్కువగా, విజృంభితోష్మా వృషాచలపతిః = కోపాతిశయమును బొందు వేంకటాచలపతి, భవత్యధీనైః=నీచే కల్పింపబడిన, క్షమానిదానైః = క్షమకు లేక మన్నించుటకు హేతువులగు భక్తిప్రపత్త్యాదులచే, పునరేవ భవతీం ఆద్రియతే = మఱల పూర్వముకంటె నెక్కువగా నిన్నే ఆదరించుచున్నాడు. నీ వా వృషాద్రినాథుని క్షమకు గారణభూ

తములగు భక్తిప్రపత్త్యాదిక్రియలు నీవే చేతనులచే గావించుటం జేసి, నిన్నే ఎక్కువగా నాదరించుచున్నాడు. గుణేశ్వరి యగు నీకు విధేయుఁడై నీచే దయాళువై, నిగ్రహప్రవృత్తిని మాని యనుగ్రహైక రసికు డగుచున్నాడని భావము. అందుచేత నీవు భగవంతునకు ఆపత్సఖి యగుదువు. అందుచేతనే నిన్ను సాధువులు శరణమని తలచెదరు. "భవతీ మేవ భజంతి సంతః."

మంజు॥ అతిలంఘితాజ్ఞులగు ♦ నస్మదాదులం
దతికోపియైన వృష ♦ భాద్రినాథుఁడుర్
హితవై క్షమించుగతు ♦ లీవ చూప మా
కతిమాత్రతం గరుణ ♦ యాదరించు నీ ॥

తా. హేకరుణా! మేము భగవదాజ్ఞను మీఱి వర్తించి యతని నిగ్రహమునకు బాత్రుల మైనను, నీవు మాచేత భక్తి ప్రపదనవిధులు మున్నగు క్రియలు చేయించి, భగవంతుడు మమ్ము క్షమించునట్లు చేయుటచేత, అతికుపితుడైనను నీయందలియాదరాతిశయము ప్రకటించుచు, నీకు విధేయు డగుచు మాయందు కరుణనే చూపుచున్నాడు.

28. అవ. చేతను లాచరించు దురితజాలములను శత్రువులను జయింపనెంచి, యాపత్సఖియగు నిన్నే పురస్కరించుకొనుచు వేంకటశైలమున శ్రీనివాసుడు నెలకొనియున్నాడని సమాసోక్తి యలంకారముచే వివరించుచున్నారు.

శ్లో॥ కరుణే దురితేషు మామకేషు ప్రతికారాంతర దుర్జయేషుఖిన్నః॥
కవచాయితయాత్వయైవశార్ఙ్గీవిజయస్థానముపాశ్రితోవృషాద్రిం॥

టీ. హేకరుణే! ప్రతికారాంతర దుర్జయేషు, మామకేషు, దురితేషు = జప హోమ దాన సురార్చనాదులగు ప్రాయశ్చిత్త

విధులచే నశింపఁజేయ నలవికాని మాయొక్క అనాదికాలప్రవృత్తానంత పాపసంచయములను శత్రువులను జయింపలేక (చేతనులు క్షణార్ధకాలమునందు అనేకజన్మలకైనను తీరనట్టి పాపములు చేయుచుండుటచే, నవి మాయుక్రియలచే నశింపజేయ సాధ్యపడదు. దీనినే ఆచార్యులవారు " అనుభవితు మఘౌఘం నాల మాగామి కాలః ప్రశమయితు మశేషం నిష్కృతియాభి ర్నశక్తం "అని 34 వ శ్లోకమున తెల్పుచున్నారు. " అనుక్షణ సముద్గతే దురితవారిధౌ దుస్తరే యది క్వచన నిష్కృతి ర్భవతి సాపి దోషావిలా " అను రీతిగా ప్రతిక్షణ ముప్పొంగు పాపసముద్రమును శోషింపజేయ ప్రాయశ్చిత్తాదు లాచరించుచుండ, నదుమ నెన్నియో దోషములు తిరిగి సంభవించుచుండును.) కావున నిర్జింప నలవికాని చేతనుల పాపపుంజముల విషయమై శ్రీనివాసుడు, ఖిన్నః = దుఃఖించినవాడై; పరదుఃఖములను జూచి సహింపకుండుట భగవంతునకు నైజమగుట " వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః। ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి॥ " అని శ్రీరాముని కల్యాణగుణము లలో నొకటిగా వాల్మీకులవారు వర్ణించియుండుటచే స్పష్టము ; లేక ఖిన్నః = సృష్టికాలమున చేతనులకు కరణకళేబర మొసంగియు భగవత్ప్రీణనములగు కర్మలు చేసి ముక్తిని బొందకుండ సంసారసుఖసంగులై, పాపసంచయ దూషితులై తన్ను జేరమికిని, తన సృష్టి కార్యము విఫలమగుటకును నిర్విణ్ణచేతస్కుడై, శార్ఙ్గీ = శార్ఙ్గమను వింటిని ధరించిన సర్వేశ్వరుడు, కవచాయితయా త్వయైవ = పాప శత్రువులను జయింపలేని దశలో గుణాంతరములను విడిచి ఆపత్సఖి యని నిన్నే సహాయముగా గొని కవచముగా ధరించి, క్షమించుటకు వ్యాజము సంపాదించు నిమిత్తము, విజయస్థానం వేంకటాద్రిం= శత్రుహననము చేయుటకు వీలైనట్టి వేంకటాద్రియను స్థానవిశేష

మును, "ధన్యాని స్థలవైభవేన కతిచి ద్వస్తూని" యన్నట్లును, "స్థానబలిమిగాని తనబల్మికాదయా" అనుచొప్పునను శత్రువుల జయించుటకు స్థానబలము విశేషము గనుక, దుర్గమమైన వేంకట శైలమును, ఉపాశ్రితః=పొందినవాడయ్యెను. "వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన" అన్నట్లు దివ్యదేశములందు వేంకటాచలక్షేత్రము ప్రసిద్ధమైనది. పరమాత్ముఁడు శ్రీవైకుంఠవాసము పరిత్యజించి, సాధువులచే గొనియాడదగిన క్షమా వాత్సల్య సౌశీల్య సౌలభ్య సౌందర్య సౌకుమార్యాదుల కునికిపట్టగు దివ్యమంగళరూపమును గొని, స్వయముగా అర్చావతారుడై వేంకటశైలనివాసమును గొనిన కారణమున సేవకులు, అభిగమన ప్రణామ సేవా పూజాదులగు క్షమాహేతుకములగు క్రియలచే దురితవర్జితులగుచు, స్వామి కటాక్షమునకు బాత్రులగుచున్నారని యాశయము. 'శార్ఙ్గి' యను విశేష్యము జయసూచకమగు సాధనసంపత్తిని దెలుపునట్టిది. అందుచే అలంకారము, పరికరాంకురము. ఒకానొక నరపతి, ప్రబలులగు శత్రువుల బాధ కోర్వలేక, వారిని జయించు నిమిత్తము, ధనువును బూని, కవచములేక మఱువును దొడిగి, దుర్గమప్రదేశము నందుండి పగవారిని బాఱద్రోలుచుండు అప్రకృత లౌకికవృత్తాంతము, ప్రకృతమైన దయాస్తుతి విషయమునందు గోచరమగుటచే అలంకారము సమాసోక్తి యనబడును.

మంజు॥ ప్రజలాచరించు నఘ ♦ రాసు లొండుమై
విజితంబు గామి వల ♦ వించి శార్ఙ్గి, ని
త్యజయార్థి దేవి! మఱు ♦ వై ధరించి నిన్
విజయస్థలంబు గొనె ♦ వేంకటాద్రిపై ॥

తా. ఓదయా! ప్రజలు గావించు పాపరాసులనే శత్రువుల గెల్చుట కుపాయము గానక ఖేదమునొందినవాడై శ్రీనివాసుడు

శార్ఙపాణియై, యాపత్సఖియగు నిన్నే కవచముగా దొడుగుకొని, చేతనుల పాపశత్రువుల జయించుట కనుకూలమైన స్థానమగు వేంకటాద్రిని జేరెను. అక్కడ అర్చావతారరూపమున వెలుగుచు సేవకుల పాపముల హరించుచున్నాడని యర్థము.

29. అవ. చేతన దురంతదురిత విజయార్థము శార్ఙధన్వుఁడు కరుణాసహాయుడై వేంకటాద్రిపై నున్నను, మదీయ పాపము లనంతము లగుటచే జయింప నలవికాదని తలచినవారై నన్ను రక్షింప దలంచునో తలంపడో యనియు, నన్ను విడిచి మితపాపులగు నితరుల రక్షింపఁ దలచునేమో యని విచారించి, యాచార్యులవారు తమవిషయమై శంకగొనిన దయనుగూర్చి పలుకుచు తన్ను రక్షింప వేడుకొనుచున్నారు. మహాత్ములకు నైచ్యానుసంధానము సహజమే కదా!

శ్లో॥ మయి తిష్ఠతి దుష్కృతాం ప్రధానే
మితదోషా నితరా న్విచిన్వతీ త్వం।
అపరాధగణై రపూర్ణకుక్షిః
కమలాకాంతదయే కథం భవిత్రి॥

టీ. హేకమలాకాంతదయే=ఓ శ్రియఃపతికరుణా! దుష్కృతాం ప్రధానే మయి తిష్ఠతి (సతి) = పాపవర్తనులలో నగ్రేసరుడనై నే నిట్లుండగా (మహాపాపతముడనై నాపాపచయముల నీకుపహారముగా నొసంగి నీకు దృప్తియగున ట్లాహార మొసంగుటకు సిద్ధముగా నుండగా సులభుడై చేరువనున్న నన్నువిడిచి) మితదోషాన్ ఇతరాన్ = స్వల్పదోషయుక్తులగు ఇతరజనులను, త్వం విచిన్వతి = నీవు వెదకుచున్నావు (వారు నీకు పూర్ణాహార మొసగలేరు, వారిచే నీపొట్ట నిండదు. దయనీయతమత్వము పాపాధిక్యతను బట్టి యుం

డును. అపరాధసహస్రభాజనుడనగు నావిషయమందేదయచూపుట నీకుతగును) అపరాధగణైః = అనేకవిధములైన భగవదపచార భాగవతాపచారాదులగు దుష్కృతసమూహములచే, అపూర్ణకుక్షిః = నిండని కడుపుగల నీవు కథం భవిత్రీ = ఏమి కాగలవో ఆహారము పూర్ణముగా దొరకమిచే కృశించి సత్తాహీనత పొందుదువు కదా. అందుచే నీకు పూర్ణాహార మొసగుటకు సన్నిహితమైయున్న నన్నే పాపరహితునిజేసి యుజ్జీవింప దలంపుము. ఆహారపూర్తి కలుగజేయుటకు దగిన పాపకృత్తముడ నగు నన్ను విడిచి కడుపునిండ కుడువ బెట్టలేని మితపాపులయెడకు పోవుట నీ తెలివి తక్కువ యగునని దయను నిందించినట్లు తోచుచున్నను (దయనీయతరైరపూర్ణకుక్షిః=యను పాఠాంతరమును బట్టి) ఒకానొక మహత్తర పాపవర్తనుడగు చేతనుని రక్షింప సంకల్పించుచున్నట్లు స్తుతి వ్యంజిత మగుచున్నది. కావున వ్యాజస్తుతి యలంకారము. దీనివలన అనవధి కాసంఖ్యే యాపరాధవర్గ దూషితుండగు నన్ను అనుగ్రహించుటకు పూర్ణపాత్రముగా పరిగణింపుమని ఫలితార్థము.

మం॥ అపరాధ భాజనుల ♦ కగ్రవర్తినై
కృప ! నే నిటుండఁ బరి ♦ కింప కీవు స్వ
ల్పపు పాపులైన జను ♦ లఁ దలంచు టే
నిపుణంబు ? నీకడుపు ♦ నింపు టెట్లగుఁ॥

తా. మహాపరాధులలో ముఖ్యుడనగు నన్ను రక్షించుట మాని స్వల్పపాపము చేసినవారిని రక్షింపదలంచెదవు. వారొసంగెడు పాపోపహారములచే నీకడుపు నిండనేరదు. అందుచే నన్నే రక్షించి నాపాపములనే హరించి యభివృద్ధి నొందుము.

30. అవ. నాకంటె లోకము లోనివారెల్లరు మితపాపులు. నీయనుగ్రహమునకు నన్నే పాత్రునిగాఁ జేకొని యాశ్రీనివాసుని పాదములందు సమర్పింపుమని దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ అహమ స్మ్యపరాధచక్రవర్తీ
కరుణే త్వంచ గుణేషు సార్వభౌమీ ।
విదుషీ స్థితి మీదృశీం స్వయం మాం
వృషశైలేశ్వర పాదసాత్కురుత్వం॥

టీ. అహం అపరాధచక్రవర్తీ అస్మి = నేను అపరాధములు చేయుజనులలో నగ్రగణ్యుడ నగుచున్నాను. లేక అపరాధమే చక్రము దానిని మాటిమాటికి కులాలచక్రమువలె ప్రవర్తింపఁ జేయువాడను, లేక అపరాధచక్రము (మండలము) దాని మధ్య ప్రవర్తించువాడను, అనగా ఎల్లప్పుడపచారములు చేయుచుండువాడను, అహం శబ్దము చక్రవర్తిత్వముచే గల్గిన యహంకారమును స్ఫురించుచున్నది. త్వంచ = "మోక్షయిష్యామి మాశుచ" "నమే భక్తః ప్రణశ్యతి" "మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యతి" యని ప్రతిజ్ఞ చేసినట్టినీవన్ననో, గుణేషు సార్వభౌమీ= భగవత్కల్యాణగుణములమధ్య మొదట గణింప దగినదానవు. దాసీభూత సమస్త జ్ఞానశక్త్యాది గుణములు గలదానవని యర్థము. ఈదృశీం స్థితిం = ఇట్టిస్థితిని, నాచక్రవర్తిత్వమును, నీయొక్కసార్వభౌమిత్వమును, విదుషీ = తెలిసిన నీవు, అనగా చక్రవర్తిత్వము గాని సార్వభౌమిత్వముగాని, యొక్కనికే తగును. ద్వైరాజ్యస్థితి మంచిదికాదు, శత్రువును దెలిసినవెనుక వానివిషయమై యుపేక్ష కూడదు. కావున జ్ఞానశక్త్యాది సాంగత్యముచే బలవంతురాలగు, త్వం = నీవు, మాం = నన్ను దయనీయుడగునన్ను, లేక రాజుపక్షమున దుర్బలుడైన నన్ను, వృషశైలేశ్వర పాదసాత్కురు=శ్రీనివాసుని పాదముల కధీనవర్తనుసిగా జేయుము. తత్పాదకైంకర్య నిరతునిగా జేయుమని యర్థము. లోకములో చక్రవర్తిద్వయ మున్నయెడల, నందు బలవంతుడగువాడు బలహీనుని నోడించిగోలు

సులతో గట్టి, యొక పర్వతపాదప్రదేశమున పడవేసి, వానిరాజ్యమంతయు స్వాధీనము చేసికొని తానే సార్వభౌముడగుట సహజము. అట్టి నరపతుల వృత్తాంతము ప్రస్తుతార్థమున స్ఫురించుటచే సమాసోక్తి అలంకారము.

మంజు॥ సతతాపచార జన ♦ చక్రవర్తి నే
సతతంబు దేవి ! గుణ ♦ సార్వభౌమి నా
స్తుతిఁ గంటి వీయునికిఁ ♦ జూచి నీవ శ్రీ
పతి కొప్పగింపు ననుఁ ♦ బాదభృత్యుఁగా॥

తా. ఓదయా ! నేను పాపవర్తనులకెల్ల చక్రవర్తియగుదును నీవు గుణేశ్వరివి. ఇద్దఱికి ప్రభుత్వము చెల్లదు. మహాబలవంతురాలగు నీవు బలహీనుడైన నన్ను గెల్చి శ్రీనివాసునకు పాదకింకరునిగాఁ జేయుము. ఇదియే నీకు నాయందనుగ్రహము కల్గుటకు ఫలము.

31. అవ. శరీరావసానమున శ్రీరమారమణుని చరణపరిచర్యా నిరతునిగా జేసెదవు గాని, యంతవరకు వృషగిరి మొదలగు దివ్యదేశములందు ఎడతెగని నివాసము నాకు కల్పింపవలయునని దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ అశిథిల కరణే స్మి న్నక్షత శ్వాసవృత్తౌ
వపుషి గమనయోగ్యే వాస మాసాదయేయం ।
వృషగిరికటకేషు వ్యంజయత్సు ప్రతీతైః
మధుమథనదయే త్వాం వారిధారావిశేషైః॥

టీ. హేమధుమథనదయే! = ఓ మధువైరియగు శ్రీనివాసుని దయా ! అస్మిన్ వపుషి = ఈశరీరమునందు, అశిథిలకరణే = వృద్ధభావముచే కర్మజ్ఞానేంద్రియముల పటుత్వము తగ్గుటకుమునుపే, అనగా ముదిమి రాక మునుపే, అక్షతశ్వాసవృత్తౌ = ఉచ్ఛ్వాస

నిశ్వాసములకు నిరోధము రాకమునుపే అనగా మరణదశకు ముందు గానే, అందుచేతనే శరీరము గమనయోగ్యేసతి = దివ్యదేశములకు బోవ యోగ్యత కలిగినపుడే, ప్రతీతైః = ఇహపరలోక సౌఖ్యదాయకములని లోకశాస్త్రము లందు ప్రసిద్ధి నొందిన, వారిధారావిశేషైః = ఆకాశగంగ, పాపనాశము మొదలగు జలపాతవిశేషములచే, త్వాం వ్యంజయత్సు = శీతలత్వ మధురత్వ తాపహరత్వాది గుణములచే నిన్ను ప్రకాశింపజేయు, లేక నీస్మారకమును గలిగించునట్టి (ఈజలప్రవాహములు భగవంతుని దయాప్రవాహములే యని, యుత్ప్రేక్షింప దగియున్నవని భావము) వృషగిరికటకేషు = వేంకటాద్రి సానువులయందు, వాసమాసాదయేయం = నిత్యవాసమును సమకూర్చవలయు "యావచ్ఛరీరపాత మత్రైవ శ్రీరంగే సుఖమాస్వ" యని దేశికులవారి విషయమై శ్రీరంగనాయకి దేవి తెల్పినట్లు భగవ ద్దయావైభవ ప్రకాశమానములగు నీటిధారలచే నలంకరింపబడిన వృషాద్రి సానువులందు నివాసము కోరబడినది.

తరలము॥

బలము నిందిృయశక్తులున్ వెస ♦ బాయు పూర్వమె శ్వాసవృత్తులు దొఅంగకమున్నె దేహము ♦ తోఁ జనందగువేళ, న
న్నేలయంఁ జేర్పుము నీమహత్త్వము ♦ నెమ్మిఁ దెల్పు ప్రసిద్ధమా
సలిలధారలఁ గ్రాలు వేంకట ♦ శైలసానువులన్ దయా॥

తా. దయా! నాయీ దేహము ముదిమిచే కృశించి యింద్రియములు శక్తిహీనత పొందుటకుముందే, దివ్యదేశములకు బోవ శరీరములో బలమున్నప్పుడే, నీవైభవమును మిక్కిలిగా ప్రకటించు ఆకాశగంగ పాపనాశము మొదలగు నీటిధారలచే విశ్రుతమైన శ్రీవేంకటాద్రిచరియలందు నన్ను జేర్చి సుఖింపజేయుము.

32. అవ. "మహాత్మానస్తు మాం పార్థ దైవీంప్రకృతి మాశ్రితాః । కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతిచ॥" అను గీతోక్తిచొప్పున భగవద్భాగవతాచార్యులగోష్ఠినుండి, భగవద్గుణానుభవము చేయుటకు వీలైన దివ్యదేశములందు నివాసము తనకు గోరనవిధమున కల్పించిన భగవద్దయావిషయమై ప్రీతికల్గిన యాచార్యులవారు, దయను రంజింపనెంచి, సపత్నులచేతను గొని యాడదగిన నోకానొక నాయికావృత్తాంతము స్ఫురించువిధముగా సమాసోక్తి యలంకారముచే స్తోత్రము చేయుచున్నారు.

శ్లో॥ అవిదితనిజ యోగక్షేమ మాత్మానభిజ్ఞం
గుణలవ రహితం మాం గోప్తుకామా దయే త్వం ।
పరవతి చతురైస్తే విభ్రమైః శ్రీనివాసే
బహుమతి మనపాయాం విందసి శ్రీధరణ్యోః॥

టీ. హేదయే = దయా! అవిదిత నిజయోగక్షేమం=అప్రాప్యములైనవానిని పొందుట యోగము, అట్లు పొందినట్టి విశేషములను నిలుకడగా నుండునట్లు చేయుట క్షేమము. ఈరెంటను దెలియలేనట్టి "క్వాహ మత్యంత దుర్బుద్ధిః క్వ చాత్మహితవీక్షణం" అన్నట్లు ఆత్మహితాహితము లేమియు తెలియనివాడును; అందుచే, ఆత్మానభిజ్ఞం = దేహాత్మవివేకము లేనివాడును, గుణలవరహితం= సాత్విక ఆస్తిక్యాదులైన సుగుణములు లేశముకూడ లేనివాడును, రక్షించుటకు వ్యాజభూతమగు యాదృచ్ఛికాది సుకృత మించుకయేనియు లేనట్టి, మాం = నన్ను "అమర్యాదః క్షుద్రశ్చలమతి రసూయాప్రసవభూః । కృతఘ్నో దుర్మానీ స్మరపరవశో వంచనపరః నృశంసః పాపిష్ఠః॥" అను విధమున సకలదుర్గుణముల కాటపట్టగు నన్ను, గోప్తుకామా త్వం=ఆశ్రితవ్యామోహముచే రక్షింపదలచిన నీవు, చతురైః తే విభ్రమైః = వశీకరణసమర్థములగు నీ

విలాసభంగులచే, శ్రీనివాసే పరవతి (సతి) శ్రీనివాసుని పరవశత్వ మొందునట్లు చేయగా, అనగా స్వామి తననిరంకుశస్వాతంత్ర్యమును గోల్పోయినీకు విధేయుడై యుండగా, శ్రీధరణ్యోః = సపత్నులగు లక్ష్మీభూదేవులవలన, అనపాయాం బహుమతిం విందసి=యదార్థమైన బహుమానమును లేక పొగడ్తను పొందగలవు. వారు నిన్ను సగౌరవముగా జూచి, "ఆహా! ఏమి నీయొక్క వాత్సల్యాతిరేకము ఎంత ఆశ్రితపక్షపాతము కలదానవే! విభుని వశీకరించు విలాససంపద నీకే మిక్కుటముగా కలదు" అని బహువిధముల నిన్ను గొనియాడుదురు. మానినీజనములకు, సపత్నుల సన్మానమునకు మించిన లాభ మొండులేదని తాత్పర్యము.

తే॥ అవిది తాత్మశరీరబోధుండ ♦ నజ్ఞుడఁ గుణహీనుఁడఁ
ధ్రువము నైనను వేంకటాద్రివ ♦ రుండు నన్ను భరింపఁగా
భవ దనంతవిలాస భంగుల ♦ వశ్యుఁడైన దయా! మహీ
భువనమాతలు నీయెడఁ బరి ♦ పూర్ణగౌరవ ముంచరే॥

తా. సదసద్వివేకము లేనివాడును హితాహితము లెఱుగనివాడును సుగుణము బొత్తిగా లేనివాడునగు నన్ను రక్షింపగా, శ్రీనివాసుని నీయొక్క విభ్రమవిలాసములచే వశ్యుడగునట్లు చేయు నిన్ను జూచి, నీసపత్నులగు రమాభూదేవు లిరువురు నిన్ను మిక్కిలిగా కొనియాడగలరు. సవతుల సన్మానము పొందగలవని భావము.

33. అవ. అభిలషిత దివ్యదేశనివాసము ప్రాపింపజేయుటకు ముందుగా, తత్ప్రతిబంధకమైన పాపసంచయ నివృత్తిని దయ గావించుప్రకారము నందు సమాసోక్తిరీతి ననుసరించి, గుణగరిష్ఠుడైన న్యాయప్రభువుచే నధిష్ఠింపబడిన సభలో జరుగు వాదిప్రతివాదుల వృత్తాంతము నారోపించి వర్ణించుచున్నారు.

శ్లో॥ ఫలవితరణదక్షం పక్షపాతానభిజ్ఞం
ప్రగుణ మనువిధేయం ప్రాప్య పద్మాసహాయం।
మహతి గుణసమాజే మానపూర్వం దయే త్వం
ప్రతివదసి యథార్థం పాప్మనాం మామకానాం॥

టీ. దయే! సంబోధనము; ఫలవితరణదక్షం=పుణ్యాపాపానురూపములగు ఫలముల నిచ్చుటయందు సమర్థుడును (న్యాయాధిపతిపక్షమున తీర్పుచెప్పుటయందు నేర్పరి యని యర్థము.) పక్షపాతానభిజ్ఞం = సమాశ్రయణ విషయమున సర్వభూతసముడును, "దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతం", "న మే ద్వేష్యోస్తి న ప్రియః", "విభీషణోవా సుగ్రీవ యది వా రావణ స్స్వయం" అను వాక్యములచే భగవంతుని సర్వసమత్వము తెలియుచున్నది. (న్యాయాధిపతిపక్షమున పక్షపాతములేక త్రాసునుబోలు చిత్తము గలవాడని యర్థము). ప్రగుణం అనువిధేయం = ప్రకృష్ట గుణసంపదచే సులభారాధ్యుడును, లేక, ప్రగుణస్య మనోః విధేయం= శ్రేష్ఠమగు అష్టాక్షర మంత్రరాజమునకు వశ్యుడగువాడును, అయిన పద్మాసహాయం = శ్రీకాంతుని (ఈవిశేష్యము అభిప్రాయగర్భితము.) "దయామివ కృతోదయః" అన్నట్లు కరుణాస్వరూపిణియగు శ్రీదేవి సహాయసంపత్తిని సూచించుచున్నది. అట్టి ప్రభువైన శ్రీనివాసుని, ప్రాప్య = పొంది లేక వశీకరించి, మహతి గుణసమాజే = శ్రేష్ఠములైన జ్ఞాన శక్తి వీర్య తేజో బలాదులగు ననంతములగు భగవద్గుణములుగూడిన సభయందు (న్యాయాధిపతిపక్షమున గుణగరిష్ఠులగు నార్యులచే నిండిన సభయనియర్థము.) త్వం= నీవు, మామకానాం పాప్మనాం = నాపాపములను గూర్చి, మానపూర్వం = ప్రమాణోపన్యాస పురస్సరముగ (న్యాయాధిపతిపక్షమున చట్టములప్రకారముల నుపన్యసించుటయని యర్థము.) యథా

ర్హాం = తగినవిధముగా వీఁడు నిగ్రహార్హుఁడు కాఁడని, ప్రతివదసి = ప్రత్యుక్తి నొసంగెదవు. దండనోపయుక్తములగు భగవద్గుణాంతరములెల్ల "వీఁడు దండనీయుఁడు, ఆజ్ఞను మీఱి వర్తించినవాఁడు, పాపానురూపముగ దండన విధించుట కర్హుఁ" డని జాగరూకతతో నుండి తెలుపుచుండగా, నిగ్రహప్రసక్తి యెఱుంగని దయ "వీఁడు పాపవర్తనుఁడుకాఁడు. ప్రపత్తి చేసినవాఁడు, దయనీయుఁ" డని పలు విధముల ప్రమాణపూర్వకముగా వాదింప భగవంతుఁడు దయావిధేయుఁడై గుణాంతరముల పల్కులను విశ్వసింపక త్రోసిపుచ్చి, చేతనుని పాపవర్గములను క్షమించుచున్నాఁడని యర్థము. కాబట్టి దురిత విజయము కృపచేతనే కల్గుచున్నదనియు, ప్రపన్నుల పూర్వోత్తరాఘము లన్నియు భగవంతుఁడు సహించుచున్నాఁడనియు ఫలితార్థము.

త॥ బహు ఫలప్రదదక్షు నాథుని ♦ బక్షపాత విహీను శ్రీ
సహచరుఁ గుణధుర్యు సేవ్యు వ ♦ శంబొనర్చి బలాదులౌ
మహిత సద్గుణగోష్ఠి నుండి ప్ర ♦ మాణపూర్వముగా దయా
యహితుఁడే యని నన్నుఁ గూర్చి య♦థార్హమై యెదురాడవే॥

తా. సర్వఫలప్రదాతయు, సర్వసముఁడును, సకల కల్యాణ గుణ పరిపూర్ణుఁడును, సులభసేవ్యుఁడు నగు పద్మావల్లభుని సమస్త గుణములును గొల్చి సభలోనుండగా నీవు నావిషయమై పూని ప్రమాణోపన్యాస పురస్సరముగా నాపాపములనుగూర్చి తగినవార్తలాడగా, ఆశ్రీపతి నీకు విధేయుఁడై నా పాపములన్నియు క్షమించుచున్నాఁడు.

**34.** అవ. ప్రపన్నజనుల సమస్తపాపములను హరించుటకు వాత్సల్యాతిశయముగల భగవద్దయతప్ప వేఱొండుకారణముకలుగ నేరదని యూహిగాఁ బల్కుచున్నారు. అవి అనుభవించియు దీరవు. ప్రాయశ్చిత్తవిధులచేతను దొలగవు.

శ్లో॥ అనుభవితు మఘౌఘం నాల మాగామికాలః
ప్రశమయితు మశేషం నిష్క్రియాభి ర్న శక్తం।
స్వయ మితి హి దయే త్వం స్వీకృత శ్రీనివాసా
శిథిలితభవభీతి శ్శ్రేయసే జాయసే నః॥

టీ. హేదయే! అఘౌఘం = మనోవాక్కాయములచే కాలత్రయసంభూతములైన సంఖ్యాతీతమగు పాపబృందములను, అనుభవితుం=అనుభవించుటకు అనగా పాపఫలము లనుభవించి వానిని క్షయింపచేయుటకు, ఆగామికాలః = రాబోవుకాలము, నాలం = (అపరిచ్ఛిన్నమైనను) పర్యాప్తమైనది కాదు ; పాపవర్గము లసంఖ్యేయము లగుటచే ఎన్నిజన్మలెత్తి ఫలానుభవము చేసినను తీరదని భావము ; అశేషం - నిష్క్రియాభిః - ప్రశమయితుం = అంతయు మొదలంట ద్వాదశాహాది ప్రాయశ్చిత్తములచేతను దానహోమజపాదులచేతను శమింపజేయుటకు, నశక్తం = సాధ్యమైనదికాదు. (ప్రాయశ్చిత్తాదులు గావింప నడుమ నెన్నియో విఘ్నములు ప్రాప్తమగుచుండును. వానిని జేయుటకు శక్తియు ధనమును ఎక్కువగా కావలయు)ఇట్లు ప్రతిక్రియలచేతను అనుభవముచేతను తీరనట్టి చేతనుని దురంతపాపజాలములను దొలగించు టెట్లని చింత గట్టుకొని, త్వం = నీవు, స్వయం = మాప్రార్థన లేక స్వయముగా మా కుపకరింప బూని, స్వీకృత శ్రీనివాసా సతీ = వశముచేసికొనిన శ్రీనివాసుని గలదానవగుచుండగా, శిథిలితభవభీతిః = సంసారమునకు హేతువగు సమస్తపాపములను క్షమించుటచే, సంసారపతనభీతిని పోగొట్టుదానవై, నః = మాకు, శ్రేయసే జాయసేహి = ఇహపరంబుల రెంటను మేలుగూర్చుటకై పొడముచున్నావు కదా! భగవంతుడు దయావిధేయుడై స్వయముగా ప్రపన్నుని పాపములను హరించి సర్వశ్రేయముల నిచ్చుచున్నాడని భావము.

మ॥ దేవి! పాపములన్ ఫలాప్తిని • దీర్ఘమన్న మితంబ రాఁ
బోవు కాలము నిష్క్రియాదులఁ • బ్రుంగఁజేయఁగ శక్తులున్
లేవు వేంకటనాథు శ్రీసఖు • లీలఁ జెంది యనుక్తవై
నీవ మా కభయం బొసంగుచు • నేరు గూర్పఁగ శ్రేయముల్ ॥

తా. దయా! మా పాపబృందము లసంఖ్యాతములును మహాత్తరములు నగుటచే నవి యనుభవముచేతను ప్రాయశ్చిత్తాదులచేతను దీర్పజాలము. నీవే మాకై పూని శ్రీనివాసుని లోఁబఱచుకొని మాకు సంసారభయము లెల్ల బాపుచు సర్వశ్రేయముల నొసగుటకు పూనెదవు.

35. అవ. పై రెండు పద్యములందు దయానిధియగు పద్మావల్లభుడు ప్రపన్నుల పాపరహితు లగునట్లు చేయుచున్నాడని తెల్పబడినది. ఆశ్రితవిషయ నిరతిశయ వ్యామోహ ప్రేరితయగు దయచే భగవంతుడు ప్రపన్నుల ప్రారబ్ధమూలమైన భావిజన్మలను వారికై స్వయముగా స్వీకరించుచున్నాడనియు, అందుచే ప్రపత్తి చేసినవారు పునర్జన్మరహితు లగుచున్నారనియు, భగవంతునకుమాత్రము అవతారము లెత్తవలసినది తప్పదనియు ఉత్ప్రేక్షామూలమున వివరించుచున్నారు.

శ్లో॥ అవతరణవిశేషై రాత్మలీలాపదేశై
రవమతి మనుకంపే మందచిత్తేషు విందన్ ।
వృషభ శిఖరినాథ స్త్వన్నిదేశేన నూనం
భజతి చరణభాజాం భావినో జన్మభేదాన్ ॥

టీ. హేఅనుకంపే - సంబోధనము ; వృషభశిఖరినాథః = వృషాచలపతియగు శ్రీనివాసుడు, ఆత్మలీలాపదేశైః = నిజ లీలా వ్యాజమున గైకొనునట్టి, అవతరణవిశేషైః=మత్స్య కూర్మా ద్యవ

తారములందు, మందచిత్తేషు = అల్పమతులు లేక దౌర్భాగ్యుల చిత్తమునందు, అవమతిం విందతే = అవజ్ఞను, లేక తిరస్కారభావమును గల్గియుండుటను తెలిసినవాడయ్యును, "అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితం। పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరం॥" అను గీతోక్తిచొప్పున అజ్ఞులు భగవంతుని అప్రాకృత దివ్యరూపమునందు సామాన్య మనుష్యభావము గలిగి, ఒకానొక రాజకుమారుడని, గోపబాలుడని తలచి, రామకృష్ణాద్యవతారముల తత్త్వ మెఱుంగక నిందాపరులైనను, ఆనిందను పాటింపక, త్వన్నిదేశేన = నీయొక్క నియుక్తిచే, అనగా నీచే ప్రేరేపింపబడి, చరణభాజాం = మామేకం శరణంవ్రజ యన్నట్లు అతనినే శరణు సొచ్చినట్టి మహాత్ములయొక్క, భావినః జన్మభేదాన్ = ముందు కవశ్యము ఎత్తవలసిన మనుష్యాది జన్మభేదములను, భజతి=స్వయముగా పొందుచున్నాడు. (అనగా వారికై తానే యవతరించుచున్నాడని భావము.) "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥" అను భగవదుక్తి చొప్పున దుష్టశిక్షణ శిష్టరక్షణ వైదిక ధర్మస్థాపనార్థముగా, కృత త్రేతాది యుగవిశేషనియమము లేక, వలసినపుడెల్ల, నిజ సంకల్పమాత్రముచేతనే, దేవమనుష్యాది రూపముల భగవంతు డవతరించుటను, నిజచరణాశ్రితులకై పూని యెత్తిన జన్మవిశేష మని చెప్పుటచే, అలంకారము స్వరూపోత్ప్రేక్ష; లేక హేతూత్ప్రేక్ష. నూనం = ఉత్ప్రేక్షా వ్యంజకము.

తే॥ అవనకేళి ఝషాదిరూపము ♦ లాత్మలీల ధరించి మా
ధవుఁడు తోఁచిన మందబుద్ధులు ♦ తథ్యమ య్యవతార వై
భవ మెఱుంగక దూఱుచున్న భ ♦ వన్నియుక్తిఁ బ్రపన్నులీ
యవని దాల్చెడు భావిజన్మము♦లాతఁ డొందెడు నో దయా!

తా. లోకరక్షణార్థము భగవంతుడు మత్స్య కూర్మాద్యవతారభేదములు ధరించగా, మందబుద్ధులు అవజ్ఞచేసినను దానిని పాటింపక, తిరిగి తిరిగి యవతరించుటను జూడ, నిజపాద సమాశ్రితులగు వారికి పునర్జన్మ లేకుండ చేసి వారికై తాను స్వయముగా నవతరించుచున్నాఁడేమోయని తోఁచుచున్నది.

36. అవ. లక్ష్మీవల్లభుడగు శ్రీనివాసుడు దయావిధేయుడని ప్రసిద్ధి నొందియుండగా, శ్రీ భూ నీలాదేవులలో నొక్కతెను శ్రీవత్స కౌస్తుభ తులసీ వైజయంత్యాదులచే నలంకరింపబడిన వక్షస్థలమున ధరించియు, తక్కినయిరువురను పార్శ్వముల నలంకారముగా నిల్పియు బహూకరించు టేమియని, దయకు హృద్గోచరమగు శంకను, ఉత్ప్రేక్షించి పరిహరించుచున్నారు.

శ్లో॥ పరహిత మనుకంపే భావయంత్యాం భవత్యాం
స్థిర మనుపధిహార్దం శ్రీనివాసో దధానః ।
లలితరుచిషు లక్ష్మీ భూమి నీళాసు నూనం
ప్రథయతి బహుమానం త్వత్ప్రతిచ్ఛందబుద్ధ్యా॥

టీ హే అనుకంపే! దయా! పరహితం = ఇతరులయొక్క మేలును లేక భగవద్రూపాద్యాదు లెఱుంగక తుచ్ఛసుఖములం దాసక్తిగలవారికి మేలు గల్గు టెట్లని, భావయంత్యాం భవత్యాం = సర్వకాలము చింతించు నీయందు, స్థిరం అనుపధిహార్దం = ఎన్నడు తొలుగని నిరుపాధికస్నేహమును లేక ప్రేమను, శ్రీనివాసో దధానః = శ్రీవల్లభుడు ధరించినవాడై, లలితరుచిషు లక్ష్మీభూమినీళాసు = మనోజ్ఞమైన కాంతులుగల, లేక భవత్కృతమైన పరోపకారమును గుర్తించి, కొనియాడు భావనావిషయముగల ప్రధానులైన మహిషీత్రయము ముందుగా, త్వత్ప్రతిచ్ఛందబుద్ధ్యా = నీ పరహిత ప్రవర్తనమును గుర్తించిన (శ్రీనివాసుడు), బహుమానంప్రథయతి=

వారియెదుట నిన్ను మిక్కిలి శ్లాఘించి నీయందలి గౌరవాతిశయ మును ప్రకటింపగలడు. అందుచే ఆదేవులకు నీయందు ప్రీతియే కాని, సవతిజనులకుండు మత్సరము మొదలగు భావములు లేవని తాత్పర్యము. త్వత్ప్రీతిచ్ఛందబుద్ధ్యా యనుటచే హేతూత్ప్రేక్ష. లలితరుచిషు యనుట ముగ్గురు దేవుల గుణాతిశయమును దెల్పు విశేషణము కావున, అలంకారము పరికరము. బహుమానప్రకట నమునకు దయయొక్క పరహితప్రవర్తనమును, అందుచే శ్రీనివాసు నకు దయయందు గల నిరవధిక స్నేహమును కారణములని దెల్పు టచే అలంకారము కావ్యలింగముకూడ యగును.

త॥ పరహితం బెడఁదఁగ దలంచెడు ♦ భవ్యవర్తన దేవి ! సు
స్థిరతరంబగు చెల్మి నీయెడ ♦ శ్రీనివాసుఁడు దాల్చి నిం
సురుచిరాకృతిశోభితుల్ మహి♦షుల్ ప్రధానులు ముగ్గురుం
గరము మెచ్చ నుతించు నీయుప ♦ కారముల్ దలపోయుచుం॥

తా. దయా ! ఎల్లప్పుడు ఆశ్రితానాశ్రిత విభాగములేక యందఱియెడ అనుకూలప్రవృత్తియు, పరోపకారబుద్ధియు గల్గు నీయెడ శ్రీనివాసుడు నిరతిశయ ప్రేమగలవాడై, తన దేవీత్రితయము ముందు నిన్ను మిక్కిలిగా గౌరవించుచు పొగడుచుండగా, వారును నీయెడ సౌమ్యబుద్ధికల్గి యొరుల కుపకరించు నీస్వభావమును తెలిసి కొని సంతోషించుచున్నారు.

57. అవ. పైనచెప్పిన దయయొక్క పరహితప్రవృత్తికి, విశేషమగు దృష్టాంత మొకటి తెల్పుచున్నారు.

శ్లో॥ వృషగిరి సవిధేషు వ్యాజతో వాసభాజాం
దురితకలుషితానాం దూయమానా దయే త్వం।
కరణవిలయకాలే కాందిశీకస్మృతీనాం
స్మరయసి బహులీలం మాధవం సావధానా॥

టీ. హేదయే ! వృషగిరిసవిధేషు = వేంకటగిరి పరిసరారణ్య ప్రదేశములందు, వ్యాజతో వాసభాజాం దురితకలుషితానాం = గాఢ గహనప్రదేశముల వాసముచేయు నెపమున శ్రీ శ్రీనివాసుని సేవింపవచ్చు జనములను హింసించి, వారిధనములను ప్రాణములను హరించుచు, జీవహింసయే వృత్తిగాగల పాపభూయిష్ఠులైన చోర కిరాతాదుల విషయమై ; దూయమానా త్వం = పరదుఃఖమును జూచి సహింపనేరని నీవు క్లేశము నొందినదానవై, కరణవిలయ కాలే = ఇంద్రియములు ప్రిదిలి విశక్తతనొందినట్టి చరమకాలమున, కాందిశీక స్మృతీనాం=దూరముగా తరుమబడిన జీవహింసనాది పాప చింతలు గలవారి రక్షణవిషయమై (అనగా శరీరవియోగకాలమున దుష్ప్రవర్తనలుగల చోరకిరాతాది జనులకు స్మృతి తప్పి, పాపచింతనలు లేకుండు సమయము నెఱిగి, ఇది రక్షణావసరమని తలచిన దానవై ), బహులీలం మాధవం = అనేకవిధ జగద్వ్యాపారాదులందు సక్తుడగు శ్రీవల్లభుని, సావధానా (భవతీ) = ఆశ్రితరక్షణమువందు వ్యాజము సంపాదించునిమిత్తము అవధానముగల నీవు, స్మరయసి = రక్షణార్థము విజ్ఞాపనము చేసెదవు. వీరు దురిత దూషితులైనను భవద్విషయవాసులు ఇప్పుడు వారికి దురిత చింతలు లేవు. ఇది రక్షణావసరము అని అవసర ప్రతీక్షుడైన శ్రీరమణుని తలంపించెద వని యర్థము. " శ్రీమాన్ వేలాప్రతీక్షో భవ భయహరణే చేత్యభాణీచ్ఛారిః " అని భగవంతుడు చేతనరక్షణమునకు సిద్ధుడై రక్షించుటకు అవధియగు కాలమును (అవసరమును) నిరీక్షించుచున్నాడని శ్రీనమ్మాళ్వార్లు సాయించియున్నారు. ఇక్కడ దురితప్రవర్తనులను రక్షించుటను ' కాందిశీకస్మృతీనాం ' అని సమర్థించుటచే, కావ్యలింగమలంకారము. 'బహులీలంమాధవం' అనుటచే బహుకార్యభార మగ్నులగు ప్రభువులకు స్మారణ మవశ్య

మని సూచించుచున్నది. 'వ్యాజతో వాసభాజాం స్మరయసి' యను టచే వృషగిరి కానన నివాసమాత్రమున రక్షణవ్యాజ మేర్పడినదని అసమగ్రహేతువుచే కార్యోత్పత్తి వర్ణింపబడినందున విభావనాలంకారము.

త॥ కరుణ! యావృషభాద్రిచేరువ ♦ కాననుండు నెపంబునన్
దురితవర్తనులై చరించెడు ♦ దుష్టచోర కిరాతులన్
గరణముల్ శిథిలంబు లయ్యెడు ♦ కాలమందు భయద్రుత
స్మరణులం గని యోర్వ్ కీవర ♦ మాధవున్ దలంపింపవే॥

తా. దయా! వేంకటాద్రి పరిసరారణ్యభూముల వాసము చేయు నెపమున మిక్కిలిగా జీవహింస చేయుచు జీవించు చోరకిరాతాది మహాపాపచారిత్రులను గూడ రక్షించుటకు వ్యాజము సంపాదించి, వారి రక్షణవిషయమై తటియెటెంగి, బహుజగదవన రక్షణాదికృత్యములందు లోలుడైన శ్రీకాంతునకు విన్నవించెదవు కదా. ఆహా! ఏమి పరోపకారచింత. భగవదనుగ్రహప్రాప్తికి నీపురుషకారము గొప్పదికదా!

38. అవ. దేవీ! దయా! ఒక్క పాపాత్ములగు చోరకిరాతాది భగవద్విషయవాసుల రక్షణమేమి యాశ్చర్యము? నీవేకదా సంసారసాగరపతితులైన సకలజీవులను దరింపజేయు సాధనమగు యానపాత్రమును (నావను) బోలియున్నావని తెలుపుచున్నారు.

శ్లో॥ దిశిదిశి గతివిద్భి ర్దేశికై ర్నీయమానా
స్థిరతర మనుకంపే స్త్యానలగ్నా గుణై స్త్వం।
పరిగతవృషశైలం పార మారోపయంతి
భవజలధిగతానాం పోతపాత్రీ భవిత్రీ॥

టీ. హే అనుకంపే! భవజలధిగతానాం = సంసారసాగర మునబడిన జనులకు, పోతపాత్రీభవిత్రీ = నావవై పరగుట కర్హురాలగు, త్వం = నీవు, గతివిద్భిః దేశికైః=కైవల్య ఐశ్వర్య భగవత్ప్రాప్తియనబడు మూఁడువిధగతులను బొందుటకు మార్గము లెఱింగినవారైన యాచార్యులచే, లేక అర్చిరాదిక ధూమాదికగతుల విధ మెఱింగినవారనియు చెప్పనచ్చును. (నావపక్షమున పడవను నడపవలసిన మార్గము లెఱింగిన నావికాగ్రేసరులని యర్థము.) దిశి దిశి నీయమానా = రక్షణోచితులగు చేతనులవిషయమై ప్రసరింప జేయబడి, యనగా వారు దయకు పాత్రులగునట్లు చేయబడుచున్నారనుట, (నావపక్షమున అన్నిదిక్కులను చేరవలసిన ప్రదేశమునకు నీడ్వబడినదని యర్థము.) గుణైః = పరికరీభూతములగు భగవదితర గుణములచే, స్త్యానరంగా = అప్రకంప ప్రభావము గలదానవై, యనగా అభీష్ట కార్యనిర్వహణశక్తి గలదానవై (నావ పక్షమున, గుణైః రజ్జువులచే, స్త్యానరంగా=నిబిడసంబంధము గల్గి; బలముగల నావ యని యర్థము.) స్థిరతరం పరిగతవృషశైలం పారం = మిక్కిలి స్థిరమైన ప్రాప్యస్థానమును శ్రీనివాసాధిష్ఠితమునైన వృషగిరియను గట్టును, ఆరోపయంతీ = సంసారజలధి మగ్నులను ప్రాపింపజేసెదవు; స్థిరతరం పారం అనుటచే శ్రీనివాసుని చేరినవారికి పునర్జన్మ భీతి లేదని సూచితము. ఐశ్వర్యాదిగతులు పొందినవారు "గతాగతం కామకామా లభంతే" అన్నట్లు తిరిగి ఫలానుభవ క్షీణపుణ్యులై జన్మించెదరు. "ఆబ్రహ్మభవనా ల్లోకాః పునరావర్తినోర్జున। మా ముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥" అను గీతోక్తిప్రకారము, శ్రీనివాస పారమును జేరినవారు తిరిగి అస్థిరమును దుఃఖాలయమును నగు జన్మ లెత్తకుందురు. "సంసారార్ణవ మగ్నానాం విషయాక్రాంత చేతసాం। విష్ణుపోతం వినా నాన్యత్కించి దస్తి పరాయణం॥" అనుశ్లోకార్థము ఇందు వివరింపబడినది.

మ॥ అంతటం గతివేదులైన మ ♦ హామతుల్ నడపింప, న
త్యంత సత్త్వగుణాప్రకంపతఁ ♦ దాల్చి నీవనుకంప! ని
శ్చింతఁ జేర్పుదు యానపాత్రము ♦ చెల్వుఁ దాల్చి భవార్ణవా
భ్యంతర స్థితులైన మమ్ము వృ ♦ షాద్రిశేఖర పారముం॥

తా. దయా! నీవు గతివిశేషము తెలిసిన మహాదాచా ర్యులచే నడపింపబడి, సత్త్వగుణాదులచే అప్రకంపయగుచు, గట్టి నావను బోలి, సంసారసముద్రమున మునిగిన జనులను తరింపజేసి శ్రీనివాసుడను గొప్పపారప్రదేశమును చేరునట్లుగా జేసెదవు. అనగా పరమగతికి నీవే కారణ మగుచుందువు.

39. అవ. క్షుద్రములు నశ్వరములు నగు ఫలములు బొంద గోరి తిరుగువారికిగూడ నీవు భగవంతునియందు రుచి కల్గింపజేసి, వారిని క్రమముగా నుజ్జీవింపఁ జేయుచున్నావని, శ్లేషతో గూడిన రూపకాలంకారమున వివరింపుచున్నారు.

శ్లో॥ పరిమితఫలసంగా త్ప్రాణినః కింపచానా
నిగమవిపణిమధ్యే నిత్య ముక్తానుషక్తం।
ప్రసదన మనుకంపే ప్రాప్తవత్యా భవత్యా
వృషగిరి హరినీలం వ్యంజితం నిర్విశంతి॥

టీ. అనుకంపే! సంబోధనము, పరిమిత ఫలసంగాత్ = నశించు స్వభావముగల స్వల్పఫలములం దాసక్తులై ప్రవర్తించు, కింపచానా ప్రాణినః = క్షుద్రులైన జీవులు, "జ్ఞానేనహీనః పశుభి స్సమానః" అన్నట్లు పశుప్రాయులగుటచే వారిని ప్రాణు లనబడి నది. ప్రసదనం ప్రాప్తవత్యా భవత్యా = వారివిషయమై రక్షణ వ్యాజము సంపాదించి ప్రసన్నురాలవగునీచేత, నిగమవిపణిమధ్యే= వేదములను అంగడివీధినడుమ, (వేదములు సకలవిధమైన అధికా

రముగల జనులకు, వారివారి యోగ్యతచొప్పున, స్వల్పములును గొప్పవియునగు పురుషార్థములను బొందుట కుపాయము ప్రతిపాదించుటచే, వానిని విపణిమార్గముతో రూపింపబడినది. అంగడివీథులలో సకలవిధములైన సరకులు కొనవచ్చును.) ఇంద్రనీలమణి పక్షమున (నిగమమనగా పురము) పురమునందలి యంగడివీథి మధ్యయందని యర్థము ; నిత్యముక్తానుషక్తం = నిత్యులును ముక్తులునగు సూరిజనులచే గూడికొట్టిదియు (ఇంద్రనీలపక్షమున నిత్యము ముక్తములతో గూడినట్టిది) వ్యంజితం = వ్యక్తమైనదియు (ఇంద్రనీలపక్షమున బజారున ప్రదర్శింపబడినది) అయిన వృషగిరిహరినీలం=వృషాద్రిపైనున్న నీలమేఘశ్యాముడగు హరిని (ఇంద్రనీలపక్షమున వృషగిరియను ఆకరమున బుట్టిన ఇంద్రనీలమను శ్రేష్ఠమగు మణివిశేషమును) నిర్విశంతి = సర్వభోగ్యాధిక వస్తువుగా నెఱింగి యనుభవించెదరు. (ఇంద్రనీలపక్షమున మహార్ఘమగు నీలరత్నమును బొంది పరమానందము బొందెదరు.) ఒకానొకడు స్వల్పములగు కూరగాయలు మున్నగువస్తువులు కొనుటకై యంగడివీథిలో దిరిగి, యొకచోట శ్రేష్ఠమగు నీలరత్నమును బొంది, తన సుకృతవిశేషమునకు సంతోషించుచు, రత్నలాభమున పరమానందము వహించునట్లు, నీమలగు జనులు స్వల్పఫలాసక్తిచే వేదోక్తబహువిధకర్మల ప్రవర్తించి, భగవద్దయాప్రభావమున "యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే। తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః" అను గీతావాక్యముచొప్పున, కామ్యకర్మపరులు గాక, మోక్షోపయుక్తములగు కర్మలందు తగులుచు, తుదకు భగవన్నిత్యకైంకర్యరూపమగు మహానందమును బొందుచున్నారని భావము. వృషగిరిహరినీలము శ్రీనివాసుడను నీలము "సదా పశ్యంతి సూరయః" అన్నట్లు నిత్యము సూరిబృంద సేవ్యమైనది కావున నిత్యముక్తాను

షక్తం అనబడినది. ఇంద్రనీలమణికూడ నిరంతరము ముక్తాహారమునకు నడుమ గ్రుచ్చబడి, నాయకమణియై వెలుగుచుండును. శ్రేష్ఠమగు రత్నము దోషరహితమై హృద్యమై సర్వమంగళప్రదమై మహామహిమకలదియునై వెలుగుననుట రత్నశాస్త్రప్రసిద్ధము. స్వల్పలాభమునకు బూని ప్రవర్తించినవానికి గొప్పలాభము గిట్టినట్లు వర్ణించుటచే అలంకారము ప్రహర్షణము.

మ॥ దీనవృత్తిఁ గదర్యులీభువి ♦ దేలి స్వల్పఫలాప్తులై
పూని యాగమపణ్యవీథులఁ ♦ బొంది తా రట నిత్యము
క్తానుషక్త మహాజనార్హ్వ ♦ పాద్రిరా డ్హరినీలమున్
మానకన్ గని సంతసిల్లుట ♦ మాత నీమహిమన్ గదా॥

తా. నీచులైన జనులు నశించునట్టి తుచ్ఛములైన భోగములు బొందగోరి వేదములను నంగడివీథులందు తిరుగుచుండగా, వారియెడ ప్రసాదమును బూనిన నీమహిమచే వారు తుదకు నిత్యముక్తాసమేతమగు వృషగిరిపై యున్నట్టి హరినీలమును బొంది మహానందమును బొందుచున్నారు.

40. అవ. ఇట్లు మందబుద్ధియగు కొడుకునం దెక్కువమక్కువగల తల్లివలె నొప్పుచు, సంసారపతితులైన భ్రష్టులగు నీచజనులయందును అవ్యాజప్రేమ కలిగి, రక్షించుటకు నేదో యొకవ్యాజము సంపాదించి, నిరతిశయమోక్షఫలము నొసంగు నీయందు సన్మానములేక, అనగా ఉపేక్షకలిగి నిన్ను పురస్కరింపనొల్లక, గత్యంతరములగు జ్ఞానకర్మాది మార్గములను మోక్షమునకు పర్యాప్తములని యెవడు భావించి ప్రవర్తించునో, యట్టివాడు దృష్టాంతరహితుడైన యవివేకుడగుచున్నాడని నిదర్శనాలంకారముచే వివరించుచున్నారు.

శ్లో॥ త్వయి బహుమతిహీనః శ్రీనివాసానుకంపే
జగతి గతిమిహాన్యాం దేవి సమ్మన్యతే యః।
సఖలు విబుధసింధౌ సన్నికర్షే వహన్త్యాం
శమయతి మృగతృష్ణా వీచికాభిః పిపాసాం॥

టీ. హే దేవి! శ్రీనివాసానుకంపే! రెండు సంబోధనములు జ్ఞానవైరాగ్యభూషణులగు దేశికులవారికి భగవద్దయయందలి నిరతిశయ బహుమానమును ప్రదర్శించుచున్నవి. త్వయి=సర్వనిర్వాహకత్వము వహించిన నీయందు, బహుమతిహీనః = సకలవిధపురుషార్థములు సాధించుటకు నిన్ను ప్రాపకముగా దలంపక, నీయందు దుపేక్షాపరుడై లేక నిన్ను ఆశ్రయింపక, ఇహ జగతి = ఈసంసారమండలమందు, అన్యాం గతిం = వేఱగు జ్ఞాన కర్మ మార్గములనుబట్టి, యవియే మోక్షమునకు చాలునని, యః = ఎవడు, సమ్మన్యతే = తలంచుచుండునో, సః = ఆ యవివేక ప్రధానుడగు జనుడు, విబుధ సింధౌ = సురనదియగు గంగ, సన్నికర్షే వహన్త్యాం = మిక్కిలి సమీపమున ప్రవహించుచుండగా (ఈవిశేషణముచే భగవద్దయ సర్వకాలమునందుసర్వజీవులకు సమీపవర్తియైయుండుటను ధ్వనించుచున్నది) దానిని విడిచి, మృగతృష్ణా వీచికాభిః = ఎండమావుల తరంగములచే, పిపాసాం = దప్పిని, శమయతి = శమింపచేయుటకు అనగా దాహమును దీర్చుకొనుటకు నిష్టపడుచున్నాడు. "అనాదృత్యతు యే విష్ణోః కృపా మన్య ముపాసతే। తే కరస్థాం శ్రియం త్యక్త్వా భిక్షా మిచ్ఛంతి యాచితుం" అట్టివాడు చేతిడబ్బును పాఱవేసి భిక్షాన్నమునకు తిరుగు వెఱ్ఱివాడగును. మఱియు "వాసుదేవం పరిత్యజ్య యోన్యం దైవ ముపాసతే। తృషితో జాహ్నవీతీరే కూపం ఖనతి దుర్మతిః" అన్నట్లు దాహము గొన్నవాడు గంగాజలములు ద్రావక, దానిగట్టున నుయ్యిత్రవ్వుటకు పూనుకొను వెఱ్ఱివానితో సమానుడే

యగుచున్నాడు. మృగతృష్ణలో నీరున్నదని తెలివిలేని జంతువులు పరుగెత్తి యెక్కువగానలసి, తుదకు ప్రాణమును గోలుపోవును. అట్లే భగవత్కృపను ఆశ్రయింపక వేఱుమార్గములను ప్రధానముగా దలచి, మూఢుడు తుదకు ఆత్మనాశమును బొందును. జరా మరణ మోక్షమునకు భగవంతుడు ముఖ్యకారణుడగుట సర్వశాస్త్రములు ఘోషించుచున్నవి. కావున ఆశ్రయింపతగినది యాతనికృప యొక్కటియే.

మ॥ కుండలీశ గిరీశరాడ్దయ ♦ కోరి సద్గతి యెవ్వఁడిం
బొందు త్రోవలు వట్టు నిన్నద ♦ నూఁది ప్రాపుగ నొల్లకా
తండు స్వర్ణది చేరఁ బాఱఁగఁ ♦ దజ్జలంబులు మాని నో
రెండుచుండఁగ దప్పి తీర్చుట ♦ కెండమావుల కేగెడుఁ॥

తా. దయా! నిన్ను పురస్కరింపక ముక్తికై యెవ్వఁడు, కేవలము జ్ఞానకర్మాది మార్గములను అవలంబించునో యట్టివాఁడు, సమీపమునం బాఱు గంగనువదలి ఎండమావులలో డప్పితీర్చుకొనుటకై పోవు మూఢునిం బోలును.

41. అవ. ఇట్లు దయేతరములగు ప్రాపకాంతర ప్రవణులను పరిహసించి "భవతీమేవ దయే భజంతి సంతః" అన్నట్లు దయైకశరణ్యులగు మహామతులను బ్రశంసించుచు, వారే ఉపాయోపేయముల సారమెఱింగినట్టి సుకృతవిశేషవంతు లనుచున్నారు.

శ్లో॥ ఆజ్ఞాం ఖ్యాతిం ధన మనుచరా నాధిరాజ్యాదికం వా
కాలే దృష్ట్వా కమలవసతే రప్యకించిత్కరాణి।
పద్మాకాంతం ప్రణిహితవతీం పాలనే౽నన్యసాధ్యే
సారాభిజ్ఞా జగతి కృతిన స్సంశ్రయంతే దయే త్వాం॥

టీ. హేదయే! ఆజ్ఞాం = లంఘింప నలవికానియాజ్ఞను లేక శాసనమును గలుగుటయు, ఖ్యాతిం = అటువంటి ప్రసిద్ధిగల కీర్తి

యును, ధనం = ధనకనకవస్తువాహనాదులును, అనుచరాః = చతురంగబలాదులును, ఆధిరాజ్యాదికంవా = రాజాధిరాజత్వము మున్నగు వైభవములు గలుగుటయును, కమలవసతేః అపి=బ్రహ్మదేవునకైనను (ఇక యితరులవిషయమున చెప్పవలయునా) కాలే= కాలవిపర్యయమున లేక కాలమహిమచే, అకించిత్కరాణి దృష్ట్వా= నిరుపయోగములై విపరీతమగుచుండుటనుజూచి అనగా, "బలమును బుద్ధియు దేజము, నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునన్, బొలియున్ గాలవిపర్యయ, కలనంబున..." యన్నట్లును "శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రాశ్చ రణాజిరే। కాలాభిపన్నా స్సీదంతి యథా వాలుకసేతవః" యన్నట్లును, తత్తత్పుణ్యాఫలావసానకాలమున పైనచెప్పిన యాజ్ఞాఖ్యాతులు మున్నగునవి యెల్ల వ్యర్థమై చెడుచున్నవి. భటులు రాజాజ్ఞను మీఱెదరు ; కీర్తినశించును, ధనరాసులు చెడును, అనుచరులు ప్రభుక్షయమును జూచి యతని బంధించి చంపుదురు ; కావున "ఇవియెల్ల నశాశ్వతములు, భవమరణాకలితములును బటుసంసారో, ద్భవ దుఃఖకలితములు సుఖ, లవయుతములు వీనియందు లౌల్యం బేలా" యని వైరాగ్యసంపదచే వానినంతయును, సారాభిజ్ఞాః = సర్వశాస్త్రముల సార మెఱింగిన మహామతులు, కృతినః = సుకృతవిశేషవంతులు, అనన్యసాధ్యే పాలనే= "మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్" అన్నట్లు, ఇతరులచే నలవికాని మోక్షఫలవితరణమున, పద్మాకాంతం ప్రణిహితవతీం త్వాం=పద్మావల్లభుడగు శ్రీనివాసుని నియోగించునట్టి నిన్ను, సంశ్రయంతే = భజించుచున్నారు. నిన్నే ప్రాపకముగాను ప్రాప్యముగాను దలంచెదరని భావము. ఆజ్ఞాఖ్యాతులు మొదలగువానికెల్ల నిష్ప్రయోజనత్వమను ధర్మైక్యవర్ణనచేత అలంకారము తుల్యయోగిత. "పద్మాకాంతం" అను విశేష్యము పాలనోపయుక్త పురుషకార

సాన్నిధ్యాభిప్రాయ గర్భమగుట పరికరాంకురము. దయను శరణ్యత్వముచే నధ్యవసించుటను "పాలనేఽనన్యసాధ్యే పదాబ్జాకాంతం ప్రణిహితవతీం" అని సమర్థించుటచే అలంకారము కావ్యలింగము.

అంబురుహము॥

భూ ధనధాన్య సమృద్ధియుఁ గీర్తియుఁ బూజ్యరాజ్యవిభుత్వమున్
వేధకునైన నొకప్పుడు వమ్మయి పీడిపోవుటఁ గాంచి శ్రీ
నాథుని జీవులము క్తికి నైజత నంబొనర్పఁగఁ జేయు నిన్
సాధులు సారవివేచనులై దయ సంశ్రయింతురు నిచ్చలున్॥

తా. ఆజ్ఞయు సిరులును కీర్తియు పూజ్యమైన రాజ్యవైభవములు గలుగుటయు స్థిరములుగాక బ్రహ్మదేవునకైనను నిరుపయోగములై చెడుటను జ్ఞానులుగుర్తించి, మోక్షమొసంగు విషయమునందు శ్రీనాథుని ప్రేరేపించునట్టి నిన్నే సర్వవిధముల శరణమనుచు పుణ్యాత్ములగువారు ఆశ్రయించుచుందురు.

42. అవ. ముందుపద్యమున బ్రహ్మపదాదులగు సమస్తైశ్వర్యపదములు నశ్వరములని వాని నాదరింపక, సుకృతులు మోక్షప్రాప్తికి దయను భజించుచున్నారని తెల్పి, ఈపద్యమున శీలగుణపరిశీలనపరులగు కొందఱు, 'కతిచన' అనుటచే అవాఙ్మానసగోచరవైభవముగల మహాత్ములు, శ్రీకులశేఖర ప్రముఖులు, మోక్షము కూడ నపేక్షింపక, భగవంతుడగు శ్రీనివాసుని శీలగుణానుభవరసైకకాంక్షులై, శ్రీమంతమగు వేంకటగిరియందు, స్థావర జంగమ వస్తుజాతములో నొక్కటిగా జన్మను ప్రార్థించుచున్నారని తెలుపుచున్నారు.

శ్లో॥ ప్రాజాపత్య ప్రభృతివిభవం ప్రేక్ష్య పర్యాయదుఃఖం
జన్మాకాంక్షన్ వృషగిరివనే జగ్ముషాం తస్థుషాం వా।

ఆశాసానాః కతిచన విభో స్త్వత్పరిష్వంగధన్యై
రంగీకారం క్షణమపి దయే హార్దతుంగై రపాంగైః॥

టీ. హేదయే! ప్రాజా...విభవం = చతుర్ముఖ ప్రభృతి ఐశ్వర్యములన్నియు, పర్యాయదుఃఖం ప్రేక్ష్య="పరిపూర్ణసుఖంబు లధికబాధలకోఁ ఆకే", "సుఖ స్యానంతరం దుఃఖం దుఃఖ స్యానంతరం సుఖం"అన్నట్లు దుఃఖాంతములైనవిగా నెఱిగి "ఏతేవై నిరయా స్తాత స్థానస్య పరమాత్మనః" అని మహదైశ్వర్యస్థానములెల్ల అశాశ్వత నరకతుల్య విభవములుగా విచారించి, వానియందు విడుపుగలిగి, కతిచన = కులశేఖర యామునాచార్యులు మున్నగు కొందఱు జ్ఞానులు, త్వ త్పరిష్వంగ ధన్యైః = నీచేరిక (ఆలింగనము) వలన ధన్యత నొందినవియు, హార్దతుంగైః విభోః అపాంగైః=స్నేహప్రకాశకముచే పుష్కలములైన శ్రీనివాసుని దివ్యకటాక్షములచే, క్షణమ ప్యంగీకారం ఆశాసానాస్సంతః=క్షణకాలము చూడబడుటను భాగ్యవిశేషమును మనమునం దభిలషించినవారై, అనగా వనవిహారార్థము వెడలెడు శ్రీకాంతుని దయా శిశిర స్నేహగర్భములగు కటాక్షపాతమును క్షణమాత్రకాలము పొందిన చాలునని తలంచినవారై, వృషగిరివనే = వృషాద్రికాననలందు లేక వనశబ్దము సలిలపరమగుటచే, వేంకటాద్రి జలప్రదేశములందు, జగ్మస్థాం తస్థుషాంవా = జంగమస్థావరభూతములందు, జన్మ = పుట్టుకను, ఆకాంక్షన్ = ప్రార్థించుచుందురు. చంపకాశోకాది వృక్షములలో నొకటిగాను, శుకశారికాది పక్షులలో నొకటిగాను, లేక జలభాగములందు మత్స్య జల విహంగములలో నొకటిగానైన పుట్ట కోరుచుందురు. "సకృ త్త్వదాకార విలోకనాశయా తృణీకృతా నుత్తమ భుక్తిముక్తిభిః। మహాత్మభి ర్మా మవలోక్య తాం నయ క్షణేపి తే యద్విర హోతిదుస్సహః" అని క్షణాణుమాత్ర భగవద్విరహ

సహిష్ణులగు మహాత్ములగుటచే భగవద్దయావలోకనము క్షణమాత్రము కలిగినను చాలునని తృప్తినొందుచున్నారు. యామునాచార్యులవారు (శ్రీఆళవందార్ స్వాములు) కూడ "తవదాస్య సుఖైక సంగినాం భవనేష్వ స్త్వపి కీటజన్మ మే। ఇతరావసథేషు మాస్మభూదపిమే జన్మ చతుర్ముఖాత్మనా" యని, వారుసాయించిన స్తోత్రములో ప్రార్థించియున్నారు. శ్రీవాల్మీకులవారు "యశ్చ రామం నపశ్యేత్తు యంచ రామో నపశ్యతి। నిందిత స్స వసే ల్లోకే స్వాత్మాప్యేనం విగర్హతే" యని రాము డెవ్వని చూడలేదో, ఎవడు రాముని చూడలేదో వాడు భాగ్యహీనుడని లోకులచే నిందితు డగుటయే గాక తన్ను దాను నిందించుకొనుచుండెనని తెలిపియున్నారు. క్షణమాత్ర భగవత్కటాక్షవీక్షణము సర్వశ్రేయోదాయక మగుటచే వృషగిరిపై తిర్యక్స్థావరయోనులందు జన్మప్రార్థితము. చరాచరములలో నొకటియై జన్మించుటను గోరుట దోషయుక్తమైనను, దానిలో కమలాకాంత కటాక్షలాభమను గుణవిశేష ముండునట్లు తెలుపుటచే అనుజ్ఞాలంకారము.

అం॥ అంబుజగర్భ ముఖామరసంపద • లంత్యదుఃఖకరంబు లౌ
టం బరికించి మహాత్ములు గొందఱె•డఁగ వృషాద్రివనంబులో
నంబ! చరాచరభూతము లందొక • లై జనింపఁ దలంత్రు, ని
త్యంబు భవద్వశ మాధవ దివ్యక • టాక్షవీక్షణకాంక్షులై॥

తా॥ నలువ దొట్టి సకలదేవతావైభవములన్నియు చివర దుఃఖాస్పదము లగుచుండుటచే, అట్టి ఐశ్వర్యవిభూతులందు కామవర్జితులగు కొందఱు మహామతులు, నీచే కౌగిలింపబడిన శ్రీనివాసుని కన్నుల గడకంటిచూపులచే నెప్పుడు చూడబడుదుమా యని, నెమ్మనంబులం దువ్విళ్లూరుచు, శ్రీవేంకటాద్రియందు చరాచరభూతములలో నొక్కటియై జనింప ప్రార్థించుచుందురు.

43. అవ. దయా! అట్లు మహాత్ములు గోరుచుండు టేమి వింత? నీవు విహారమునుగోరి వేంకటాద్రిపై నవతరింపగా పరమపదనాథునకుకూడ నీవిరహమును తాళలేక, నిన్ననుసరింప నెంచి, నీకు విహారానుకూలమైన క్రీడాసరస్సుగా గిరిపై నొప్పుచున్నాడని, రూపకాతిశయోక్తి అలంకారముగా వివరించుచున్నారు.

శ్లో॥ నాభీపద్మస్ఫురణసుభగా నవ్యనీలోత్పలాభా
క్రీడాశైలం కమపి కరుణే వృణ్వతీ వేంకటాఖ్యం।
శీతానిత్యం ప్రసదనవతీ శ్రద్ధధానావగాహ్యా
దివ్యా కాచి జ్జయతి మహతీ దీర్ఘికా తావకీనా॥

టీ. హేకరుణే! సంబోధనము. (త్వం నీవు) కమపి=ఒకానొక, వేంకటాఖ్యం క్రీడాశైలం=వేంకటగిరియను నీకు విలాసార్థము ఏర్పఱచుకొన్న శైలస్థానమును, వృణ్వతీసతి = నీవు గోరి వసింపదలచిన మాత్రమున; నాభీపద్మస్ఫురణసుభగా = బ్రహ్మకు పుట్టినిల్లగు బొడ్డుదామర కాంతిచే మించునట్టిదియు (ఇతరకొలనులందు తామర పువ్వులకు చతుర్ముఖజనకత్వ మహిమ లేదు; శ్రీనివాసుడను నడబావి చతుర్ముఖోత్పత్తిహేతువగు నాభీపద్మశోభచే సుందరమైనది.) నవ్యనీలోత్పలాభా = నూతనముగా వికసించిన నల్లకలువ లేక ఇందీవరముయొక్క కాంతివంటి కాంతిగలదియు (భగవచ్ఛరీరము ఫుల్లేందీవరకాంతిగలది కావున యీశోభ అపూర్వమైనది.) శీతా నిత్యం ప్రసదనవతీ=నిత్యశబ్దము మధ్యనర్తియై రెంటికి అన్వయించుటచే, నిత్యంశీతా=ఎల్లప్పుడు తాపహరత్వాది గుణములచే నొప్పునదియు, నిత్యం ప్రసదనవతీ = నిత్యము నిర్మలమై కళంకరహితమై ప్రసన్నతకలదియు, శ్రద్ధధానావగాహ్యా = శ్రద్ధాళువులచే సేవింపతగినదియు,“ శ్రద్ధధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః” “రక్షిష్యతీతి విశ్వాసో” అను విధమున విశ్వాసశాలురచే, అవ

గాహ్యా = ప్రాప్యబుద్ధిచే స్వీకరించుటకు తగినది యని యర్థము; దివ్యా = పరమాకాశమున పుట్టినదియు, కాచిత్ మహతీ = ఒకానొక శ్రేష్ఠతరమగు, తావకీనా దీర్ఘికా నీకు విహరించుటకు తగినట్టి (క్రీడాయోగ్యమగు) వాపి లేక నడబావి, జయతి = సర్వోత్కృష్టమై పరగుచున్నది. ఇందు శ్రీనివాసుని దయాదేవి క్రీడానుగుణపరికరమగు దీర్ఘికతో నధ్యవసింపబడినది. అందుచే భగవంతునకు దయాపారతంత్ర్యము ఫలితము.

అం॥ నీవు విహారము గోరి వృషాద్రిని ♦ నెమ్మిఁ జేరఁగ నాభిరా
జీవరుచిన్ బెడఁగై యనుకంప వి ♦ శిష్ట నీలనవోత్పల
శ్రీ వహించి దృఢాశయ సజ్జన ♦ సేవ్యమై తనరారు శ్రీ
తావహా దివ్యరసోత్కటవాపి త్వ♦దర్థమై యటఁ బొల్చెఁదుర్॥

తా. దేవీ! దయా! నీవు లీలతో విహరింపగోరి నీకు క్రీడాశైలమగు వేంకటగిరిని జేరగా, శ్రీనాథుడుకూడ, నీవు క్రీడించుటకు అనుగుణమైన సరస్సుగా ఏర్పడెను. ఆకొలను నాభీపద్మరుచులతోను నవ నీలోత్పల కాంతులచేతను ప్రకాశించుచు, నిత్యము శీతలమై ప్రసన్నత కలిగి, శ్రద్ధాళువులగు భక్తులచే సేవింపతగినదియునై, దివిభవమునై, అపూర్వమైనదియు మహత్తరమైనదియునై సర్వోత్కృష్టముగా వెలుగుచున్నది. సర్వశేషియగు పరమాత్ముడు నిన్ననుసరించి వర్తించుచున్నాడని భావము.

44. అవ. దయా! సకలలోకేశ్వరుడును శ్రీవైకుంఠసుప్రతిష్ఠుడును నిత్యసూరిసేవితుడునగు శ్రీనివాసుని అంజనగిరిపై నవతరింపజేసి ఆశ్రితులకు నీవు సులభముగా భగవదనుభవము గలుగ జేయుచున్నావని క్రింది రెండుపద్యముల దెల్పుచున్నారు.

శ్లో॥ యస్మిన్ దృష్టే తదితరసుఖై ర్గమ్యతే గోష్పదత్వం
సత్యం జ్ఞానం త్రిభి రవధిభి ర్ముక్త మానందసింధుం।

త్వత్స్వీకారా త్తమిహ కృతిన స్సూరిబృందానుభావ్యం
నిత్యాపూర్వం నిధిమివ దయే నిర్విశంత్యంజనాద్రౌ॥

టీ. హేదయే ! యస్మిన్ దృష్టే = ఏపరమపురుషుని నిరతిశయానందస్వరూపమును జూడగాజూడగా, తదితరసుఖాః = పరిపూర్ణబ్రహ్మానుభవానందమునకు నితరములైన సర్వసాంసారిక సుఖము లందు, గోష్పదత్వంగమ్యతే - ఆవుపాదమంత స్వల్పత్వము కనబడునో అట్టి, సత్యం = సత్తైకరూపుని (నిర్వికారస్వరూపుని) జ్ఞానం = అజడమైనదానిని (స్వయంప్రకాశమైనదనుట) త్రిభిః అవధిభిః ముక్తం = దేశకాలవస్తుపరిచ్ఛేదరహితమును అనగా సర్వతత్త్వాతీతమును, ఆనందసింధుం = అపరిచ్ఛిన్నమగు ఆనందమునకు నిక్కయు, సూరిబృందానుభావ్యం = నిత్యసూరిసమూహముచే ననుభవింపం దగినదియు "మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం। కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ" అన్నట్లు భగవద్గుణానుభవ కీర్తనాదులు చేయుటకు సహాయము కావలసియున్నది కావున, బృందమనబడినది. "బృందంబృంద మయోధ్యాయాం" అని శ్రీరాముని కల్యాణగుణ కీర్తనానుభవములు చేయుటకు ప్రజలు బృందము బృందముగా గూడిరని వాల్మీకులును తెలిపియున్నారు. అట్లు నిత్యసూరిబృంద సేవ్యమైనదియు, నిత్యాపూర్వం = నిత్యనూతనమైనదియు, లేక నిత్యాశ్చర్యావహ మైనట్టిదియు నైన, తం = ఆశ్రీనివాసుడను పరబ్రహ్మమును, త్వత్స్వీకారాత్ = దయా, నీ యొక్క పరిగ్రహముచేత, నీవు ఆశ్రితులకు మేలుచేయనెంచి వృషగిరిపై నవతరింప చేయుటచేత, అంజనాద్రౌ ఇహ = ఈపృథ్విపై అంజనగిరియందు, కృతినః = పుణ్యులు, భవదాశ్రితులు, నిధిమివ = గొప్ప ధననిధిని గనినదానినివలె, నిర్విశంతి = అనుభవించి సంతోషించుచున్నారు. "అంజనాద్రౌ నిధిమివ నిర్విశంతి" యనుటచే

గుప్తమగు నిధిని జూచుటకు కాటుక కావలసినను, అంజనాద్రియగు టచే కాటుక అవసరము లేదని ధ్వనించుచున్నది. పరమ దుర్లభమైన పరమవ్యోమవర్తియగు వస్తువును, సర్వసులభ దర్శనయోగ్యముగా నొనరించిన నీయొక్క ఆశ్రితవాత్సల్యవిశేషమును బొగడ దరముకాదని భావము.

అం॥ ఎందుఁగనర్గ జను గోష్పదమట్లు సు ♦ ఖేతరంబులు నట్టి యా
నందనిధిఁ నిరవద్యుని బంకజ ♦ నాభు సూరిజనోచితుఁ
బొందఁగ రాని మహాద్భుతధాము న ♦ పూర్వదర్శను నంజనా
ద్రిం దయా! చూపవె పెన్నిధిఁగన్నగతిఁ సుఖింపఁగసంశ్రితుల్॥

తా. ఏపరమపురుషుని అనుభవించుటయను బ్రహ్మానందమునకు నితరసుఖములెల్ల మిక్కిలి హీనమై గోష్పాదమంతటదిగా గానబడునో, అట్టి సత్యస్వరూపుని జ్ఞానానందమయుని, నిత్యసూరులగు అనంత విష్వక్సేనాదులచే భోగింప తగినవానిని, నిత్యాపూర్వమైన అనగా అప్పటికప్పటికి నూతనమైన రుచులచే మించు సుందర దివ్యమంగళ విగ్రహుని, అకించనులకు నిధియై వెలుగు శ్రీనివాసుని నీవు వేంకటాద్రిపై నవతరింపజేసి యాశ్రితులకెల్ల భగవద్రూప గుణ చింతనానుభవమును పరమానందమును గలుగజేయుచున్నావు.

45. అవ. ఆశ్రితుల భోగార్థము శ్రీనివాసుడను మహానిధి దానము ముందుపద్యమున జెప్పబడినది. ఈపద్యమున ఆశ్రితులు అనాశ్రితులు అని వేఱు లేక అందఱికిని, భూరిదానన్యాయము ననుసరించి పరిక్షానిరపేక్షముగాను, "ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయంత మివ ప్రజాః" అనునట్లును భగవదనుభవము కలుగఁజేసి సుఖింప జేయుచున్నా వనుచున్నారు.

శ్లో॥ సారం లబ్ధ్వా కిమపి మహత శ్శ్రీనివాసాంబురాశేః
కాలేకాలే ఘనరసవతీ కాళికే వానుకంపే।

వ్యక్తోన్మేషా మృగపతిగిరౌ విశ్వ మాప్యాయయంతీ
శీలోపజ్ఞం క్షరతి భవతీ శీతలం సద్గుణౌఘం॥

టీ. హే అనుకంపే! శ్రీనివాసాంబురాశేః సారం లబ్ధ్వా= (శ్రీనివాసుడను మహాసముద్రమునుండి గుణసారమునంతయు గ్రహించి (గాంభీర్యౌదార్యాది గుణములచేతను, నీలమేఘశ్యామల కోమల శరీరము గల్గుటచేతను, "దృష్టఏవహి న శోకమపనేష్యతి రాఘవః" యని శ్రీరామునివిషయమై చెప్పినట్లు, చూచువారల కృపజూచుచు, తాపమును హరించు ప్రసిద్ధి గల్గుటచేతను, శ్రీనివాసుని సముద్రముతో రూపింపబడినది.) కిమపి సారం లబ్ధ్వా = అవాఙ్మానసగోచరమగు సౌశీల్య సౌలభ్య వాత్సల్య మాధుర్యాది గుణముల సారము గొని (మేఘపక్షమున సముద్రమునుండి లవణరహితమైన జలము బీల్చి) ఘనరసవతీ = దయనీయులైన బద్ధజీవులం దాదరము గల, భవతీ = నీవు (మేఘపక్షమున రసము = జలము, ఎక్కువ నీటిని ధరించి) కాళికేవ = మేఘపంక్తిని బోలి, మృగపతిగిరౌ = సింహాదిమృగములకు నివాసమైన శ్రీవేంకటగిరియందు, కాలేకాలే= చేతనరక్షణోచితమగు ఆపత్కాలమునందు (మేఘపక్షమున ప్రతి వర్షాకాలమున) వ్యక్తఉన్మేషా = భగవత్ప్రదర్శనముచే ప్రకటిత వాత్సల్యగుణము గలదానవై (మేఘపక్షమున చూపబడిన మెరుపు గలదని యర్థము) విశ్వం ఆప్యాయయంతీ సతి = తాపత్రయాతురమైన ప్రపంచమును అనగా చేతనులను తాపోన్మూలనముచే సౌఖ్య మాపాదింప పూనిన దానవగుచుండగా (మేఘపక్షమున నిదాఘతప్తులగు ప్రజలకు పిపాసాశమనముచేతను సస్యాదుల వృద్ధి చేతను మేలుచేయుటయని యర్థము) శీలోపజ్ఞం = సుశీలస్వభావముచే ముందుగా నెఱుగదగినట్టి, శీతలం సద్గుణౌఘం = శమదమాదులచే సుఖశీతలమై యనుభవింపదగిన, సద్గుణౌఘం = సద్గుణసము

దాయమును (మేఘపక్షమున ఓఘం (ప్రవాహమును) క్షరతి=వర్షిం చుచున్నావు. "సమస్తకళ్యాణ గుణామృతోదధిః" అన్నట్లు గుణసాగరుని సారమును గొని వర్షించుటనగా, అమృతాయమాన మగు గుణానుభవము అందరికికలుగ జేయుచున్నావని తాత్పర్యము. (మేఘపక్షమున జలస్థలవిభాగము చూడక అంతటను వర్షించి ప్రవాహము లేర్పడునట్లు చేయుటని భావము.)

ఉ॥ భూరిరసావహా! నీవు ఘనావళిఁ ♦ బోలి మాధవుఁడన్ మహా
వారిధిసార మశేషముఁ దీల్చుచు ♦ వ్యక్తకాంతి వృషాద్రిపైఁ
జేరి సకాలమునన్ గురియన్ విభు♦శీలముఖ్యుల సన్మహో
దార గుణామృత ధారల విశ్వము ♦ తాపవర్జితమా దయా!

తా. దయా! నీవు కాలమేఘమును బోలి, శ్రీనివాసుడను వారిరాశి సారమునంతయు గొని, వృషగిరిపై ప్రకాశించుచు సమయోచితమగునట్లు వర్షింపగా (భగవద్గుణములను రక్షణాదికృత్యములచే వెల్లడి చేయగా) సర్వజనులు సంసారతాపత్రియములచే పీడితులుగాక సుఖించుచు, భగవంతుని సౌశీల్యవాత్సల్య గాంభీర్యాదార్యాదులగు కళ్యాణగుణములను మిక్కిలిగా అనుభవించుచున్నారు. దయాసారభూతుడగు శ్రీనివాసుని లోకులకు జూపుట నీయొక్క కార్యమేకాదా?

46. అవ. బాణాసురునికూతురగు ఉషాదేవిసాన్నిధ్యమునకు స్వప్నదృష్టుడైన అనిరుద్ధుని సపర్యంకముగా దెచ్చి సంతోషింపజేసిన చిత్రలేఖవలె నొప్పు నీవు, చేతనోజ్జీవనార్థము వైకుంఠనిలయుడైన శ్రీనివాసుని వేంకటాద్రిపై తెచ్చి నిల్పు టేమియాశ్చర్యము? భగవన్నియుక్తుడై సృష్ట్యనంతరము ప్రజల కజ్ఞాననివృత్తి గోరి భగవంతుడు నిర్మించిన శాస్త్రము లన్నియు సంసారసాగర

మగ్నులగు సకలజీవుల నుద్ధరించుటకు తగిన చేయివలె నొప్పుచున్న వని రూపకాలంకారమున వివరించుచున్నారు.

శ్లో॥ భీమే నిత్యం భవజలనిధౌ మజ్జతాం మానవానా
మాలంబార్థం వృషగిరిపతి స్త్వన్నిదేశా త్ప్రయుఙ్క్తే।
ప్రాజ్ఞాసారం ప్రకృతిమహతా మూలభాగేన జుష్టం
శాఖాభేదై స్సుభగమనఘం శాశ్వతం శాస్త్రపాణిం॥

టీ॥ భీమే = కామక్రోధాదులగు జలజంతువులచే భయంకరమైన, భవజలనిధౌ = సంసారసముద్రమున (సంసారము దుస్తరమై అపారమై పరగుటచే సముద్రసామ్యము) నిత్యం మజ్జతాం మానవానాం = ఎడతెగక మునుగుచుండు మనుష్యులకు, ఆలంబార్థం = చేయూతనిచ్చుకొరకు, త్వన్నిదేశాత్ = నీయాజ్ఞచే, వృషగిరిపతిః = శేషాద్రినాథుడు, శాస్త్రపాణిం ప్రయుంక్తే = శాస్త్రమను చేయిని విధించుచున్నాడు. ఆశాస్త్రమనుచేయిఎట్టిదని శ్లేషచే వివరించుచున్నారు; ప్రాజ్ఞాసారం = కృత్యాకృత్య వివేకరూపమైన సారం, సారముగలదనియు (పాణిపక్షమున బలముగలదని యర్థము. బలము లేనిచో భవజలధిమగ్నులను లేవదీయుట సాధ్యపడదు) ప్రకృతి మహతా మూలభాగేన జుష్టం = నైజముచేతనే భగవత్ప్రతిపాదనముచే విశేషమహిమగల మూలభాగముచే అనగా మూలమంత్రమగు ప్రణవముతో గూడినదియు, (వేదశాస్త్రములు ఓంకారప్రతిష్ఠితములగుట) పాణిపక్షమున స్వభావస్థితములగు శిరోభుజ శిఖరములచే గూడిన చేయిఅని అర్థము; శాఖాభేదైః సుభగం = అనేక వేదశాఖలచే నొప్పునదియు (పాణిపక్షమున కనిష్ఠాంగుష్ఠా ద్యంగులి విశేషములచే, అనగా అయిదువ్రేళ్లతో నొప్పునదియని యర్థము.) అనఘం = నిర్దుష్టమైనదియు (పాణిపక్షమున భంగాది దోషరహిత

మని యర్థము) శాశ్వతం = స్థిరమైనదియు నగు, శాస్త్రిపాణిం వేద శాస్త్రిములను చేయిని, ప్రియుంక్తే = విధించుచున్నాడు.

అం॥ మానక దుస్తరభీమభవాంబుధి ♦ మగ్నులైన నరాళికిఁ
బూని త్వదాజ్ఞను నాఁతకొనర్చె దయ♦బోధసారము మూలభా
గానుగుణంబు వివర్జితదోషము ♦ నై యనేకపుశాఖలఁ
జానుగ నొప్పెడు శాస్త్రకరం బహిం♦శైలభూషణుఁ డిచ్చెడుఁ॥

తా. దయా ! సంసారపయోధిలో మునిగెడుజనులనుఉద్ధరించెడు నిమిత్తము శ్రీనివాసుడు నీచే నియుక్తుడగుచు, బోధబలము గలదియు, ఓంకారాదియు, శాఖాభేదములచే నొప్పునదియు, దోషరహితమును శాశ్వతమైనదియు నైన శాస్త్రమను చేయినూతగా నిచ్చుచున్నాడు.

47. అవ. దయా ! ఒక్కొక్కమాటు నీయాశ్రితులకు విరోధులైనవారిని దండించునిమిత్తము, నీప్రీతిని గోరియే శ్రీనివాసుడు, తాను ముందురచించిన వేదశాస్త్రములకు విరుద్ధములగు మాయాశాస్త్రములనుగూడ రచించుచున్నాడని తెల్పుచున్నారు.

శ్లో॥ విద్వత్సేవాకతకనికషైః ర్వీతపంకాశయానాం
పద్మాకాంతః ప్రణయతి దయే దర్పణం తే స్వశాస్త్రం ।
లీలాదక్షాం త్వదనవసరే లాలయ న్విప్రలిప్సాం
మాయాశాస్త్రాణ్యపి దమయితుం త్వత్ప్రపన్నప్రతీపాన్॥

టీ. హేదయే ! పద్మాకాంతః='పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ । కార్యం కరుణ మార్యేణ నకశ్చి న్నాపరాధ్యతి" అని యుపదేశించినదియు, "కరుణాం మూర్తిమతీమివ" యని నీరూపమునే తాల్చినదో యన్నదగు లక్ష్మీదేవి యొక్క వల్లభుడు, ఏమియాశ్చర్యము ? అతని సర్వప్రయత్నము

లును నీ ముఖోల్లాసముకొఱకే యని స్ఫురించుచున్నది ; విద్వత్సేవాకతక నికషైః=విద్వాంసుల సేవించుటయనుఇండుపగింజయొక్క రాపిడిచే, వీతపంక ఆశయానాం = పాపరహిత మనస్కులగువారికి (అప్రకృతార్థము ఇండుపగింజ గంధమును మురికినీటిలో కలిపిన ఆ నీరు తేటయగును.) సాధుసేవల చిత్తము నిర్మలమగుటచే దానిని కతకనికషణముగా రూపింపబడినది. అట్టి కళంకరహితమైన అంతఃకరణము గలవారికి, తే దర్పణం స్వశాస్త్రం = నీకు నిలువుటద్దమై వెలుగు భగవత్స్వరూపరూప గుణవిభవములనుప్రకటించు వేదాది శాస్త్రములను, ప్రణయతి=రచించుచున్నాడు. అద్దములో ముఖావలోకనము స్పష్టమగునట్లు భగవచ్ఛాస్త్రములందు దయావైభవము నిర్మలచిత్తు లగువారికి స్పష్టముగా గానవగునని భావము. అందుచే శాస్త్రములను దర్పణముగా రూపింపబడినది. త్వదనవసరే=నీవు అక్కఱలేనపుడు అనగా ప్రణయకోపమును జెంది, నీవు అప్రసన్నవై యున్నపుడు, లీలాదక్షాం = మహిషి ఇచ్ఛకు రానపుడు వారకాంతవలె విలాసచాతుర్యాదులు గల, విప్రలిప్సాం = విప్రలంభశృంగారేచ్ఛను, లాలయన్ = పాటించునిమిత్తము, త్వత్ప్రపన్నప్రతీపాన్ దమయితుం=నీయాశ్రితులవిరోధులను దండించుకొఱకు, మాయాశాస్త్రాణ్యపి=తాను మున్దొనరించిన వేదశాస్త్రములకువిరుద్ధములైన మాయాశాస్త్రములనుగూడ, ప్రణయతి=రచించెడును, బౌద్ధాదిరూపములుగొని కాణాద శాక్య బౌద్ధ పాషండాదిమతములను ప్రవర్తింపజేయుచున్నాడు. ఆహా! నీయెడ అపచారపడుట యెంతక్రూరము ! భగవదపచారము క్రూరము. భాగవతాపచారము క్రూరతరము, భాగవతాశ్రితాపచారము క్రూరతమము. విప్రలంభేచ్ఛయందును నీకు విరోధులగు జనులను దండించుటకై పూనుకొనుటచే, సర్వకాలము నీవిధేయత్వమునే ప్రకటించుచు

న్నాడు. మాయాశాస్త్రప్రవర్తనులై నీ విరోధులు అశుచివ్రతులై మాన మోహ మదాన్వితులగుచు "తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్ | క్షిపా మ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు | ఆసురీం యోని మాపన్నా మూఢా జన్మని జన్మని | మా మప్రాప్యైవ కౌంతేయ తతో యాం త్యధమాం గతిం॥" అన్నట్లు ఆసురప్రకృతిలో బుట్టి, భగవద్దయా దూరవర్తులై యధోగతుల పాలగుదురు. అదియే వారికి దండనము. ప్రకృతమగు దయాస్తోత్రవిషయమున, మహిషీ వారవనితాసక్తుడైన ఒకానొక సామాన్య నరపతివృత్తాంతము స్ఫురించుటచేత, అలంకారము సమాసోక్తి.

ఉ॥ శ్రీదయితుండు భవన్మహిమల్ వివరించుశాస్త్రచయంబు లాపాదిలఁజేయు బుధాశ్రియ నిర్గత ♦ పంకిలాత్ములకుల్ దయా వేదవిరుద్ధములున్ బ్రకటించెడు ♦ విప్రలంభము నొంది నీ కాదట గూర్ప తథాగతుఁడై భవ♦దాశ్రితారులు చేద్పర్ఁ॥

తా. దయా! పెద్దలసేవచే శుద్ధాత్ములైన మహానుభావులకు నీవైభవము స్పష్టముగా దెల్పునట్టి వేదప్రామాణ్యముగల శ్రీపాంచరాత్రాది శాస్త్రములను శ్రీవల్లభుడు నిర్మించుచున్నాడు. అతడే నీవించుక కోపించి దూరముగానున్నపుడు నీకు మెప్పు జేయగోరి, నిన్నాశ్రయించు సజ్జనులకు విరోధులెల్ల చెడిపోవునిమిత్తము, తాను ముందొనరించిన వేదాదిశాస్త్రములకు విరోధములగు తప్పుడు శాస్త్రములను గూడ బుద్ధాదిరూపములు గైకొని ప్రవర్తింపు చున్నాడు.

48. అవ. ఇట్లు బ్రహ్మపర్యంతము భోగైశ్వర్యముల నిష్ప్రయోజనత్వ మెఱిగి, సారవిదులగు పెద్దలు మోక్షమునకై దయా

నిధియగు శ్రీపతిని ఆశ్రయించుటయు, ఆశ్రితరక్షణ వ్యామోహ మున వైకుంఠమునుండి యితడు వేంకటాద్రిపై నవతరించినదియు, అతని శాస్త్రప్రవర్తనప్రకారమును తెల్పినవారై, దేశికులవారు, క్రింది మూడుశ్లోకముల భగవద్దయావీక్షణముయొక్క ప్రభావమును వర్ణింపగోరి యీశ్లోకమున నొకదేహికి హఠాత్తుగాకరుణించి రక్షిం చెదనని భగవంతుడు వాగ్దానము చేయుటను తెలియజేయుచున్నారు.

శ్లో॥ దైవాత్ప్రాప్తే వృషగిరితటం దేహిని త్వన్నిదానాత్
స్వామిన్ పాహీ త్యవశవచనే విందతి స్వాప మంత్యం।
దేవ శ్శ్రీమాన్ దిశతి కరుణే దృష్టి మిచ్ఛన్ త్వదీయా
ముద్ఘాతేన శ్రుతిపరిషదా ముత్తరే ణాభిముఖ్యం॥

టీ. హేకరుణే! త్వన్నిదానాత్ దైవాత్ = నీయొక్క సిదేశముచే గల్గిన ప్రాణియొక్క భాగ్యవిశేషముచే, వృషగిరితటం ప్రాప్తే దేహిని=వేంకటాద్రిని చేరినట్టి యొకానొకజంతువు(మనుష్య తిర్యగ్జంతువులలో నొకటియనుట.) స్వామిన్ పాహి ఇతి అవశ వచనే = స్వామీ నన్ను రక్షింపుమని వశముగాక పల్కుసమయ మున (అట్లు పల్కుటయు దయాకార్యమని తెలియవలయు.)అన్త్యం స్వాపం = అంతిమనిద్ర అనగా పంచత్వము, విందతిసతి = పొంది నచో, ఆసమయమున, దేవః శ్రీమాన్ = శ్రీమంతుడైన దేవుడు, త్వదీయాం దృష్టిం ఇచ్ఛన్=నీయొక్క ఆనందదాయకములగు శీతల దృష్టిని కోరినవాడై ; అనగా నీ యనుమతి లేనిదే యతడు స్వయ ముగా రక్షింపలేడు కావున నీప్రసాదకాంక్షియై, నీవును తోడు పడుచుండగా, శ్రుతిపరిషదాం ఉద్ఘాతేన = వేదసమూహముల కాదియైన "ఓం" అను ఉత్తరేణ = ప్రత్యుక్తిచే, అభిముఖ్యం దిశతి = తాను ప్రసన్నుడై యాప్లే రక్షించెదనని తెల్పుచున్నాడు. 'ఓం 'అని ఉచ్చరించి వేదాధ్యయనాది వైదిక క్రియలు ప్రవర్తింప

బడుటచే అది వేదమునకు ఉపోద్ఘాతముగా జెప్పబడినది. "తస్మాదో మిత్యుదాహృత్య యజ్ఞ దాన తపః క్రియాః ప్రవర్తంతే...." యని గీతోక్తి గలదు. అవశుడై చేతనుడు పలుకుటకును శక్తి లేక "స్వామిన్ పాహి" యనిన మాత్రమున, అనగా లోకదృష్టిరీతిగా అసమగ్రమగు కారణమున దేవుడు ప్రసాదించునట్లు కార్యోత్పత్తి వర్ణితమగుటచే, ఇందలంకారము విభావన. మఱియు, "ఓం" అను దానికి మాఱుగా "ఉద్ఘాతేన శ్రుతిపరిషదాం" అని గమ్యార్థమును వేఱువిధముగా దెలుపుటచే పర్యాయోక్త మలంకారము. స్వాధీన భర్తృకయను నాయికా వృత్తాంతమును గోచర మగుచుండుటచే అలంకారము సమాసోక్తియు నగును.

అం॥ దేవి భవన్నియతిన్ వృషభాద్రిని, దేహ యొక్కడు చేరి "నన్ గావవె స్వామి!" యటంచు వసం బఱి, కాలధర్మమునొందినన్ దేవశిఖామణి శ్రీపతి తావక ♦ దృష్టిసఖ్యము గోరి సం భావన నోం ప్రసన్నతఁ దెల్పును, భాసురంబుగ నోంకృతిన్॥

తా. కరుణా! నీచే ప్రేరితుడై యొకానొక శరీరి వేంకటాద్రి తటము చేరి "నాథా! నన్ను గావవే" యని శ్రీనివాసుని పరవశుడై ప్రార్థించు నవసరమున శరీరవియోగ మొందగా శ్రీమంతుడైన దేవుడు ఆసమయమున నీయొక్క శీతలాపాంగములనుగోరినవాడై, నీప్రసంగముచే సుముఖుడై "ఓం" అను ప్రణవము నుచ్చరించుచు, అట్లే రక్షించెదనని యుత్తర మొసగుచున్నాడు.

49. అవ. దయాశీతలిత భగవత్కటాక్ష లేశముయొక్క ఫలమును వివరించుచున్నారు.

శ్లో॥ శ్రేయస్స్నాతిం సకృదపి దయే సమ్మతాం యస్సఖీం తే
శీతోదారా మలభత జన శ్శ్రీనివాసస్య దృష్టిం।

దేవాదీనా మయ మనృణతాం దేహవత్త్వేపి విందత్
బంధా న్ముక్తో బలిభి రనఘైః పూర్యతే తత్ప్రియుక్తైః॥

టీ. హేదయే! శ్రియాస్స్నాతిం = సదాచార్య సమా శ్రయణాది బహువిధశ్రేయములకు గారణమైనదియు, సమ్మతాం తే సఖీం = నీకభిమతమైన నెచ్చెలియు; అందుచే (అనగా నీసాహ చర్యముచే), శీతోదారాం = శీతలమును శ్రేష్ఠతమ మైనదియు, అనాదికాల జనిత తాపత్రియహతిచే తప్తులగు జీవులకు అమృత ధారాపాతముగ వెలుగుచుండునదియు నగు, శ్రీనివాసస్య దృష్టిం= శ్రీనివాసునియొక్క దృష్టిపాతమును, దయాతరంగితమగు కటాక్షసం బంధమును, సకృదపి = ఒకసారియైన, యః అలభత = ఏభాగ్య శాలి పొందునో, అయంజనః = అతడు, దేహవత్త్వేపి=దేహముతో నున్నపుడే, అనగా శరీరపాతమునకు ముందుగానే యనుట; దేవా దీనాం ప్రతి= దేవ పితృ మనుష్యాదులవలన, అనృణతాం విందత్= ఋణవిముక్తినిబొందినవాడై; అనగా"త్రిభీఋణవాజాయతే, బ్రహ్మ చర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః" అను రీతి బ్రహ్మచర్యవ్రత వేదాధ్యయనాదులచే ఋషులఋణమును, యాగాదులొనరించి దేవతలఋణమును; ప్రజలనుబుట్టించి తిలో దకప్రదానాదులు చేయునిమిత్తము సంతతిని నిల్పి పితరుల ఋణ మును దానాదు లొనరించి, మనుష్యుల ఋణమును దీర్చినవాడు, సర్వ ఋణవిముక్తిని బొంది మోక్షార్హు డగుచున్నాడు; ఋణము తీరకుండుటచే దేహబంధము కలుగుచున్నది. భగవత్కరు ణావలోకనమునకు పాత్రుడైన జనుడు, దేహముతో ఈసంసార మండలమున వర్తించునపుడే, అతని కటాక్షప్రభావమున సర్వ ఋణములవలన నీగబడుచున్నాడు. అందుచే వానికి మోక్షము కరతలామలకమై యుండునని భావము. అనపత్యుడైన భీష్మాచా ర్యులవారికిని, యజ్ఞయాగాదులన నేమియో తెలియని గజేంద్ర

గృధ్రి శబరీప్రముఖులకు మోక్షమబ్బుట, భగవ ద్దయావీక్షణ ప్రభావము కారణము. " దేవర్షి భూతాత్మ నృణాం పితౄణాం నకింకరో నాయ మృణీచ రాజన్ । సర్వాత్మనా యః శ్శరణం శరణ్యాం నారాయణం లోకగురుః ప్రపన్నః॥ " అను శ్లోకముచే ప్రపన్నుడు సర్వ ఋణవిముక్తుడగుట సిద్ధము. సకృదపి యనుటచే " సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।. అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ "అను రామాయణశ్లోకము స్మారితము. ఇట్లు సుజనుడు ఋణాదులనుండి తప్పించుటచే, బంధాత్ ముక్తః= సంసారబంధమునువదలి ముక్తుడై అర్చిరాదిమార్గమున బోవుచుండగా, తత్ప్రియుక్తైః = అందలి దేవతలచే నొసగబడు, అనఘైః బలిభిః=అనింద్యములగు పరిశుద్ధతరములైన ఉపహారములచే " సర్వేస్మై దేవా బలి మావహ న్తి " అన్నట్లు వారు ప్రీతితో నొసగు కానుకలచే, పూర్యతే = పూరింపబడి గౌరవింపబడుచున్నాడు. జగదధీశ్వరునికృపావీక్షణబలమున, నాథ యామునాదులచే పూర్వముగానే అధిరూఢమైన పరమపదమును ప్రాపించుచున్నాడని తాత్పర్యము.

అం॥ నీకు సఖంబు నుదారము శీతము ♦ నిత్యసౌఖ్యకరంబు లో
కైకశరణ్యము నైన రమేశు క ♦ టాక్షముం గను నెవ్వఁ డిం
దాకృతి దేవఋణాదుల నీఁగుచు ♦ నర్చిరాది పథంబునన్
గైకొను దేవి ! సురావలి యిచ్చెడు♦ కానుకల్ గొని తృప్తుఁడై॥

తా. దేవీ దయా ! నీకు నెచ్చెలియై నివాససహవాసములకు యోగ్యమైన శ్రీపతిదృష్టిచే నేమహాత్ముడుచూడబడునో, ఆపుణ్యశాలి దేవర్షి భూత పితృ మర్త్య ఋణములెల్లను దాటుచు, జనన మరణాది రూప సంసారబంధమును విడిచి, యర్చిరాదిమార్గమున జని పరమపదమును జేరుచున్నాడు.

50. అవ. శ్రీనివాసకటాక్షలాభమున జీవుడు "అపిచేత్సు దురాచారో భజతే మా మనన్యభాక్ । సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితోహి సః॥" "క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి । కౌంతేయ ప్రతిజానీహి నమే భక్తః ప్రణశ్యతి॥" యను గీతావాక్యములచొప్పున, అతిపాపప్రసక్తి గలవాడైనను సదాచార్యసమాశ్రయణమున శీఘ్రముగా పాపవిముక్తుడై, ధర్మాత్ముడై, పరమపదనాథుని బొందుచున్నాడని తెలుపుచున్నారు.

శ్లో॥ దివ్యాపాంగం దిశసి కరుణే యేషు సద్దేశికాత్మా
క్షిప్రం ప్రాప్తా వృషగిరిపతిం క్షత్రబన్ధ్వాదయ స్తే ।
విశ్వాచార్యా విధి శివముఖా స్స్వాధికారోపరుద్ధా
మన్యే మాతా జడఇవ సుతే వత్సలా మాదృశే త్వం॥

టీ. హేకరుణే! సద్దేశికాత్మా ఏషు = సదాచార్య సమాశ్రయణమును బొందిన పాపిష్ఠాగ్రేసరులగు క్షత్రబంధు ఘంటాకర్ణ ప్రభృతులందైనను, పూజ్యులును పుణ్యాత్ములునగు పుండరీకప్రభృతులందైనను, సద్దేశికాత్మా అనుటచే, సత్సంప్రదాయ నిరతులగు దేశికులని వివక్షితము. "ఆచార్య స్సహరి స్సాక్షాత్ చరరూపీ నసంశయః" అన్నట్లు సదాచార్యుడు హరిస్వరూపుడై యాశ్రితులకు తమోనివృత్తిచేతను జ్ఞానోపదేశముచేతను భగవంతునియందు రుచినికలిగించి యతనిదయకుపాత్రుడగునట్లు చేయుచున్నాడు. అట్టి జ్ఞానభక్తివైరాగ్య గరిష్ఠులైన యాచార్యులను బొంది సేవించుటను భాగ్యము భగవద్దయచే సంభవించును. అట్టి సద్గురుసేవాపరులైన ఎవ్వరియందు నీవు, దివ్యాపాంగం దిశసి = శ్రేయోదాయకమగు నీకటాక్షమును కలుగజేసెదవో, తే క్షత్రబంధ్వాదయః = అక్షత్రబంధు ప్రముఖులు, వృషగిరిపతిం = శ్రీశ్రీనివాసుని లేక అతని అవ

తారమునకు మూలభూతుడైన శ్రీవైకుంఠనాథుని, క్షిప్రం ప్రాప్తాః= శీఘ్రకాలమునందే చేరినవారైరి. అనగా ముక్తినిబొందిరని భావము. "పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్ । ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్॥" అను శ్లోకముచే భగవంతుడు సద్దేశికద్వారగమ్యుడగుట సిద్ధము. (ఇట్లు అన్వయముచే భగవత్కటాక్షలాభఫలమును వివరించి, తద్దయాపాంగ వీక్షణములు పడయనట్టివారి గతిని వ్యతిరేకమున వివరించుచున్నారు.) విశ్వాచార్యాః = జగత్సృష్ట్యాది కార్యములందు నిరతులగు, విధిశివముఖాః = బ్రహ్మరుద్ర సనకాదులు, వీరువిశేష ప్రభావముగలవారైనను దయా! నీయొక్క పరిపూర్ణ కటాక్షవిశేష లాభమును పొందనివారగుటచే, స్వాధికార ఉపరుద్ధాః = తమ అధికారకృత్యములం దాసక్తులై మోక్షాధికారులు గామిచే వృషగిరిపతిని బొందరైరి. భాగవతాపచారాది మహాపాపప్రసక్తిగలక్షత్రబంధు ఘంటాకర్ణులు మున్నగువారు, నీకటాక్షాన్వయమున సదాచార్యులను సేవించి ముక్తులగుటయు; తద్వ్యతిరేకమున అనగా కటాక్షఅలాభముచే, ప్రతిబంధము లేర్పడి బ్రహ్మరుద్రాదులు ముక్తిబొందకుండుటను జూడగా, త్వం = నీవు, జడసుతే మాతాఇవ = మందబుద్ధియగు లేక జడుడైన కొడుకునందు తల్లివలె, మాదృశే=మాబోటియల్పులయందు, వత్సలా = ఎక్కువ ప్రేమగలదానవని, మన్యే= తలంచుచున్నాను. "సహజం జననీ జనస్య లోకే జడజాతేషు విశేషవత్సలత్వం" అనువిధమునఅవివేకడునుఅసమర్థుడునైనకొడుకు విషయమున తల్లి కెక్కుడు ప్రేమగల్గుట లోకములో సహజము. 'మాదృశే' యని పరమనీచత్వమును అనుసంధించుట, సర్వశేషియగు భగవన్మూర్తివిషయమున మహాత్ములకు సహజము. "అమర్యాదః క్షుద్రః" అన్నట్లు.—

ఉం॥ చల్లని నీదుకటాక్షము లబ్బిన • క్షత్రబంధుముఖుల్ వడిఁ
దెల్లముగా నృషభాదిప్రుఁ బొందిరి • దేవి సద్గురుశిక్షలఁ
జెల్లుబడిఁ జతురాస్యహరాదులు • చిక్కి రాత్మవిచేష్టలఁ
దల్లి జడాత్మజు మెచ్చుగతిఁ దయ • తాల్తువర్తిలిమాయెడఁ॥

తా. ఓకరుణా! నీదివ్యకటాక్షలాభమున క్షత్రబంధుమున్నగు మహాపాపతములు, సత్సంప్రదాయనిరతులగు ఆచార్యులను బొంది వారిమహిమచే ముక్తులగుటయును, నీకరుణాపాంగ విలోకనమును బొందని బ్రహ్మ శివ మహేంద్రాదులు తమతమ సృష్టిపాలనాది కృత్యములదగిలి ముక్తిబొందకుండుటయునుజూడగా, మందాపత్యమునం దెక్కువ మక్కువగల జననిమాడ్కి, నీవు మాబోటి నీచులయం దెక్కువ వత్సలత్వము గలదానవగుట స్పష్టముగా మాకు గనపడుచున్నది.

51. అవ. ఇట్లు చేతనుఁ డాచార్యసమాశ్రయణమున శీఘ్రముగా ముక్తిని బొందుట దయాకృత్యమని సదృష్టాంతముగా నెఱింగించి, యెంత అకించనులైనను దయాప్రభావమున నిత్యధన్యులగుచున్నారని సావయవరూపకాలంకారమున "తృష్ణాతోయే మదన పవనోద్ధూత మోహోర్మిమాలే దారావర్తే తనయసహజ గ్రాహ సంఘాకులేచ। సంసారాఖ్యే మహతిజలధౌ" అన్నట్లు, సంసారజలధిని తరించుటకు దయను ధర్మార్థము నిర్మింపబడిన సేతువుతో బోల్చి విశదీకరించుచున్నారు.

శ్లో॥ అతికృపణోపి జంతు రధిగమ్యదయే భవతీ
మశిథిలధర్మసేతు పదవీం రుచిరా మచిరాత్ ।
అమితమహోర్మిజాలమతిలంఘ్య భవాంబునిధిం
భవతి వృషాచలేశ పదపత్తన నిత్యధనీ॥

టీ. హేదయే! స్తుతివిషయము తెలియవలచుటకును స్తుతి జనితశ్రమ పరిహారార్థమును, అమృతాయమానమగు దయను ప్రతి పద్యములో సంబోధించుచున్నారు. అతికృపణోపి జంతుః = ఎంత నికృష్టతముడగు నరుఁడైనను (అందుచేతనే జంతువనబడెను.) రుచిరాం = మనోజ్ఞమగు, అశిథిల ధర్మసేతుపదవీం = ఎన్నఁడు శిథిలము గాని ధర్మార్థమై సంసారజలధిని దాటునిమిత్తము నిర్మింపబడిన సేతు మార్గమునుబోలు, భవతీం = నిన్ను; 'అశిథిల' అనుటచే, ఆశ్రయించినవారిని ఎన్నఁడు చేపట్టి విడువకుండుట ధ్వనించుచున్నది. "భయం త్యజత భద్రంవః", "నమేభక్తః ప్రణశ్యతి" "యోగక్షేమం వహామ్యహం" అని అనేకవిధములుగా ప్రతిజ్ఞలుగావించిన దయానిధియగు శ్రీనివాసుడు ఆశ్రితరక్షణ నిత్యవ్రతుడగుట స్పష్టము కావున, దయా! నిన్ను, అధిగమ్య = పొంది, చేరి, లేక ఆశ్రయించినవాడై; అచిరాత్ = అతిత్వరలో, అమితమహోర్మిజాలం = అనేకములగు గొప్ప అలలసమూహముగల, భవాంబునిధిం అతిలంఘ్య = సంసార మనుకడలినిదాటి. "బుభుక్షాచ పిపాసాచ ప్రాణస్య మనసస్స్మృతః। శోకమోహౌ శరీరస్య జరామృత్యూ షడూర్మయః॥" అని ఆకలియు, దప్పియు, శోకమోహములును ముసలితనము చావుఅను ఆఱు గొప్పసంసారసాగర తరంగములుగా జెప్పబడినను ప్రత్యేకముగా అవాంతరభేదములచే అలలు పెక్కగుటచే "అమిత మహోర్మిజాల" మనబడినది. అట్టి దురంతమై భయంకరమగు భవసముద్రమును దాటి, వృషాచలేశ పదపత్తన నిత్యధనీ భవతి = శ్రీనివాసుని పదము, చరణము లేక స్థానము శ్రీవైకుంఠమను పట్టణమును జేరినవాడై నిత్యముక్తుడగుచు ధన్యుడగుచున్నాడు; అనగా నిరతిశయ బ్రహ్మానుభవముచే గల్గినప్రీతిచే భగవన్నిత్యకైంకర్యరూపమగుఫలమును బొందుచున్నాడనిభావము.

ఈపద్యమున ఒకానొక నిర్ధనుడు ధనార్జనమునం దాసక్తుడై వర్తకు లనుగూడి సేతుమార్గమున సముద్రమును సులభముగా గడచి, ద్వీపాంతరమును బొంది, యందొక్క గొప్ప పట్టణమును జేరి, యందు విశేషధనము సంపాదించి మహానందమును బొందుచున్నా డను సప్రకృతవిషయము పరిస్ఫురించుటచే సమాసోక్తి అలంకారము.

చ॥ కరము దృఢంబు రమ్యమును ♦ గా రచియించిన ధర్మసేతువై
పరఁగెడు నిన్ను నండగొను ♦ ప్రాణి యకించనుఁడై ననేమి? చె
చ్చెరను బహూర్మి భీమభవ ♦ సింధువు నంబ! తరించి వేంకటే
శ్వర పదపట్టణంబు గని ♦ సంతస మొందడె నిత్యధన్యుఁడై ॥

తా. అమ్మా దయా! శోక మోహ జరా మృత్యురూపము లైన మహాతరంగములచే భయంకరమై దాటరాని సంసారసాగరమును దరించు నిమిత్తము, ధర్మాధరముగా నిర్మితమైన సేతువై యొప్పు నిన్ను నాశ్రయించిన క్షుద్రనరుడు, హాయిగా త్వరలో సంసారాబ్ధిని గడచి, శ్రీనివాసుని చరణారవింద పరిచర్యారూపమగు నిత్యధన్యత్వమును బొందుచున్నాడు.

52. అవ. ముందుపద్యమున దయను ఆశ్రయించి యకించనుడైన వాడును పరమపురుషార్థమును బొందుచున్నాడని తెల్పి, యీపద్యమున ఆభిముఖ్యముచేతనే అనగా దయను సంశ్రయింపవలయునని ఉద్దేశము కల్గినమాత్రమున, చేతనుడు సంసారహేతుభూతమగు అనాదికాలప్రవృత్తానంత పాపసంచయములచే విడువబడుచున్నాడని తెల్పుటకై, దయను సరస్వతీనదితో బోల్చి, శ్లేషతో గూడిన యుపమాలంకారమున విశదీకరించుచున్నారు.

శ్లో॥ అభిముఖ భావ సంప దభిసంభవినాం భవినాం
క్వచి దుపలక్షితా క్వచి దభంగుర గూఢగతిః ।

విమల రసావహా వృషగిరీశ దయే భవతీ
సపది సరస్వతీవ శమయ త్యఘ మప్రతిఘం॥

టీ. హేవృషగిరీశదయే ! అభిముఖాభాన సంప దభిసంధ వినాం = నిన్నాశ్రయింపవలయునను కోరికను గల ప్రకృతిలో బుట్టినట్టి ధన్యులగు, భవినాం = సంసారులకు, లోకములో సృష్టి రెండు విధములు. దైవ, ఆసురములు. "దైవీ సంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా" అను గీతావాక్యముచొప్పున దైవప్రకృతిలో జన్మించినవారు సాధువర్తనులై భగవంతున కభిముఖులై యతనిదయను బొందెదరు. ఆసుర ప్రకృతిలో బుట్టినవారు అహంకార మమకార దూషితులై కామక్రోధాదుల పాల్పడి భగవంతుని జేరక నికృష్టజన్మ లెత్తుచుందురు. నీయందు శరణ్యత్వబుద్ధిని గల వారికి, విమలరసావహా సరస్వతీవ = నిర్మలమైన, రస = చేతనులందు ప్రేమరసమును గల్గుచు (సరస్వతిపక్షమున పరిశుద్ధమైన, రస = జలమును గలదని యర్థము.) భవతీ = నీవు, సరస్వతీవ = సరస్వతియను నదివలె, క్వచిత్ ఉపలక్షితా=ఒకచేతనునివిషయమై వ్యక్తముగా కనపడియు, క్వచిత్ అభంగురగూఢగతిః = ఒక్కొక్కచో దయాకార్యము అప్రకటమగుటచే గూఢమగు ప్రవృత్తిని గల్గియు (నదీపక్షమున ఒక్క దేశమున నియతకాలమున కనబడియు, ఒక్కచోట అంతర్వాహినియై కనబడకయు నని యర్థము.) సపది= తోడనే, అనగా అభిముఖ్యప్రసంగము మాత్రముచేత, అఘం = పాపమును, అప్రతిఘం శమయతి = ఏవిధమైన యడ్డులేక శమింప జేయుచున్నావు. గూఢప్రవాహమైనను సరస్వతీనది అభిగమన స్మరణ కీర్తనాదుల పాపచయములను బోగొట్టు విధమున, నీవును నిన్నాశ్రయింపవలయునని సద్భావము గలవారికి భగవత్ప్రాప్తి విరోధభూతములగు సమస్తపాపములను నణగద్రొక్కెదవని తాత్పర్యము. ఉపమాలంకారము.

చ॥ పటుభవయుక్తి నీయెడ ను ♦ పాసనబుద్ధులు గల్గువారి కు
త్కట రసపూర్ణమై యొకటఁ ♦ గానక రాకయు నొక్కచోటఁ బ్ర
స్ఫుటముగఁ జూడఁబోలియు న ♦ మోఘపు భంగుల నాసరస్వతీ
తటిని క్రియన్ స్రవించి దురి ♦ తంబులు వేఁ దొలఁగింపవే దయా!

తా. మంచిపుట్టుకయొక్క ప్రభావముచే నిన్ను ఆశ్రయింప దలచు జీవులకు, నీవు సరస్వతీనదిని బోలి యుత్కటరసపూరితయగుచు, ఒక్కచో గనబడుచు, నొక్కచో గూఢముగాను ప్రవర్తించి, సమస్తపాపములను నశింపజేయుచున్నావు.

53. అవ. ఇంతవరకు మోక్షలాభము దయాయత్తమని తెలుపబడినది. "సమహాత్మా సుదుర్లభః" యన్నట్లు మోక్షైకపరాయణులు లోకములో దుర్లభులు ; విభూతికాములు అనగా బ్రహ్మాంతములైన మహదైశ్వర్య సిద్ధులు గోరువారు పెక్కండ్రు గలరు. వారివారి వాంఛానుగుణముగ ఫలప్రాప్తి గలుగజేయుటకు దయయే కారణమనియు, మహాఫలమగు మోక్షము నొసంగు భగవద్దయకు, అర్వాచీనములగు అర్థకామాదు లొసంగుటకు శక్తి కల్గుట కైముత్యన్యాయమున సిద్ధించుచున్నదని తెలుపుచున్నారు.

శ్లో॥ అపి కరుణే జనస్య తరుణేందు విభూషణతా
మపి కమలాసనత్వ మపి ధామ వృషాద్రిపతేః।
తరతమతావశేన తను తే నను తే వితతిః
పరహితవర్ష్మణా పరిపచేళిమ కేళిమతీ॥

టీ. హేకరుణే! పరహితవర్ష్మణా=ఎప్పుడు పరులకు మేలొడగూర్చునట్టి యాకారముతో, పరిపచేళిమ కేళిమతీ=పచనముచేయుటను (సకలసిద్ధుల సమకూర్చుట) లీలగాగల, తే వితతిః=నీయొక్క విస్తారము లేక వ్యాపారము, జనస్య = ఆశ్రయించిన నరునకు, తర

తమతావశేన = వారివారి కోరికల తారతమ్యము లెఱిగి దాని కను గుణముగా, లేక నీప్రసాదముయొక్క మహత్తును బట్టియు, మహ త్తరమును బట్టియు, మహత్తమమును బట్టియు, వరుసగా భవదా శ్రితునకు, తరుణేందు విభూషణతా మపి తను తే = బాలచంద్రుని శిరోభూషణముగా ధరించు భాగ్యమునుగల శివత్వమునైన నిచ్చు చున్నది. నీప్రసాదము మహత్తరమైనచో, కమలాసనత్వమపి తను తే = భగవన్నాభీపద్మంబున జనించు భాగ్యముగల బ్రహ్మత్వ సిద్ధియైనను నిచ్చుచున్నది. నీప్రసాదము మహత్తమమైనచో ఆశ్రి తునకు, వృషాద్రిపతేః ధామ అపి తను తే = పరమపదమైనను నిచ్చు చున్నది. కావున ఉత్తమాధమ పురుషార్థములు సర్వము నీప్రసా దముచేత సిద్ధించుచున్నవి. ఇక్కడ "తరుణేందువిభూషణతాం, కమలాసనత్వం వృషాద్రిపతేః ధామ" అను విశేష్యములు దుర్లభ దుర్లభతర దుర్లభతమత్వములను సూచించుచున్నవి కావున పరిక రాంకుర మలంకారము. శివత్వ బ్రహ్మత్వ వృషాద్రిపతిత్వము లనబడు మూడువిధములగు పదవులు ఒకదాని కొకటి యుత్కృష్టమై పరగునట్లు వర్ణించుటచే సారాలంకారము. అపిధామ వృషాద్రి పతేః అనుటచే అర్వాచీనపదవు లొసగుట యడుగవలయునా అని కైముత్యన్యాయమున సిద్ధించుటచేత, అలంకారము కావ్యార్థాప త్తియు నగును. ఇట్లు అనేకాలంకారముల సంకరము.

చ॥ పరహిత మెట్టుతానని కృ ♦ పా తలపోయుట నీకుఁ గేళియై
పరగుటఁ బ్రాణిజాతగుణ ♦ భంగులు వృత్తుల తారతమ్యముల్
వరమతిఁ జూచి వానికి శి ♦ వత్వమునైన విధిత్వమైన సు
స్థిరమగు శేషభూధర ప ♦ తిత్వమునైన నొసంగుచుండవే॥

తా. దయా! ఎప్పుడు పరులకు మేలుగూర్చుటయే లీలా వ్యాపారముగాగల నీవు నిన్నాశ్రయించినవారి గుణవృత్తులకును

వాంఛలకును తగినట్లుగా, రుద్రపదవియైనను, విరించి పదవియైనను, శ్రీనివాసాధిష్ఠితమగు వైకుంఠపదవియైనను నొసగుచున్నావు కదా.

54. అవ. ఇదివరలో దయను సరస్వతీనదితో నుపమింపబడినది. ఈరెండు క్రిందిపద్యములందు దయకును గంగకునుగల సామ్యమును వివరించి దయను రంజింపజేయుచున్నారు.

శ్లో॥ ధృతభువనా దయే త్రివిధ గత్యనుకూలతరా
వృషగిరినాథ పాదపరిరంభవతీ భవతీ।
అవిదిత వైభవాపి సురసింధురి వాతనుతే
సకృదవగాహమాన మపతాప మపాపమపి॥

టీ. హేదయే! ధృతభువనా = రక్షితలోకములు గలదానవై (గంగాపక్షమున ధరింపబడిన నీళ్లుగలదానవై), త్రివిధ గత్యనుకూలతరా = చేతనులు పొందదగిన ఐశ్వర్య కైవల్య భగవత్ప్రాప్తి రూపములగు మూడువిధగతులు పొందుటకు మిక్కిలి యనుకూలమైన ప్రవృత్తి కలదానవై; కోరికలకు తగినట్లు సర్వవిధఫలములు నీవే యిచ్చుచున్నావనుట (గంగాపక్షమున స్వర్గ మర్త్య పాతాళములందు ప్రవహించుటచే త్రిపథగా యని ప్రసిద్ధినొంది సర్వానుకూలముగా ప్రవహించునది యని యర్థము.) వృషగిరినాథ పాదపరిరంభవతీ = 'గూఢా వృషాచలపతేః పాదే' యన్నట్లు శ్రీనివాసుని పాదాశ్రయత్వమును గల్గి నమస్కరించువారికి ప్రకాశితవైభవయగుచు (గంగాపక్షమున విష్ణుపాదమున బుట్టుటచే హరిచరణములను ఆలింగించుకొనుచున్నట్లు చెప్పబడినది.) భవతీ = నీవు, సురసింధురివ = దేవనదియగు గంగవలె, అవిదితవైభవాపి = అప్రకాశమానమహిమను గలిగినను, అనగా ప్రపన్నజన సకలార్తిప్రశమనశక్తి నీకుకల్గుట మాకు తెలియకున్నను "హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః। అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః" అను

న్యాయముచొప్పున, సకలపాపతాపముల బోగొట్టుశక్తినికల్గి, సకృ
దపి అవగాహమానం = ఒక్కసారి నీయవలోకనమునకు పాత్రుడై
చేయబడిన జనుని(గంగాపక్షమున ఒక్కసారి స్నానముచేయువానిని)
అపతాపం = విగత తాపముగలవానిగాను, అపాపమపి = తాపత్ర
యాదులకు హేతువగు పాపసమూహములు తొలగునట్లుగాను, ఆత
నుతే = చేయుచున్నావు. అలంకారము శ్లేషతోఁగూడిన పూర్ణో
పమ.

చ॥ అనయము మూఁడుసద్గతుల♦యం దనుకూలపువృత్తిఁ దాల్చియం
జనగిరినాథ పాద జల♦ జంబుల సంగతి నిత్యధన్యవై
ఘనభువనోద్ధృతిన్ద్రిపథ ♦ గానదిఁ బోలి శ్రితాళి కేకము
జ్జనమునఁ దాపమున్ దురిత ♦ సంతతియున్ దొలగింపవే దయా!

తా. దయా! మూఁడువిధ గతులందును అనుకూల ప్రవృ
త్తిని కల్గి, భువనధారణముచే నొప్పుచు, శ్రీనివాసుని చరణారవిం
దములను నిరతము కౌఁగిలించుకొని ధన్యవై, గంగానదిచందమున
నీప్రభావము మాకు గానరాకున్నను, నీయం దభిముఖ భావముగల్గి
నిన్నాశ్రయించినవారియొక్క తాపములను పాపములను హరించు
చుందువుకదా? ఏమి నీమహిమ!

55. అవ. ఇట్లు కృపాగంగాసాధర్మ్యమును ఉపమచే ప్రద
ర్శించి, మఱియు రెంటికిగల పూర్ణసాదృశ్యమును, నిదర్శనాలంకా
రముచే వర్ణించుచున్నారు.

శ్లో॥ నిగమసమాశ్రితా నిఖిలలోక సమృద్ధికరీ
భజ ధఘకూలముద్రుజగతిః పరిత ప్తహితా।
ప్రకటిత హంస మత్స్య కమఠా ద్యవతారశతా
విబుధ సరిచ్ఛ్రియం వృషగిరీశ దయే వహసి॥

టీ. హే వృషగిరీశదయే! నిగమసమాశ్రితా = భగవత్సృష్ట్యాది సకలలీలలు దయాకార్యమగుటచేతను అవియెల్ల వేదములందు ప్రతిపాదింపబడుటచేతను నిగమములచే సేవింపబడుచు(గంగాపక్షమున "ఇమంమే గంగ" యని భగవత్పాదతీర్థ సంస్పర్శనమున పరమశుద్ధిని బొంది వేదప్రతిపాదితమైనదని భావము.) నిఖిలలోకసమృద్ధికరీ = సర్వలోకులకు "చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున। ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ" అన్నట్లు నాలుగువిధ అధికారములు గల సుకృతులకు వారివారి కోరికలొసంగి మనోరథపూరణము గావించుటచే సమృద్ధిని గల్గజేయుచు (గంగాపక్షమున లోకత్రయ నివాసులకు స్నానపానాదులచే నిహాపర లోక సౌఖ్యసమృద్ధిని గూర్చుచున్నదని భావము) భజదఘకూలముద్రుజగతిః = సేవించువారి పాపసముదాయములను నిర్మూలనమాచరించు గతిః విషయాకారముగలుగుచు, (గంగాపక్షమున సేవించువారి పాపముల హరించు కూలంకషమైన అనగా గట్లు తెగగోయునట్టి తీవ్రవేగము కలదని యర్థము.) పరితప్తహితా = సాంసారిక తాపత్రయములచే దహింపబడువారికి హితము కలుగజేయుదానవగుచు (గంగాపక్షమున శీతలమాధుర్యాది గుణముల నొప్పి, సేవించు జనుల తాపములెల్ల తొలగజేయునది యని యర్థము.) ప్రకటిత హంస మత్స్య కమఠా ద్యవతారశతా = ప్రకటింపబడిన హంస మత్స్యకూర్మా ద్యనేకములగు భగవదవతారములు గలిగియు, అనగా కేవలము దయతో భగవంతుడు లోకరక్షణార్థ మవతరించుచున్నాడని భావము. (గంగాపక్షమున హంస పక్షులు మీనములు తాబేళ్లు వీనిచే నిండియుండు అనేకములగు అవతారములు అనగా రేవులు గలిగినదని యర్థము.) ఇట్లు పైన వివరింపబడిన సాదృశ్యములచే దయా నీవు, విబుధసరిచ్ఛ్రియం వహాసి – సురనది సంపదను

లేక సొంపును దాల్చుచున్నావు. ఈ గంగాసదృశత్వ వర్ణనమున, దయను సేవించిన చాలుననియు, గంగానది దూరవర్తియగుట తత్తీరవాసులకే ప్రాప్యమనియు, భగవద్దయ సకలజనులకు సన్నిహితమై సులభాశ్రయమై యున్నదనియు ఫలించుచున్నది.

చ॥ బహువిధ వేదవాక్య నుత ♦ బంధుర వైభవమై, సమస్తలో
కహిత విధానసంఘటన ♦ కారిణివై, శ్రితపాపభిద్రసో
ద్వహయు ఝషాదిభాస్వదవ♦తార శతాఢ్యయునై సురాపగా
మహిమ వహించెదీవు గుణ♦మాన్య దయా! జగదేకవందితా!

తా. దయా! వేదములచే నుతింపబడిన వైభవమునుగలిగి, సకలలోక హితముగా ప్రవహించి, సంశ్రితుల పాపములు తొలగించి తాపములెల్లను బోగొట్టజాలి, ప్రదర్శితమగు హంస మీన కూర్మాద్యవతారములచే నొప్పుటచే నీవు చూడగా దేవనదియగు గంగ యొక్క పెంపును వహించుచుండుట మాకు స్పష్టముగా తెలియుచున్నది.

56. అవ. ఇట్లు పై రెండుశ్లోకముల దయకును సురనదికిని గల సాదృశ్యమును వివరించి, యాశ్రయింపతగినది భగవద్దయయే కాని యితరుల దయకాదని తెలుపుటకై శ్రీనివాసుని దయకును తదితరములకును భేదమును క్రిందిశ్లోకమున తెలుపుచున్నారు.

శ్లో॥ జగతి మితంపచా త్వదితరాతు దయే తరళా
ఫలనియమోజ్ఝితా భవతి సంతపనాయ పునః।
త్వమిహ నిరంకుశప్రశకనాది విభూతమతీ
వితరసి దేహినాం నిరవధిం వృషశైలనిధిం॥

టీ. హేదయే=ఓ శ్రీనివాసునిదయా! జగతి త్వదితరాతు= లోకములో నీకంటె వేరైన క్షుద్రదేవతాంతరముల దయయు,

సామాన్య నరపతుల దయయు, మితంపచా = మిత ఫలదాయక ములు, మితమైనశక్తులు గలుగుటచే వారిచ్చు ఫలములు స్వల్పము; అదియునుగాక, తరళా=చంచలములగుటచే అస్థిరములు, అందుచే ఫలనియమోజ్ఝితా = నిష్కర్షగా ఫలమునిచ్చి తీరవలయుననిలేదు. స్వల్పాస్థిరఫలము లివ్వవచ్చును, ఇవ్వకయు నుండవచ్చును, ఒకవేళ యిచ్చినదానినీ తిరిగి పుచ్చుకొనవచ్చును ; ప్రభువున కనుగ్రహము తప్పినను లేక గుణము మారిపోయినను నిచ్చిన వరమును గైకొన వచ్చును; అందుచే, పున్యః సంతపనాయ భవతి = అంత్యములో దుఃఖమును గావించుటచే సంతాపమును గలిగించును. అయితే, నిరంకుశ ప్రశకనాది విభూతిమతీ=అడ్డులేని ప్రకృష్టమగు శక్తిమొద లగు గుణముల వైభవముగల, త్వం = నీవు, సాక్షాత్ శ్రీనివాసు నకు సంబంధించి గుణసార్వభౌమిమై ఆశ్రితపక్షపాతము గలుగునట్లు ప్రఖ్యాతిగాంచిన నీవు, ఇహ = ఈ సంసారమండలమునందే, దేహి నాం = దేహవంతులకు, నరులకే కాదు ఆశ్రయించిన సర్వజీవుల కనుట, నిరవధిం=అవధిలేని యెంతఅనుభవించినను క్షయప్రసంగము లేని శాశ్వతమైన, వృషశైలనిధిం = వేంకటాద్రిపై దాచబడిన హిరణ్యనిధియగు శ్రీనివాసుని, వితరసి = దానముచేయుచున్నావు అనగా అతనిని పొంది నిత్యకైంకర్యరూపమగు రసమును అనుభవింప జేయుచున్నావు. భగవద్దయ శ్రీనివాసనిధిని ఆశ్రితులకొసంగుటను, నిరంకుశ ప్రశకనాది విభూతిమతీ యని సమర్థించుటచే కావ్యలింగ మలంకారము. భగవద్దయను తదితరములతో బోల్చి, ఉపమేయ మగు శ్రీనివాసదయను అధికముగా వర్ణించుటచే, అలంకారము వ్యతిరేకము.

చ॥ ఇలను ద్వదన్యదైవతము ♦ లిచ్చుఫలంబులు గొద్ది, నశ్వరం
బులు, చపలంబులౌటఁదుది♦బొందఁగఁ జేయువిషాదమున్ దయా

యలఘుగుణంబులం దధిక ♦ వైయసమాన విభూతినొప్పు నీ
వెలమి వృషాచలేశ నిధి ♦ నియ్యవె మాకిట శాశ్వతంబుగన్॥

తా. దయా! శ్రీనివాసునకు సంబంధించిన నీకును తదితరులగు సామాన్యులదయకును యేమాత్రము సాదృశ్యము లేదు. ఇతరుల ప్రసాదముచే గలుగు ఫలములు నశ్వరములు, అంత్యమున దుఃఖమునే కలుగచేయుచున్నవి. ఫలనియమమును లేదు. నీవన్నో శాశ్వతమగు శ్రీనివాసు డను గొప్ప నిధిని ఆశ్రితులకు నిచ్చుచున్నావు. అందుచే నీవే యాశ్రయింప తగినదానవు. మేమే యజ్ఞులమై "నారాయణేతిష్ఠతి యం కంచి త్పురుషాధమం కతిపయగ్రామేశ మల్పార్థదం సేవాయై మృగయామహే నరమహో మూఢా వరాకా వయం" యని ముకుందమాలాకారులు శ్రీకులశేఖరుల వారు చెప్పినట్లు, స్వల్పఫలప్రదాతలగు క్షుద్రనరపతులను ఆశ్రయించెదము. మాదే తెలివితక్కువయని యర్థము.

57. అవ. దయా! నిన్నాశ్రయించు బుద్ధి మాకు గలిగినంతటనే నీవు మమ్ము రక్షించెదవని మాకు దృఢమగు నమ్మకముగలదు. నీయం దెట్టిసందేహము లేదని, కైముతికన్యాయమున తెలుపుచున్నారు.

శ్లో॥ సకరుణ లౌకిక ప్రభుపరిగ్రహా నిగ్రహా యో
ర్నియతి ముపాధిచక్ర పరివృత్తి పరంపరయా।
వృషభమహీధరేశ కరుణే వితరంగయతాం
శ్రితమితసంపది త్వయి కథం భవితా విశయః॥

టీ. హే వృషభమహీధరేశ కరుణే! ఓ శేషాద్రినాథుని దయా! ఉపాధిచక్ర పరివృత్తి పరంపరయా = ఉపాధిః ప్రయోజకము. అనుగ్రహామునకు ఉపాధి ఆనుకూల్యలేశము కలుగుట,

నిగ్రహమునకు ఉపాధి ప్రాతికూల్యాధిక్యము లేక మహాపరాధము. ఈఉపాధి, చక్రమువలె మాటిమాటికి ప్రవర్తించుటచే, సకరుణస్య = దయాళువగు, లౌకికప్రభోః = సామాన్యనరపతియొక్క, పరిగ్రహ నిగ్రహయోః = అంగీకార దండనలయొక్క, నియతిం = నియతిని లేక నియమమును, అనగా ఆనుకూల్యలేశము కల్గినప్పుడు అనుగ్రహించుటయు, ఇంచుకైన ఆనుకూల్యప్రవర్తిలేక ప్రాతికూల్య బాహుళ్యము కలిగినపుడు దండించుటయు అనునట్టి సాధారణ నరదేవునియొక్క నియతిని, వితరంగయతాం = ప్రత్యక్షముగాజూచుటచే నిశ్చయించునట్టి మాకు; స్వల్పానుకూల్య దర్శనమున అనుగ్రహించునట్లు స్వల్పాపరాధమునకు దండనము విధించెడు రాజు దుస్సేవ్యు డగును. సకరుణ లౌకికప్రభువు గావున ఆనుకూల్య లేశవర్జితులగు మహాపరాధులనే దండించుచున్నాడు. అపరాధియైనను ఇంచుక అనుకూలప్రవర్తన ముండిన రక్షించుటను ప్రత్యక్షముగా గనుచున్న మాకు, శ్రుతిమితసంపది త్వయి=శ్రుతులచే ప్రతిపాదింపబడు సకలగుణసంపదచే నొప్పుచున్న సాక్షాత్ శ్రీనివాసుని సంబంధముగల నీయందు; విశయః=సంశయము, అభిముఖ్యముచే నీవు మమ్ము రక్షించెదవో రక్షింపవో యని సందేహము ; కథంభవితా = ఎట్లు కలుగును. సందేహము కలుగదనుట. సామాన్య క్షుద్రప్రభువులు అపరాధులం దానుకూల్యలేశము కల్గినచో వారిని "సుతులనేరమిఁ దండ్రులు ద్రోచిపుచ్చరే, నేరము సేయువారి ధరణీపతు లొక్కొక మాటు గావరే" యని కాళియుని భార్యలు శ్రీకృష్ణస్వామితో విన్నవించినట్లు, అనుగ్రహమునకు బాత్రులుగా జేయుచుండ, సర్వోత్తుంగుడగు శ్రీనివాసుని యందు బుట్టిన గుణాగ్రగణ్యయగు నీయందు మాకనుమాన మొకింతయు లేదని భావము. అలంకారము కావ్యార్థాపత్తి. "త్వయి

శ్రితమితసంపది " అని దయాప్రభావము నుడివి, యనుమానము లేకుండుటను సమర్థించుటచే అలంకారము కావ్యలింగము.

చ॥ సదయవిభుం డొకండు పటు • శాత్రవులై చను నిగ్రహార్హులం
గుదురుగ బ్రోచుచుండు ననుకూలత యించుక కల్గెనేని, ని
య్యది విదితంబు మాకగుట•నాగమ సంస్తుత వత్సలత్వ సం
పదఁ గడునొప్పునీయెడఁ గృ•పా యనుమాన మదేల కల్గెడుం॥

తా॥ దయా! దయాళువగు సామాన్యరా జొకడు నిగ్రహమునకు బాత్రులగువారియం దొకింత యనుకూలప్రవృత్తిని జూచి యనుగ్రహమునే చేయుచుండుటను మేము చూచిచూచి, నిగమ సన్నుత వైభవము గలిగి, యాశ్రిత వత్సలత్వాది గుణములచే ప్రఖ్యాతి జెందిన నీయందు మా కెంతమాత్రము సందేహము లేదు. నీవు మమ్ము ఆభిముఖ్యాది సుగుణలేశమును జూచి తప్పక రక్షించెదవు.

58. అవ. నీయం దెక్కువ దృఢవిశ్వాసము గల కొందఱు సుకృతులు మేఘజలములందు చాతకపక్షులవలె, నెక్కువ సంశ్రయత్వము ప్రకటించుచున్నారని వివరించుచున్నారు.

శ్లో॥ వృషగిరి కృష్ణమేఘజనితాం జనితాపహారాం
త్వదభిమతిం సువృష్టి ముపజీవ్య నివృత్తతృషః।
బహుషు జడాశయేషు బహుమాన మపోహ్య దయే
నజహతి సత్పథం జగతి చాతకవ త్సుకృతినః॥

టీ. హేదయే! వృషగిరి కృష్ణమేఘజనితాం = వృషాద్రిపై నున్న కృష్ణుడను మేఘమున బుట్టినదానవును (చాతకపక్షమున కృష్ణమేఘము నీలమేఘమున జనించినదని యర్థము) జనితాపహారాం - సంసారతాపమును హరించుదానవునగు (చాతకపక్షమున సూర్యుని

వేడిమిచే గల్గు తాపమును హరించు మేఘమని భావము.) త్వదభి మతిం సువృష్టిం = నీయొక్క అభిమానమును, అనగా వీడు నావా డని ప్రేమించుటయే సువృష్టి దానిచే, ఉపజీవ్య = శోభనామృత సంజీవిని బోలు నీయభిమానమునే రక్షణాధారముగా దలచి, (చాతకపక్షమున మేఘోదకమును ద్రాగి,) నివృత్తతృషః = "పరమాత్మని యోరక్తో విరక్తోఽపరమాత్మని" యను చొప్పున ఇతర ఐహికాముష్మిక సుఖములందు విరక్తులై వానినాదరింపక (చాతకపక్షమున దాహశాంతిని పొంది) అందుచేతనే, బహుషు జడాశయేషు=జడమతులును "క్షుద్రా రుద్ర పితామహాః ప్రభృతయః కీటాస్సమస్తాస్సురా" యన్నట్లు భగవద్విభూతిలో కీటకప్రాయులగు నితరదేవతలందు (చాతకపక్షమున అనేకములైన వాపీతటాకాది జలాశయములం దని యర్థము) బహుమానం అపోహ్య = సమాశ్రయణబుద్ధిని వర్జించి అనగా వానిని సేవింపనొల్లక (చాతకపక్షమున అనేకములైన వాపీతటాకాది జలాశయములందు ప్రీతిలేక, చాతకపక్షులు ఆకాశమునందుండి ఎప్పుడు మేఘమువర్షించునని యెదురుచూచునుగాని భూమిపైబడిన నీటిని గ్రహింపనొల్లవని యర్థము) కృతినః = సుకృతవంతులు లేక భాగ్యశాలురు కొందఱు, జగతి = పృథ్వియందు, చాతకవత్ = వానకోయిలవలె "ప్రపన్న శ్చాతకో యద్వత్" అనువిధమున, సత్పథం = సతాంపథం సత్పురుషులమార్గమును, అనగా భగవద్భాగవతాచార్య కైంకర్యరూపమగు సన్మార్గస్థితిని (చాతకపక్షమున, సత్పథం = నక్షత్రములమార్గమును అనగా ఆకాశమును) నజహాతి = విడువకుందురు. అలంకారముపమ. నీలమేఘము నిదాఘతాపమునుమాత్రము తొలగించును, అయితే కృష్ణమేఘము ఆధ్యాత్మికాదితాపములు మూడింటిని హరించునని విశేషోక్తి.

చ॥ చెలువగు కృష్ణమేఘమున • శేషగిరిం బ్రభవించి దేహసం
తుల భవతాపముల్ దొలఁగఁ • ద్రోయునినుం దయనమ్మినీసువృ
ష్టులెగొని దానఁ దృప్తులయి। స్రవతులొండ్లు జడాశయంబులం
దలపక చాతకంబువలె • ధన్యతఁ గాంతురు సత్పథస్థితిన్॥

తా. దయా! శేషగిరియందు కృష్ణమేఘమున జన్మించి, సంసారుల తాపములెల్ల తొలగజేయు నీయభిమానమనే వర్షమునే గొప్పగా పాటించి, దానిచేతనే తృప్తులగుచు, నితర జడాశయము లందు సన్మానబుద్ధిలేక, కొందఱు మహాత్ములు జగమునందు చాతక పక్షులవలె సత్పథముననే నిల్చి ధన్యులగుచున్నారు. ప్రపన్నులగు వారు, వానకోయిలలు మేఘవర్షమునే నమ్మినట్లు భగవంతుని దయైకశరణ్యులగుచున్నారని భావము.

59. అవ. భగవద్దయైకశరణ్యత్వము, చేతనులకు హితతమ మగుట, స్వకపోలకల్పితము కాదనియు, పూర్వాచార్యులెల్ల తమ గ్రంథములం దావిశేషమును మిక్కిలిగా బ్రకటించియున్నా రనియు నుడువుచున్నారు.

శ్లో॥ త్వదుదయతూలికాభి రమునా వృషశైలజుషా
స్థిరతరశిల్పినైవ పరికల్పిత చిత్రధియః।
యతిపతి యామున ప్రభృతయః ప్రథయంతి దయే!
జగతి హితం న న స్త్వయి భరన్యసనా దధికం॥

టీ. హేదయే; అమునా వృషశైలజుషా=ఈసకలజనులచే పరిదృశ్యమానుడగు వేంకటాద్రివాసుడగు శ్రీనివాసుడైన, స్థిరతర శిల్పినాఏవ = చరాచరవస్తుజాతములను నిర్మించిన శిల్పకారునిచేత, త్వదుదయ తూలికాభిః = నీ ఉదయము లేక ఉన్మేషము లేక విజృంభణమను, తూలికాభిః = కుంచెచేత (Brush) కూర్చికచేత, పరి

కల్పిత చిత్రధియః = సృష్టింపబడిన విచిత్రమగు అనగా లోకాతీత మగు అద్భుత ప్రజ్ఞగల (చిత్రాం త్రాయకత్వా చ్చిత్రిత్వం=ఆత్మరక్షణముచేయునట్టివారనియు తెలుపవచ్చును.)యతిపతి యామునప్ర ప్రభృతయః=ఉడయవర్లు యామునాచార్యులు నాథమునులుమున్నగు నీకభిమతులగు పూర్వాచార్యు లందఱును, జగతి=లోకమునందు, త్వయి = సర్వనిర్వాహకశక్తిగల నీయందు, భరన్యసనాత్ = మాయొక్క రక్షణభరమును సమర్పించుటకంటె, హితం = హిత మగు వేఱొక కృత్యముగలదని, నః = మాకు, నప్రథయంతి ప్రకటింపలేదు. అనగా అకించనులగు మాకునీవే పరాయణమని బోధించి యున్నారని యర్థము. అందుచే నీవే అనన్యగతికులైన మాకు శరణమని ఫలితార్థము.

చ॥ అతులిత చిత్రకారుఁడు వృ ♦ షాద్రినివాసకుఁ డీవు తూలికా
గతి నుదయించి తోడుపడఁ ♦ గా రచియించిన చిత్రబుద్ధు లా
యతిపతి యామునాదులు ద ♦ యా! భరమంతయు నీయధీనమై
హితమతి నొప్పగించుటకు ♦ నెక్కుడు లేదని మాకుఁ దెల్పరే॥

తా. దయా! శేషగిరిపతియను చిత్రసృష్టికర్త శిల్పియై వెలిగి, నీవును కూర్చికవలె నొప్పి తోడుపడగా, లోకహితార్థము అవతరింపజేసిన రామానుజ యామునాచార్య ప్రభృతులందఱు నీయందే మారక్షణాభార మంతయు సమర్పించుటకంటెమాకు వేఱు హితమగు కృత్యము లేదని తెల్పియున్నారు కావున నీవే యకించనులగు మాకు శరణమగుచున్నావు.

60. అవ. ఇట్లు కృపణజన కల్పలతికయగు భగవద్దయ యందు న్యస్తభరులైన యాచార్యులవారు, తమకు సంసారహేతుభూతమగు పాపచయములను దొలగించి యుజ్జీవింప జేయవలయు

నని రమ్యపదగుంభనలచే దయను సంబోధించి, యీపద్యమున స్వాభీష్టమును ప్రార్థించుచున్నారు.

శ్లో॥ మృదుహృదయే! దయే! మృదితకామహితే! మహితే
ధృతవిబుధే! బుధేషు వితతాత్మధురే! మధురే!
వృషగిరిసార్వభౌమదయితే! మయి తే మహతీం
భవుకనిధే! నిధేహి భవమూలహరాం లహరీం॥

టీ. హేమృదుహృదయే! దయే=పరదుఃఖమును చూచి సహించలేని స్వభావముగల దయా; మృదితకామహితే = నిరస్తకాములగువారికి మేలుగూర్చుదానా (అందఱికి హితము చేయుదానవేయైనను త్యక్తసర్వకాములయెడ విశేషాదరము గలదానవని యర్థము.) మహితే = సర్వభగవద్గుణములకంటె నధికురాలని కొనియాడబడుదానా, ధృతవిబుధే = నిన్నాశ్రయించిన జ్ఞానుల యోగక్షేమముల నరయుదానా, బుధేషు వితత ఆత్మధురే= దేశికులద్వారా ప్రకాశితమగు స్వప్రభావముగలదానా, వృషగిరిసార్వభౌమ దయితే= శ్రీనివాసప్రభువుచిత్తమున కింపైనదానా, భవుకనిధే = భాగ్యములకు నిధియై పరగుదానా, మయి=నాయందు, తే = నీయొక్క, మహతీం = గొప్పదగు (అనగా నాపాపములను హరింపశక్తిగల,) భవమూలహరాం లహరీం = సంసారమునకు మూలమైన అనాదికాలప్రవృత్తానంత పాపసంచయములను సమూలముగా హరింపశక్తిగల నీయొక్క తీవ్రవేగముగల ప్రవాహమును, నిధేహి = ప్రసరింపజేయుము. న్యస్తభరుండైన నాయొక్క సంసారవృక్షమునకు మూలమగు సమస్తపాపములు తెగునట్లు ప్రవహించి నన్నుజ్జీవింప చేయుమని భావము.

చ॥ బుధజనవంద్య వీవ, కదు ♦ బుణ్యావు, నీయెద కోమలంబు నీ
విధము శ్రుతుల్ వచించు, గుణ ♦ విశ్రుత వీవ యకించనాళికి

నిథివి, భరింతు వీవ సుమ ♦ నీషుల, శేషగిరీశమాన్య నీ
మధురధురీణ హరింపగదె ♦ మద్భవహేతుక పాపముల్ దయా!

తా. దయా! నీమనసు మిక్కిలి కోమలమైనది. నీవు గుణేశ్వరియని పొగడొందినదానవు. అకించనుల భరించుదానవు. దేశికులద్వారా ప్రకాశమానమగు వైభవముగలదానవు. శ్రీనివాసున కెక్కుడు గూర్చుదానవు. భాగ్యములకు నిక్కువు. నాభవమునకు హేతుభూతమగు సర్వపాపములు హరింపగల వేగముతో నీప్రవాహమును నాపై నిగుడజేయుము.

61. అవ. సంసారమునకు మూలమైన అవిద్యాకర్మవాసనలను సమూలముగా దొలగింప దయకు శక్తికలదని నిరూపించుచున్నారు.

శ్లో॥ అకూపారై రేకోదకసమయ వైతండికజవై
రనిర్వాప్యాం క్షిప్రం శమయితు మవిద్యాఖ్య బడబాం ।
కృపే త్వం తత్తాదృ క్ప్రథిమ వృషపృథ్వీధరపతి
స్వరూపద్వైగుణ్యాం ద్విగుణనిజబిందుః ప్రభవసి॥

టీ. హేకృపే! దయా! ఏకోదకసమయ వైతండికజవైః= ప్రళయసమయమున (సముద్రములన్నియు)పొంగి యొండొంటు గలిసి ప్రవృద్ధవేగముగల, అకూపారైః=సముద్రములచేతను, అనిర్వాప్యాం = ఆర్పజాలని, అవిద్యాఖ్య బడబాం = అవిద్య అజ్ఞానములేక జన్మకు హేతువగు అనాదికర్మవాసనారూపమగుఅవిద్యయనెడు బడబాగ్నిని (ఈబడబాగ్ని సముద్రపు చల్లనినీటనుండియు నాఱక, గణగణ యని మండుచు, తుదకు తానాశ్రయించిన జలధినీళ్లను రూపుమాపుచుండునట్లు, అవిద్యనుగలవారు ఆత్మనాశము బొందుదురు కావున దానిని బడబానలమునకు సదృశముగా రూపింపబడినది) అట్టి అవిద్యా బాడబమును, క్షపయితుం = శమింపజేయుటకు, త్వం = నీవు, క్షిప్రం = త్వరగా నీవు సంకల్పించినమాత్ర

మున ననుట, తత్తాదృ క్ప్రిథిమ వృషపృథ్వీధరపతి = అప్రమేయ స్వరూపముగల శ్రీనివాసునియొక్క, స్వరూపద్వైగుణ్యాం ద్విగుణ నిజబిందుః = స్వరూపమునకు నాల్గుమడుగులు గొప్పదగు ప్రమాణ ముగల నీవర్ష బిందువులతో, పరిభవసి=పోడముచున్నావు. అనగా చతుస్సాగర జలవేగముచేతనైనను శమింపనట్టి బాడబాగ్నిని పుష్కలావర్తకాది మేఘవర్షబిందువులు క్షణకాలమున నార్పునట్లు, అనాది కాలప్రవృత్తమగు అనంతపాపసంచయములను అవిద్యను క్షణకాలమున నశింపజేయుటకు దయకు శక్తికలదని తాత్పర్యము. ఇక్కడ అవాఙ్మానసగోచరమగు ప్రభావముగల భగవత్స్వరూపమను ఆధార వస్తువునకు, ఆధేయమైన దయయొక్క స్వరూపమును మిక్కిలిగా వర్ణించుటచే, అధికాలంకారము.

మ॥ చతురంభోనిధు లొక్కటై కలిసి యా • శ్చర్యంబుగా రేగి యు
ద్ధతవేగంబున నార్పజాలని యవి • ద్యాబాడబాగ్నిన్ దయా
ద్రుతమే యార్పుదు నీవు బిందువులఁ దో • డ్తో శేషశైలేశ్వరో
న్నత నిర్ణోభ్యమహాస్వరూపమునకున్ • నాల్గంతలై తోఁచుచున్॥

తా. కృపా! ప్రళయమున నాల్గుసముద్రములు రేగి యొక్కటియై కూడిన వేగముచేతనైనను, ఆఱనట్టి యవిద్యయను బడబానలమును, నీవు శమించుటకై సర్వోత్తుంగస్వరూపుడగు శేషగిరినాథుని స్వరూపమునకు నాల్గంతలగు ప్రమాణముగల నీయొక్క వర్ష బిందువులచే బోడముచుందువుకదా. నీకట్టి శక్తియుండగా, నా జన్మహేతువగు కర్మవాసనామయమైన యవిద్యను తొలగింపవేల. అవిద్యానిరసనమున నన్ను సంసారబంధమునుండి విడిపింపుమని భావము.

62. అవ. అవిద్యను నిర్మూలనముచేయు నీమహిమ నెఱిగిన సారవిదులగు మహాత్ములు గొందఱు, నిన్నే శరణమని యాశ్ర

యించి, నీయనుగ్రహమున తమజీవితకాలమును నిర్బాధముగా గడ పెదరని నుడువుచున్నారు.

శ్లో॥ వివిత్సా వేతాళీ విగమపరిశుద్ధేపి హృదయే
పటుప్రత్యాహార ప్రభృతి పుటపాక ప్రచకితాః ।
నమంత స్త్వాం నారాయణశిఖరి కూటస్థకరుణే
నిరుద్ధ త్వద్ద్రోహా నృపతిసుతనీతిం న జహతి॥

టీ. నారాయణశిఖరి కూటస్థ కరుణే! = వేంకటాద్రియొక్క, కూట = శృంగమున, స్థ = నిల్చిన శ్రీనివాసుని కరుణా ! లేక "కూటస్థో ఽక్షర ఉచ్యతే" సర్వమున కాదియగు పురుషోత్తము డైన శ్రియఃపతి కరుణా, వివిత్సా = ద్రవ్యేచ్ఛయను, వేతాళీ = పిశాచముచే, విగమ=విడువబడిన,పరిశుద్ధే హృదయేపి=నిర్మలమగు చిత్తములుగల్గినను (ధనేచ్ఛ నరుని వెట్టిగావించి యిందునందు తిరుగు నట్లు చేయును కావున పిశాచము లేక దయ్యమనబడినది.) నిష్కామ కర్మయోగసాధనమునకు విరోధమగు "జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదం" అన్నట్లు ధనాదులందువిడుపుగల కొందఱు మహాత్ములు, పటుప్రత్యాహార ప్రభృతి = పటుదుస్సాధ్యమగు విషయాదులందుండి యింద్రియములను మనస్సును నివర్తింపచేయుట మొదలగు, పుటపాకప్రచకితాః = పుటపాకమువంటి అంతర్దాహక ముచే క్లేశకరములగు కృత్యములవలన భయపడుచు, అనగా ప్రత్యా హారప్రముఖ క్రియలయం దసమర్థులై యీనుట"అశక్తోఽస్మి దుస్సా ధనిష్ఠా సహస్రే ష్వహం కర్మబోధా ద్యుపాయాంతరేషు। అతస్త్వ త్కీనే సురద్రోరనూనే పదే లోకమాతః ప్రపద్యే తిభీతిః" అనువిధ మున, త్వాం నమంతః = నీకు మ్రొక్కుచున్నవారగుచు, నిరుద్ధ త్వద్ద్రోహాః = నీయందు ద్రోహబుద్ధి లేనివారై అనగా నీవేతప్ప నితఃపరం బెఱుగక నీవే రక్షించెదవని దృఢాశయము గలవారై,

నృపతిసుతనీతిం నజహాతి = గొప్పతప్పు చేసిన రాజకుమారునకు స్వల్పదండన విధించు న్యాయమును లేక నియతిని విడువకుందురు. అనగా భగవద్దయను సమాశ్రయించిన తర్వాత వారికి ప్రాతికూల్య వర్జనాదు లన్నియు దయాయత్తమనియు ఒకవేళ ప్రారబ్ధముచే పాపములు సంభవించునను వారికి దండన స్వల్పమనియు భావము.

మ॥ ధనలాభేచ్ఛ పిశాచవర్జిత విశు ♦ ద్ధంబైన చిత్తంబు గ
ల్గినసాధుల్ భువిఁగొంద ఱింద్రియములన్ ♦ గెల్వంగ రాకున్న భీ
తిని నిన్నే శరణంబుగాఁ దలఁచుచున్ ♦ దేవీ! భవత్సన్మతిన్
గని భూపాత్మజనీతిఁ గాంతురు మహా ♦ నందంబు నిష్పాపులై॥

తా. ధనార్జనమందు కోరిక మొదలగు కామములన్నియు వర్జించి శుద్ధాత్ములై భగవదుపాసనాపరులగు కొందరు విషయాదు లందుండి చిత్తేంద్రియములను మఱల్చుట మొదలగు మిక్కిలి క్లేశమును గూర్చు యోగక్రియలం దశక్తులై, దయా! నిన్నే శరణమని భావించి నీయాశ్రియముతప్ప నొండెఱుంగక, నీసమాశ్రయణానంతర కాలమంతయు, బాధలేక నెమ్మదితో గడపుచుందురు. వారి వర్తన మంతయు నీయధీనమై యున్నదని భావము.

63. అవ. భవదాశ్రితులకు దురితప్రసక్తి యొకవేళ గల్గినను, నీచే ఆశ్రితపరతంత్రుడుగా చేయబడుచున్న శ్రీనివాసుడు వారివిషయమున దండధరుడు కానేరడని తెలుపుచున్నారు.

శ్లో॥ అనన్యాధీన స్సన్ భవతి పరతంత్రః ప్రణమతాం
దయే సర్వద్రష్టా గణయతి న తేషా మపకృతిం।
పతి స్త్వత్పారార్థ్యం ప్రథయతి వృషక్ష్మాధరపతిః
వ్యవస్థాం వైయాత్యా దితి విఘటయంతీ విహరసి॥

టీ. దయే! సర్వద్రష్టా = సర్వవిదుండగు, వృషక్ష్మాధర పతిః = శేషాచలేశుడు, అనన్యాధీనస్సన్ = అన్యులకెన్నడు అధీన

మైన వ్యాపారముగలవాడు కాకుండినను "అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే" "ప్రభు ర్భర్తా గతి స్సాక్షీ" "మత్తః పరతరం నాన్య త్కించిద స్తి ధనంజయ" అనియు "నతస్యేశే కశ్చన" యనియు నిరంకుశ స్వాతంత్ర్యముగల పరమాత్ముఁడు, ప్రణమతాం = నమస్కరించువారికి, పరతంత్రో భవతి=విధేయుఁడై అనగా అధీనవృత్తన కలవాఁడగుచున్నాఁడు. తేషాం అపకృతిం నగణయతి = వారి పాపములను లెక్కచేయఁడు "నస్మర త్యపకారాణాం శత మప్యాత్మవత్తయా" యను శ్రీమద్రామాయణ వాక్యము ఇందులకు ప్రమాణము. దయావిధేయుఁడై యాశ్రితుల దోష మెఱుంగని భగవంతుఁడు వారి నెట్లు శిక్షింపగలఁడని భావము. ఇట్లు శ్రీనివాసుఁడు సమాశ్రితుల కధీనఁడగుచు వారిదోషముల నెంతమాత్రముగణింపకుండుటచేత, పతిః=ప్రభువు, త్వత్పారార్థ్యంప్రథయతి= నీకు పరాధీనుఁడగుటను సర్వజనులకు ప్రకటించెదును, ఇతి = ఈప్రకారము, వ్యవస్థాం=నియమమును అనగా ప్రభువుయొక్క నిరంకుశ స్వాతంత్రత్వమును దోషజ్ఞుఁడగుటయును అను రెండు నియమములను, వైయాత్యాత్ = బలాత్కరించి, విఘటయ స్తీ విహరసి = పోఁగొట్టి స్వాధీనభర్తృకయను నాయిక ననుసరించిన లీలతో విహరించుచున్నావు. ఆహా; ఏమి నీయాశ్రితులయెడ పక్షపాతము. ఏమి నీపతివాల్లభ్యము. అతని స్వభావమును బలాత్కారముగా మార్చెదవుకదా యని భావము.

మ॥ సకలజ్ఞుండు నిరంకుశప్రభుఁడు శే ♦ షక్ష్మాధరేశుండు సే
వకవశ్యుండయి తత్కృతాపకృతులన్ ♦ బాటింప కొక్కింతయుఁ
బ్రకటించుఁ భవదీయ నిత్యవశతన్ ♦ భావింప స్వాధీనభ
ర్తృకలీలన్ విహరించునిన్ విభుఁడుదా ♦ నెమ్మాడ్కి మీఱుఁ దయా!

తా. దయా! శేషాచలనాథుడు సర్వజ్ఞ సర్వస్వాతంత్ర్య ప్రముఖగుణములు గలవాడైనను నీమహిమచే తనస్వాతంత్ర్యమును గోల్పోవుచు ప్రణామపరులకు వశ్యుడై వారి పాపకృత్యములను కొంచెమైన చూడకున్నాడు. స్వాధీనమగు భర్తనుగల నాయికను బోలి విహరించునీయెడ, సర్వకాల సర్వావస్థలయందు, నాథుడువిధేయుడై వర్తించి నీయాజ్ఞను మీఱకుండుటను సర్వజనులకు వ్యక్తముగా గనపఱచుచున్నాడు. ఏమి నీమహిమ! నాథుని వశీకరించు గుణసౌభాగ్యసంపత్తి నీకే కలదు. నీకు వశ్యుడగుటయే కాక నీయాశ్రితులకును నాథుని వశ్యునిగా జేసి వారిపాపములను స్మరింపకుండునట్లు చేసెదవని భావము.

64. అవ. ఆశ్రితపరతంత్రుడై వారితప్పులెఱుంగని స్వామి యొక్కొక్కప్పుడు దండనపరుండైనను, ఆదండనవిధి యాశ్రితుల విరోధులను నిరసించుటచే, రక్షణరూపమై పరిణమించుచున్నదని సదృష్టాంతముగా వివరించుచున్నారు.

శ్లో॥ అపాంపత్యుశ్శత్రూన్ నసహనముసే ర్ధర్మనిగళం
కృపే కాకస్యైకం హితమతి హినస్తిస్మ నయనం।
విలీనస్వాతంత్ర్యో వృషగిరిపతి స్త్వద్విహృతిభి
ర్దిశ త్యేవం దేవో జనితసుగతిం దండనగతిం॥

టీ. హేకృపే! దేవః వృషగిరిపతిః = లీలాపరవశత్వమున శ్రీవైకుంఠమును త్యజించివృషగిరిపై స్వయంవ్యక్తుడైనశ్రీనివాసుడు; త్వద్విహృతిభిః = పరహితమునకే పాటుపడు స్వభావముగల నీయొక్క కరణకళేబరదాన శాస్త్రప్రదానాది అవాఙ్మానసగోచరములగువిహారములచే, విలీనస్వాతంత్ర్యస్సన్ = తన స్వతంత్రితను లేక స్వేచ్ఛాప్రవర్తనను పూర్తిగా వదలినవాడై, స్వాతంత్ర్య గంధలేశములేనివాడై, అపాంపత్యుః = సముద్రరాజుయొక్క, శత్రూన్ =

వులను, హితమితిహీనస్తిస్మ = సముద్రునికి హితమని తలచియే హింసించెను. సుగ్రీవసైన్యమును నడపించుటకు తెరువియ్యని సాగరునిపై కోపించి శ్రీరాముడు "చాప మానయ సౌమిత్రే శరాంశ్చాశీవిషోపమాన్ । సాగరం శోషయిష్యామి పద్భ్యాం యాంతు ప్లవంగమాః॥" అని బ్రహ్మాస్త్రము నెత్తగా, చేతులు మోడ్చి యాశ్రయించిన సముద్రునిపై కరుణించి, యాసముద్రునకు శత్రువులై పాపాత్ములగుటచే వారి స్పర్శనముకూడ సహింప నలవికాని క్రూరతిములగు. ఉత్తరసాగరాంతర్వర్తులగు రాక్షసులపై దండింపనెత్తిన బ్రహ్మాస్త్రమును ప్రయోగించి వారి హననముచే సముద్రరాజునకు మేలు కలుగజేసెను. అసహనమునేః = పరశురామునియొక్క; అతనికి రాముని శౌర్యవీర్యాదులందు సహనము లేకుండుటను తప్పునుబట్టి దండించుటకై రాముడు "ఇమాం పాదగతిం రామ తపోబలసమార్జితాన్ । లోకానప్రతిమాన్వా తే హనిష్యామి యదిచ్ఛసి॥" నీపాదగమనశక్తినైనను, నీతపశ్శక్తిచే సంపాదించిన పుణ్యలోకములనైనను గొట్టివేసెదను. నీయిష్టమేమని యడిగి, యాపరశురామునికోర్కెప్రకారము, ఆకాశగమనాది రూపమగు శక్తిని గొనినచో, నతడు కాశ్యపునకు దక్షిణగా నొసంగిన భూమిలో నుండక మహేంద్రపర్వతమునందు వసింప ప్రతిజ్ఞ పట్టినవాడగుటచే, దానికి భంగము కలుగునని యతని తపోబలముచే సంపాదింపబడిన స్వర్గాదిదివ్యలోకఫలము లన్నిటిని దివ్యశరము ప్రయోగించి కొట్టివేసెను. అందుచే భార్గవరాముడు, మోక్షప్రతిబంధకమగు స్వర్గాది ధర్మసాధనపరములగు నిగళములచే (గొలుసులచే) విడువబడి కృతకృత్యు డయ్యెను. కావున పరశుధరమునియొక్క, ధర్మనిగళం హితమితి హీనస్తిస్మ = బంధనహేతువగు స్వర్గాది పుణ్యలోకఫలము లన్నిటిని పరశురామహితమునకై నశింపజేసెను. అట్లే శ్రీరామరూపుడగు వృషాచల

పతి, కాకస్యైకం నయనం హిత మితి హీన స్తిస్మ = అంతఃపురద్రోహియగు జయంతుడను కాకాసురునియొక్క ఒకకన్నును మాత్రము గొని, హితరూపమగు దండనము కావించెను. “ సపితాచ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణంగతః। స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతం। వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్ ” అన్నట్లు శరణాగత వత్సలుడగు రాముడు, వాయసమును శిక్షింపకున్న నరకపతన మగుననియు, రెండుకన్నులుగొనిన దేహయాత్రకు భంగముకల్గుననియు విచారించి “ రాజభి ర్ధృతదండాస్తు కృత్వా పాపాని మానవాః। నిర్మలా స్స్వర్గ మాయాంతి సంత స్సుకృతినో యథా॥ ” యన్నట్లు రాజదండితునకు యమదండనము వేఱులేదని నీతి ననుసరించి, కాకముయొక్క హితమునుగోరి దాని నేత్ర మొక్కటిమాత్రము తనబాణమున కెఱచేసి, ప్రాణముతో విడిచిపెట్టి చిరంజీవియను నామమును సార్థకముచేసెను. ఏవం = ఈవిధముగా దయాలోలుడైన శ్రీనివాసుడు, దండనగతిం = అపరాధులయొక్క దండనక్రమమును, జనిశుగతిం దిశతి = మహాసుగతులకు హేతువగునట్లు అనగా శోభనఫలప్రాప్తియగు విధమున, దిశతి=విధించుచున్నాడు.

మ॥ నయవి చ్ఛ్రీపగిరీశుఁ డబ్ధిరిపులన్ దండించెఁ, గాకాసురున్
నయనంబొక్కటి గొంచుఁగాచెఁ,గొనిపుణ్యస్తోమముల్ బ్రోచె నా
స్మయమానుండగు రాము,నీవిహృతులన్ స్వాతంత్ర్యనిర్ముక్తుఁడై
దయ! దండం బొనరింపఁ బూనిన శుభోదర్కంబుగాఁ జేసెడున్॥

తా. దయా! నీలీలావిలాసములకు లోబడి శ్రీనివాసుడునిజ స్వాతంత్ర్యము నంతయువీడి, దండన మొక్కొక్కచో చేసినను, ఆశ్రితులవిరోధులనే హింసించుచున్నాడు కాని, యాశ్రితులను దండించుటలేదు. శరణుసొచ్చిన సముద్రుని శత్రువుల గూల్చుటయు,

భార్గవరాముని పుణ్యలోకముల నెల్ల హరించుటయు, ఆర్ద్రాపచార యుక్తుడగు కాకాసురుని కన్నొక్కటిమాత్రము గొని ప్రాణముతో విడిపించుటయు దీనికి నిదర్శనములు. అతనిదండనప్రకార మన్ని యెడల హితరూపముగా పర్యవసించినదని భావము.

65. అవ. మహాపరాధులయెడ కోపించి శిక్షించుట రక్షణ రూపమగుటను విమర్శించి, భగవంతుని శీలగుణకార్యమగు నీచుల తోను సంశ్లేషించుటను తెలుపుచున్నారు.

శ్లో॥ నిషాదానాం నేతా కపికులపతిః కాపి శబరీ
కుచేలః కుబ్జా సా వ్రజయువతయో మాల్యకృదితి ।
అమీషాం నిమ్నత్వం వృషగిరిపతే రున్నతిమపి
ప్రభూతైః స్రోతోభిః ప్రసభ మనుకంపే శమయసి॥

టీ. హేఅనుకంపే = దయా! నిషాదానాం నేతా = అడవులందుండి జీవహింసచేయుచు జీవించు కిరాతజాతులకు ప్రభువగు గుహుడు, కపికులపతిః = చపలగుణము ప్రధానముగాగల కోతులకు తేడగు సుగ్రీవుడు, కాపిశబరీ= ఒకానొకనిషాది ; గుహుడన్న పురుషుడు, రాజభావమును వహించినవాడు ఇది నిషాది, కుచేలః= మిక్కిలిదరిద్రుడై చింపుడుబట్టలు గట్టుకొనిన బ్రాహ్మణుడు, కుబ్జాసా=ఆ కృష్ణవిరోధియగు కంసునిచేటిక, నీచపుపనులు చేయునదియని యర్థము. వ్రజయువతయః = చదువు తెలివి నాగరికత లేని గొల్లపడతులు, మాల్యకృత్ = పూలదండలు గ్రుచ్చి జీవించునట్టి సుదాముడను నీచవృత్తి గలవాడును, ఇతి = ఈప్రకారము నీచయోనిత్వమును నీచమగువృత్తియును గల గృధ్రరాజగు జటాయువు మున్నగువారలు సూచింపబడినది. అమీషాం నిమ్నత్వం= వీరల సర్వతోనికృష్టత్వమును, వృషగిరిపతేః ఉన్నతిం అపి = వృషగిరినాథుని సర్వస్మాత్పరత్వమును లేక మహోన్నతస్థితియును,

ప్రభూతైః = అతికూలంకషమై ప్రవహించు, స్రోతోభిః = సర్వతో
ముఖముగా అనగా అన్నిదిక్కులపాలు నీయొక్క ప్రవాహములచే,
ప్రసభం = బలాత్కారముగా, సమయసి = సమీకరణ మొనర్చు
చున్నావు. అనగా భగవంతుని అతినీచులతోను గూడి వసించు
నట్లు చేయుచున్నావు. రాముడు గుహసఖుడై ప్రవర్తించినదియు,
సుగ్రీవునితో చెలిమిజేయుటయు, శబరియిచ్చిన పండ్లనుదినుటయు,
కృష్ణుడు కుచేలుని గౌరవించినదియు, కుబ్జకు శరీరవక్రత మానున
ట్లనుగ్రహించుటయు, గోప గోపస్త్రీలతో విహరించినదియు మాల్య
వంతునకు మోక్షమిచ్చినదియు సర్వవిదితము. మహానదీప్రవాహ
కార్యముచే మిట్టపల్లములు సమమగు విధమున, దయయు, నిజప్ర
వాహముల బలాత్కారమున అత్యున్నతుండగు శ్రీనివాసుని అతి
నీచులగు గుహాదులతో దట్టమగు సంశ్లేషమును లేక చేరికను సంఘ
టించి "సమ మాత్మసను స్నఖే" యనువిధమున భగవంతునకు
సామ్యబుద్ధిని గలుగజేయుచున్నదని భావము. భక్తిజ్ఞానగరిష్ఠులగు
వారు నీచయోనిజాతులైనను భగవత్ప్రియులగుట "ప్రియోహి జ్ఞాని
నోత్యర్థ మహం స చ మమ ప్రియః" "భక్తిప్రియో మాధవ" అను
వాక్యములచే స్పష్టము. దయావర్ణనమున నిమ్నోన్నతప్రదేశముల
నేకముగా చేయు మహానదీవృత్తాంతము గోచరించుటచే, అలంకా
రము సమాసోక్తి.

మ॥ గుహుఁ డెవ్వాఁడు కుచేల కుబ్జ శబరీ ♦ గోపాంగనా మాల్యవ
ద్విహగాధీశ కపీంద్రు లెవ్వరిఁక, దే ♦ వీ వీరినైచ్యంబు నా
యహిశైలేశు మహోన్నతస్థితియు నీ ♦ వత్యంత ముద్యుక్తవై
మహితోదారభవత్ప్రవాహముల సా♦మ్యం బొందఁగాఁ జేయవే॥

తా. ఓకృపా! నీయనర్గళప్రవాహములచే నీచులగు గుహ
కుచేల కుబ్జ గోపాంగనాదులగు భక్తులను, సర్వతత్త్వోన్నతుడగు

వృషగిరిపతిని, సమముగా జేయుచున్నావు. అనగా భగవత్సా మ్యము గలుగజేసెదవు. నీకు విధేయుడై శ్రీనివాసుడు వారికి మోక్షమొసగెనని ఫలితార్థము.

66. అవ. భగవంతుని సౌశీల్యము పైపద్యమున తెల్పబడినది. ఈపద్యమున భగవదౌదార్యకార్యమును వర్ణించి, భగవత్కృపకు పాత్రులగుటచే బ్రహ్మేంద్రాదులెల్ల తమతమ పదవులందుండి మహదైశ్వర్య మనుభవించుచున్నారని తెలుపుచున్నారు.

శ్లో॥ త్వయా దృష్టః తుష్టిం భజతి పరమేష్ఠీ నిజపదే
వహన్ మూర్తీ రష్టౌ విహరతి మృడానీ పరిబృఢః।
బిభర్తి స్వారాజ్యం వృషశిఖరి శృంగారకరుణే
శునాసీరో దేవాసురసమర నాసీరసుభటః॥

టీ. హేవృషశిఖరి శృంగారకరుణే=వృషగిరి కలంకారభూతమగు శ్రీనివాసునికరుణా ; త్వయా దృష్టః = నీచే చూడబడుటచే, నిజపదే = తనబ్రహ్మపదమునందుండి, పరమేష్ఠీ = చతుర్ముఖుడగు బ్రహ్మదేవుడు, తుష్టిం భజతి=బ్రహ్మపదవిషయమగు ఆనందమును అనుభవించుచున్నాడు. నిరంతరానుభవమునకు నీవే కారణము ; మృడానీపరిబృఢః = నిజభార్యయగు పార్వతీదేవిని గూడినవాడై రుద్రుడు, త్వయా దృష్టస్సన్=నీచే నవలోకింపబడినవాడై, అష్టౌ మూర్తీః = పంచమహాభూత సూర్య చంద్ర యజమానాత్మక భేదములైన ఎనిమిదివిధ మూర్తిభేదములను వహించు ప్రభావముతో, విహరతి = దేవినిగూడి విహరించుచున్నాడు. అష్టమూర్తిధారణ మృడానీ సహచరత్వములు భగవదౌదార్యకృత్యము లయినను విహరణ చిరస్థాయిత్వము దయాకార్యము. అట్లే శునాసీరః =ఇంద్రుడు, దేవాసురసమర నాసీరసుభటస్సన్ = దేవదానవుల యుద్ధరంగము

లందు ముందునడచు వీరభటుడై, స్వారాజ్యం స్వః రాజ్యం = స్వర్గ రాజ్యమును లేక స్వర్గాధిపత్యమును, బిభర్తి=నీకటాక్ష ప్రభావము చేత నిష్కంటకముగా అద్యాపి పరిపాలించుచున్నాడు. ఇట్లు శివ బ్రహ్మేంద్రాదులెల్ల ప్రభావయుక్తులగుట భగవత్కృపాకటాక్ష ఫలమని భావము.

శా॥ దేవీ! బ్రహ్మ భవత్కటాక్షమునగా ♦ దే సృష్టులం జేసి యెం
తే వెల్గొం దెడు, నష్టమూర్తియు మృడా ♦ నిం గూడి లోకంబు సం
భావింపగ విహరించు, నాకపతియై ♦ పాకారి వెల్గుగ సురల్
సేవింపగ ద్రిదశాసురాహవములగ ♦ సేనాగ్రియోధుండునై ॥

తా. కరుణా! నీకటాక్షమహిమచేగదా సృష్టికర్తయై బ్రహ్మ తనపదమునందుండి సుఖ మనుభవించుచున్నాడు. భవానింగూడి శివుడు అష్టమూర్తియై విహారములు సల్పుచుండును. ఇంద్రుడు సేనాగ్రచరుడై యసురుల నిర్జించుచు స్వర్గరాజ్యమును వైరుల భయములేక పరిపాలించి సౌఖ్య మనుభవించుచున్నాడు. ఇంక నితరులమాట చెప్పనేల ?

67. అవ. భగవత్సౌశీల్యౌదార్య గుణంబులు దయాసాంగత్యమున నుపజీవింపబడుట పై రెండుశ్లోకములందు చెప్పబడినది. 15 వ పద్యమున భగవద్గుణంబులెల్ల దయాసాహచర్యమున కల్యాణ గుణములగుటయు, దయతో గూడనప్పుడు "దోషాభవేయుః" నింద్యములగుననియు చెప్పబడినది. ఈశ్లోకమున దయాసంబంధముచే నవియెల్ల నమృతతుల్యములై రస్యము లగుచున్నవని తెలుపుచున్నారు.

శ్లో॥ దయే దుగ్ధోదన్వద్వ్యతియుత సుధాసింధునయత
స్త్వదాశ్లేషా న్నిత్యం జనిత మృతసంజీవన దశాః ।

స్వద_న్తే దా_న్తేభ్య శ్ళ్రుతివదన కర్పూరగుళికా
విషుణ్వా_న్త శ్చి_త్తం వృషశిఖరి విశ్వంభరగుణాః॥

టీ. హేదయే! దుగ్ధోదన్వతా = క్షీరసముద్రముతో, వ్యతియుతా = నిబిడముగా సంబంధముగల్గునట్లు ఏకమైనట్లు, సుధాసింధు నయతః = అమృతనది లేక అమృతసముద్రము గూడినట్టి న్యాయము ననుసరించి, నిత్యం త్వదాశ్లేషాత్ = ఎప్పుడు నీచేరికచే, భగవద్గుణంబులు జ్ఞానశ_క్తిబలాదు లన్నియు పాలసముద్రము వంటివి. అగాధములును స్వచ్ఛములు ననుట ; దయ అమృతనదివలె ఇతరగుణముల నెడు పాలకడలిలో చేరుటచే వారికి మృతసంజీవనదశ గల్గుచున్నది. అట్లే వృషశిఖరి విశ్వంభరగుణాః=వృషాద్రివాసుడగు లోకభ ర్తమైన శ్రీనివాసుని గుణాంతరము లన్నియు, శ్రుతివదన కర్పూరగుళికా = శ్రుతులను స్త్రీయొక్క ముఖమునకు పరిమళము గూర్చు కప్పురపు ఉండలనుబోలి అనగా ఉపనిషద్భాగములను అలంకరించునవియై, చి_త్తం విషుణ్వా_న్తః=మనస్సును ఇతర విషయములందు బోనియ్యక వానియందే నిల్చునట్లు దృఢీకరించుచు, జనిత మృతసంజీవనదశాః = సంసారపతితులై మృతప్రాయులగుచున్నవారిని ఉజ్జీవింపజేయునట్టివియై, దా_న్తేభ్యః=శమదమాదిగుణ సంప_త్తి గలవారికి, స్వద_న్తే = అమృతాయమానమై అనుభవించుటచే స్వాదుతరము లగుచున్నవి. అనగా దయామహిమచే భగవద్గుణములు రుచ్యములై అనుభవించువారికి విషయాంతరనివృ_త్తి కలుగజేయుచు ఆనందమును గూర్చుచున్నవని భావము. ఇక్కడ భగవద్గుణములు శ్రుతివదన కర్పూరగుళికలుగా రూపింపబడినవి. శ్రుతిప్రతిపాదితము లగుటచే గుణములకు మహిమయు, భగవద్గుణములను మిక్కిలిగా ప్రతిపాదించుటచే శ్రుతులకు మహిమయు పరస్పరము కలుగజేయునట్లు వర్ణించుటచే, అన్యోన్యాలంకారము.

శా॥ క్షీరాంభోనిధిలో సుధాతటిని సం ♦ శ్లేషించిన ట్లీవునుఀ
జేరంగా దె వృషాద్రినాథుగుణముల్ ♦ చిత్తప్రకర్షంబులై
స్ఫారోదారములై శ్రుతిస్తుతములై ♦ శాంతానుభావ్యంబులై
సారస్యం బొడగూర్చెదుఀ మృతులకుఀ ♦ సంజీవనంబై దయా॥

తా. క్షీరసముద్రమున అమృతనదికూడినట్లు,. నీవు భగవ ద్గుణములతో సంబంధము కలిగినపుడు, అవి మహోరుచ్యములై శ్రుతు లచే ప్రతిపాదింపబడు మహిమను గలవియై, స్మరించి స్మరించి యను భవించువారి కానందదాయకములై భగవదితరవిషయములం దాస క్తిని బోగొట్టుచున్నవి.

68. అవ. ఇంతయేల ? సాక్షాద్భగవంతుడే నీకభిమతమైన జగత్సృష్ట్యాదికర్మలు గావించి, నీనిదేశమున బద్ధచేతనులకు మోక్ష మొసంగుటచే శ్రుతుల నుతికి పాత్రు డగుచున్నా రనుచున్నారు.

శ్లో॥ జగ జ్జన్మ స్థేమ ప్రళయ రచనా కేళి రసికో
విముక్త్యేక ద్వారం విఘటితకవాటం ప్రణయినాం।
ఇతి త్వయ్యాయత్తం ద్వితయ ముపధీకృత్య కరుణే
విశుద్ధానా వాచాం వృషశిఖరినాథ స్తుతిపదం॥

టీ. హేకరుణే! జగ జ్జన్మ స్థేమ ప్రళయానాం = జగము లను గలిగించి పరిపాలించి తనయందే లయింపజేయు క్రియలను, రచనా కేళిరసికః = వైచిత్రి తోచునట్లు గావించుటయే లీలగా గల్గి ఆలీలలందు ప్రీతిగలవాడును (లీల యనుటచే భగవంతున కవి అనా యాససాధ్యములనియు, సంకల్పములేక తలపునమాత్రము సృష్ట్యాది క్రియలు జరుగుచున్నవనియు తెలుపుచున్నది.) ప్రణయినాం = తన యందు భక్తివిశ్వాసాదులు గలవారికి, విఘటితకవాటం = పగుల గొట్టబడిన ప్రతిబంధకము గలవాడును, కవాటమనగా తలుపు.

భగవంతుని బొందుటకు అడ్డముగానున్న చేతనుని పాపపుంజము లన్నియు కవాట మనబడినది. ఈతలుపును పగులగొట్టి; అనగా సర్వపాపాదులనుండి “ మోక్షయిష్యామి మాశుచ ” యన్నట్లు భగవంతుడు విడిపించుచున్నాడు. విముక్త్యైకద్వారం = మోక్షైక హేతువగు పరమాత్ముడు, ఇతిత్వయ్యాయత్తం ద్వితయం ఉపధీకృత్య = ఈవిధమున నీకువిధేయుడగుచు జగదుద్భవాది కృత్యములు చేయుచు, చేతనుల అనాదిపాపసంచయముల తొలగించుట, వారికి మోక్షమిచ్చుట యను నీరెండుకృత్యములను ప్రయోజకములుగా గొని, వృషశిఖరినాథః = వృషాచలపతి శ్రీనివాసుడు, విశుద్ధానాం వాచాం= పరిశుద్ధములైన అనగాఅపౌరుషేయములగు తొలినుడుల యొక్క లేక వేదములయొక్క, స్తుతిపదం (భవతి) స్తోత్రము నకు పాత్రు డగుచున్నాడు. “సర్వే వేదా యత్పద మామనన్తి” “ వేదైశ్చ సర్వై రహమేవ వేద్యో వేదాంతకృ ద్వేదవిదేవ చాహం ” అనువాక్యములబట్టి సర్వవేదములును దయామయుడైన భగవంతుని నుతించి యతని జగత్సృష్ట్యాది వైభవములును మోక్షదానప్రకారములును విశదీకరించుచున్నవని భావము.

మ॥ భగవంతుండు వృషాద్రినాథుఁ డనుకం ♦ పా నీనిదేశంబునన్
జగముల్ లీలనుసృష్టిఁజేయు, మనుచున్ ♦ సంహారమున్ జేయుఁబా
పగతుల్ వేఁదొలఁగించి మోక్ష మొసగున్ ♦ భక్తాళికిన్ దాన,య
ట్లగుటన్ గాదెపొగడ్తకుందగియె శ్రు♦త్యంతంబులం దెంతయున్॥

తా. దయా ! నీపారతంత్ర్యముప్రకటించు శేషశైలనాథుడు జగ దుదయ స్థితి సంహారములు చేతనుల క్షేమమునకై చేయుచు, వారికి సర్వప్రతికూలములును దొలంగింపజేసి మోక్ష మిచ్చుచుండు కారణములచేత వేదాంతములయందు నుతింపబడుచున్నాడు.

69. అవ. ఇట్లు దయాకృతములగు వ్యాపారములనేకములు వర్ణించుచు నీపద్యమున దయాస్వరూపవర్ణనము చేయుచున్నారు.

శ్లో॥ కలిక్షోభోన్మీలత్ క్షితికలుష కూలంకషజవై
రవిచ్ఛేదై ర్నేత్రై రవట తటవైషమ్యరహితైః ।
ప్రవాహైస్తే పద్మాసహచర పరిష్కారిణి కృపే
వికల్పంతే౽నల్పా వృషశిఖరిణో నిర్ఝరగణాః॥

టీ. హే పద్మాసహచర పరిష్కారిణి కృపే = ఓ శ్రీనాథున కలంకారభూతయగు కరుణా! కలిక్షోభోన్మీలత్ = కలిపురుషుని సంక్షోభముచే లేక కృత్యాకృత్యవివేకమును హరించుకలివ్యాప్తిచే, ఉన్మీలత్=ప్రకసించునట్టి లేక వర్ధమానమగు, క్షితికలుష = భూతలవాసులగు జనుల కిల్బిషములకు లేక కలికాలవిజృంభమాణ మ్లేచ్ఛాదులచే గల్గు జగదుపద్రవములకు, కూలంకషజవైః=గట్లను తెగకోయునట్టి పరిపూర్ణవేగముగల (ఇది దయాప్రవాహమునకు విశేషణము.) అనగా క్షితికలుషము లన్నియుని శ్శేషముగాహరించునట్టివియు, అవిచ్ఛేదైః = ఎడతెగక పారునవియు, అవటతట వైషమ్యరహితైః = వీరు ఉత్కృష్టులు వీరు నికృష్టులు అను భేదములేక అందఱియెడ సమత్వము గలవియు (జలప్రవాహపక్షమున మిట్టపల్లములను జూడక ప్రవహించుటని యర్థము) ఇనట్టి ఏతైః తేప్రవాహైః = ఈ పరిదృశ్యమానమగు నీయొక్క ప్రవాహములతో, అనల్పాః = స్వరూపముచేతను సంఖ్యచేతను తక్కువకాని, వృషశిఖరిణః నిర్ఝరగణాః = వృషాద్రిచరియలపై పాఱునట్టి కొండకాలువలు లేక సెలయేఱులు, వికల్పంతే=ఉపమీయంతే = సామ్యము నొందుటకు జూచుచున్నవి. ఆకాశగంగ పాపనాశ ప్రముఖములగు వారిధారలు నిజముగా వారిధారలేనా, లేక శ్రీనివాసుని దయాప్రవాహములా యని సందేహింప తగియున్నవని యర్థము.

లేక ఈర్ష్యచే వేంకటాద్రి సలిలధారలు దయాప్రవాహముల నుప మింపజూచుచున్నవి కాని, సాదృశ్య మెంతమాత్రము పొందకున్న వనియును వృషాద్రినిర్ఝరములకంటె భగవద్దయ సమాశ్రయింప తగినదనియు భావము.

మ॥ కలిసంక్షోభ వివర్ధమాన దురితౌ ♦ ఘంబుల్ సమూలంబుగాఁ
దొలఁగింపన్ భవదీయధారలు దయా ♦ దుర్వారమై పృథ్వి ని
చ్చలు నుత్కృష్ట నికృష్టులం దొకట వై♦షమ్యంబువర్జించి, యి
మ్ములఁబర్వన్ వృషభాద్రినిర్ఝరశతం♦బుల్ గోరు నీసామ్యమున్॥

తా. దయా! కలికాలజనిత దురితసంఘముల నెల్ల మొద లంట తెగఁగోయు వేగముతో, నెడతెగకుండ నిచ్చలు చిన్నపెద్ద లనక యందఱివిషయమున సమత్వముగల్గి ప్రవహించునట్టి నీయొక్క ప్రవాహములతోఁ దులతూగవలయునని తలచినవై సంఖ్యాతీతమగు వేంకటాద్రి సెలయేటిగణములుప్రవహించుచున్నవి; కానియెన్నటి కవి నీప్రవాహముల మహిమను బొందలేవని భావము.

70. అవ. ఇట్లు వేంకటాద్రి వారిధారలకంటె నధికముగా దయాప్రవాహస్వరూపమునువర్ణించి యొకానొక ప్రపన్నుని రక్షణా ర్థమై దయ స్వయముగా నెదురేగుచుండుటను భావించి, విస్మితు లగుచు దేశికులవారు ఈదశకమును విరమించుచున్నారు.

శ్లో॥ ఖలం చేతోవృత్తేః కిమిదమితి విస్మేరభువనం
కృపే సింహక్ష్మాభృత్ కృతముఖ చమత్కారకరణం।
భరన్యాస చ్ఛన్న ప్రిబలవృజిన ప్రాభృతభృతాం
ప్రితిప్రస్థానం తే శ్రుతినగర శృంగాటకజుషః॥

టీ. హేకృపే = సంబోధనము. సింహక్ష్మాభృత్ = వేంక టాద్రి; దానిపైనున్న, కృతముఖ=పండితునియొక్క, చమత్కార

కరణం=చాతుర్యకృత్యమగు, శ్రుతినగర శృంగాటకజుషః తే=వేద ములనుపట్టణములోనిచతుష్పధమున (నాల్గువీధులు కలియుచోటు) నున్న నీయొక్క, భరన్యాస చ్ఛన్న = ఆత్మరక్షణభరమును భగ వంతునియందు సమర్పించుటచే ప్రచ్ఛన్నముగా జేయబడిన, ప్రబ లవృజిన = మహాపాపములను ; ప్రాభృతభృతాంప్రతి = ఉపహార ములను (కానుకలుగా) కొని వేంకటాద్రిని చేరుటకై వచ్చువారిని గూర్చి (వారిరక్షణార్ధమై యనుట) ప్రస్థానం = నీవు ఎదురేగుట అనగా నీప్రత్యుద్గమనము; చేతోవృత్తేః = మనోవ్యాపారమునకు, ఖిలం = దూరమైనది విషయముకానిది; అనగా ఇట్టిదని తెలియ రానిదై యున్నది. ఇదం కిం ఇతి అదెట్లని, నీవువారినింగూడగా నెదురై నడచుటయేమని, భువనం = లోకము, విస్మేరం = ఆశ్చ ర్యముతో జూచుచున్నది. అనగా శ్రుతినగర చతుష్పధముననున్న నీవు శరణాగతిచేసిన యొకానొక జీవుని రక్షింపదలచి, వాని కెదు రుగా నడచి వచ్చుటేమియని జగమంతయు విస్మయావిష్టమైనది. నీయొక్క ఆశ్రితవ్యామోహమును "విద్వానేవ విజానాతివిద్వజ్జనపరి శ్రమం" అన్నట్లు ఆశ్రితపరతంత్రుడై నీచే దయాళువైన శ్రీనివా సుడే యెఱుగును. అందుచేత నీయొక్క ప్రతిగమనము శేషాద్రి పండితుని చమత్కారకృత్యమైనది. "రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుం" అన్నట్లు ప్రపన్నుడు నిజపాపపుంజము లనే భరన్యాసవిధిచే గప్పి, ఉపాదేయముగా గొని వేంకటాద్రికి రాగా వేదాంతప్రతిపాదితయగు గుణేశ్వరియగు నీవు, వాని కెదు రేగుట చాలా యాశ్చర్యకరమగుచున్నదని జనులు భావించెదరు. నీయాశ్రితవ్యామోహము కొనియాడతగినది. దయావైభవము వేదప్రతిపాదిత మగుటచే చతుర్వేద మూర్ధాయమానమగు ఉపని షత్తులను, నగరములోని చతుర్మార్గములు గలియు శృంగాటకము

నకు సరిగా జెప్పబడినది. నగరములో సర్వవిధవస్తువులు లభించు నట్లు, సర్వపురుషార్థములకు మార్గములు వేదములు తెలుపుటచే వానిని నగరముతో రూపింపబడినది.

మ॥ శ్రుతిసన్నాళి పురీచతుష్పథమునన్ ♦ సాంసారు నిన్నున్ దయా
చతురుం డావృషశైలనాథుఁ డనుపన్ ♦ సంన్యస్త రక్షాభరుల్
హతపాపప్రచయోపహారులయి డా ♦ యన్ నీవు ప్రత్యుద్గమో
ద్యతవై వారలఁ గూడు టేమని జగం♦బాశ్చర్యమున్ బొందెడున్॥

తా. ఓకృపా! వేదాంతభాగములచే ప్రతిపాదింపబడుప్రభావముగల నీవు, నిన్ను శేషగిరిచతురుడగు శ్రీనివాసుడు పంపగా, తన యోగక్షేమభరమును శ్రీనివాసున కొప్పించిన నాకానొక చేతనునిం గూర్చి, యతని రక్షణార్థమై యెదురుగావచ్చు టేమనిలోకు లందఱు ఆశ్చర్యమగ్ను లగుచున్నారు. నీమహిమ మనమునకందరానిది మనస్సునకే దూరమైనపుడు మాటలచే వర్ణించు టెట్లగును.

71. అవ. నీయొక్క జగదుపకారకృత్య పరంపరలట్లుండని. అది యాశ్చర్యము కాదు, దురంతమహాపాతక దూషితుడగుచు పాపస్పర్శభయమున భగవంతునిచే దూరముగా పరిత్యజింపబడిన నన్ను, నీకటాక్ష వీక్షణముల రక్షింప సాహసించుటయే మిక్కిలి యాశ్చర్య మనుచున్నారు.

శ్లో॥ త్రివిధచిదచిత్సత్తాస్థేమ ప్రవృత్తి నియామికా
వృషగిరి విభో రిచ్ఛా సాత్వం పరై రపరాహతా।
కృపణభరభృత్కుర్వాణ ప్రభూతగుణాంతరా
వహసి కరుణే! వైచక్షణ్యం మదీక్షణసాహసే॥

టీ. త్రివిధచిదచిత్ = నిత్యులు ముక్తులు బద్ధులు అను మూడువిధములగుశుద్ధసత్వమిశ్రసత్వ సత్వశూన్యులైన చేతనాచేతన

వస్తుజాతములయొక్క, సత్తాస్థేమ ప్రవృత్తినియామికా = స్వరూప సద్భావములునువానినిలుకడయు ప్రవృత్తులును, నియామికా=వాని వాని తరతమభావముల ననుసరించి నియమించుటకు శక్తిగలదానవును (సర్వభూత స్థితి ప్రవృత్తులు దయాళువగు భగవదాజ్ఞచే సంభవించుచున్నవని భావము) పరైః అపరాహతా=భగవదితరులకు లొంగి ప్రవర్తింపనిదానవును (భగవంతుని అప్రతిహతేచ్ఛయే దయారూపమనుట) కృపణభరభృత్ = అకించనుల దీనుల యోగక్షేమభరమును వహించుదానవును, కింకుర్వాణ ప్రభూతగుణాంతరా=పరికరీభూతములై నీయాజ్ఞానుసారిణులై ప్రవర్తించుజ్ఞానశక్తిబల తేజో వీర్యాదులైన ప్రసిద్ధ భగవద్గుణాంతరములగలదానవును (గుణసార్వభౌమియగుటచే) వృషగిరివిభోః ఇచ్ఛా సాత్వ్యం = శ్రీనివాసుని ఇచ్ఛలేక సంకల్పము దయాయత్తమగుటచే తదిచ్ఛారూపముచేతను ప్రసిద్ధికెక్కిన నీవు, మదీక్షణసాహసే = అతిక్షుద్రుడనగు నన్ను కరుణించుటను సాహసకృత్యమును జేయ, వైచక్షణ్యం వహసి = నేర్పరితనమును గల్గియున్నావు. "సాహసంబు విడచి సామాద్యుపాయ ప్రయుక్తిఁ జేయుదురు యథోచితముగ" అను సామాన్యలోకనీతి యున్నను "నసాహస మనారుహ్యానరోభద్రాణి పశ్యతి" అను న్యాయము ననుసరించి అనంత మహాపరాధచక్రవర్తియైన నన్నుజ్జీవింపజేసి కీర్తిలాభమును బొందగోరి సాహసించుచున్నావని తాత్పర్యము. సర్వశక్తిసంపన్నతగల్గి స్వాధీనవృషగిరీశయగుచు స్వయంప్రభూతమైన దయకు అత్యంతపాపతములనైన కటాక్షించుట సాహసకృత్యమైనను నిజముగా సాహసముగాకనైజ ప్రవృత్తియగునని భావము. త్రివిధ చిదచిత్సత్తా స్థేమ ప్రవృత్తి నియామికా- మొదలగు విశేషణములు దయా సాహసకరణమునకు సామగ్రీసంపన్నతను సూచించుటచే అలంకారము పరికరము.

మహాస్రగ్ధర॥

చిదచి ద్వస్త్వాళి సర్గ ♦ స్థితివిలయగతుల్ ♦ చెల్లు నీయాజ్ఞచే నీ
కెదురెందున్ లేదునీయం♦దితరగుణములున్♦భృత్యవృత్తిన్ వహిం
చున్|పదవిన్యస్తాత్మభారా♦వనపరవగుటన్♦బన్నగాద్రీశ్వరేచ్ఛా
ప్రదవౌటన్ నన్ను( బాలిం♦ప(గ(జతురవుగా♦పద్మనాభానుకంపా॥

తా. ఓపద్మనాభునికరుణా ! సకలచరాచరభూతములయొక్క సర్గస్థితిప్రవృత్తులు నీయధీనములై యున్నవి. నీకెదురెందును లేదు భగవద్గుణాంతరములన్నియు నీయధీనమై వర్తించుచుండును. అకించనుల రక్షించుభారమును నీవేకదా వహించెదవు స్వామియగుశ్రీనివాసుని ఇచ్ఛయే నీవు, అట్టి మహామహిమగల నీకు సర్వాపచారములకు పుట్టిల్లై, సర్వనికృష్టుడనగు నన్ను గరుణించి చూచుటకు సాహసశక్తులుగలవు. కావున నన్ను కటాక్షింపరాదా ఉపేక్షింపనేల యని భావము.

72. అవ. నీశక్తులిట్టివి యట్టివి యననేల? సాక్షాల్లక్ష్మీదేవితో పరమసామ్యముగల్గియున్న నీకు ఆశ్రితరక్షణ ముచితమనుచున్నారు. దయా శ్రీదేవుల పరముగా నర్థము పదప్రయోగములచే నెఱుగునది.

శ్లో॥ వృషగిరిపతే ర్హృద్యా విశ్వావతారసహాయినీ
క్షపితనిఖిలావద్యా దేవీ క్షమాదినిషేవితా।
భువనజననీ పుంసాం భోగాపవర్గవిధాయినీ
వితమసి పదేవ్యక్తిం నిత్యాం బిభర్షి దయే స్వయం॥

టీ. హే దేవీ! దయే! వృషగిరిపతే హృద్యా = శ్రీశ్రీనివాసునకు ఇతరగుణములకంటె మనోహారిణియగుదువు (శ్రీదేవిపక్షమున శ్రీనివాసుని వక్షస్థలవాస రసికవు) విశ్వావతార సహాయినీ=

ప్రపంచమునందు భగవంతు డవతరించుటకు కారణమగుటచేసహా యభూతవు భగవంతునియవతారములు దయాకార్యమనుట(శ్రీదేవి పక్షమున సర్వావతార సహచారిణి, "రాఘవత్వే భవత్సీతా రుక్మిణీకృష్ణజన్మని। దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచమానుషీ। విష్ణోర్దేవానురూపాంవై కరోత్యే షాత్మన స్తనుం" అన్నట్లుసహ ధర్మచారిణివై యవతారకృత్యములందుతోడుబడుచున్నది.) క్షపిత నిఖిలావద్యా = నీసాహచర్యమున శమింపజేయబడిన గుణాంతర ముల దోషము గలదానవు లేక నీయనుగ్రహమున పోగొట్టబడిన ఆశ్రితుల దోషమును గలదానవు. (శ్రీదేవిపరమున క్షమింపబడిన ఆశ్రితుల పాపములు గలదానవని యర్థము. రావణ కారాగృహ మున తన్ను తర్జించిన రాక్షసస్త్రీలను హింసింపవేడిన హనుమంతు నితో సీతాదేవి "రాజసంశ్రయవశ్యానాంకుర్వంతీ నాంపరాజ్ఞయా విధేయానాంచ దాసీనాం కః కుప్యే ద్వానరోత్తమ" యనియు, "కార్యం కరుణ మార్యేణ నకశ్చి న్నాపరాధ్యతి" యనియు తెలిపి, యార్ద్రాపచార భూయిష్ఠులగు దుష్టరాక్షసస్త్రీల పాపము లను క్షమించుట దీనికినిదర్శనమై యున్నది.) క్షమాదినిషేవితా= క్షమాదిటర్వు మొదలగు భగవద్గుణాంతరములచే సేవింపబడినదా నవు(శ్రీదేవిపరమున భూమినీళాదులచే సేవింపబడుదానవనియర్థము) భువనజననీ = అఖిలభువనములయొక్క పుట్టుకకు కారణమైనదానవు (శ్రీదేవిపక్షమున "త్వం మాతా సర్వలోకానాం దేవదేవోహరిః పితా" యన్నట్లు లోకమాతవు) పుంసాం=పురుషులకు, భోగాపవ ర్గవిధాయినీ = కృపణజనకల్పలతికవై త్రివర్గ అపవర్గఫలములనొసం గుదానవు. శ్రీదేవిపరమున కటాక్షలవలేశముచే "శరీరారోగ్య మైశ్వర్య మరిపక్షజయస్సుఖం। దేవిత్వద్దృష్టిదృష్టానాంపురుషాణాం నదుర్లభం" అను వాక్యాదులప్రమాణమున సంశ్రితులకు సర్వ

విధపురుషార్థముల నిచ్చుదానవని యర్థము) పైన వివరింపబడిన ప్రిభావముగల నీవుశ్రీదేవివలె వితమసిపదేవ్యక్తిం నిత్యాంబిభర్షి = నీవిషయాకారముచే అనగా నీకటాక్షముచే తమోగుణరహితుల విషయమున శమాదిగుణపూర్తిచే నిత్యము స్వయంప్రకటితమైన యఖండప్రిభావముగలదానవై యొప్పుచున్నావు (శ్రీదేవిపక్షమున వితమసి పదే = వైకుంఠే; నిత్యాం వ్యక్తిం స్వయం బిభర్షి = సత తైకరూపమగు దివ్యమంగళవిగ్రహమును స్వయముగా ధరించి వెలిగెదవు) విశేషణసామ్యముచే దయాస్తోత్రమున, అప్రస్తుత శ్రీదేవి వృత్తాంతము పదగమనికచే స్ఫురించుటచేత అలంకారము సమాసోక్తి. 'స్వయం' అనుటచే నిర్హేతుక జాయమాన కటాక్షమును దెలుపుచున్నది.

స్రగ్ధర॥

భూమిన్ లీలావతారంబులహరిపొడమన్ బూనితోడ్పాటయోగ
క్షేమంబుల్ దల్లివోలెన్ క్షితులకరయుటన్ ఛేదితావద్యవౌటన్
ప్రేమన్ గొల్వన్ క్షమాదుల్ వృషగిరిపతికిన్ హృద్యవౌటన్
దయా! యా
శ్రీమాడ్కిన్ నిస్తమంబౌ స్థిరపదమునన్ శ్రేష్ఠమౌవ్యక్తితోచున్॥

తా. ఓదయాదేవీ! శ్రీహరియొక్క లీలావతారములకు దోడుపడుటచేతను తల్లివలె ప్రజల యోగక్షేమములు గనుగొనుట చేతను, క్షమింపబడిన సర్వదోషములు గలదానవగుటచేతను, క్షమాదులెల్ల నిన్ను సేవించుటచేతను, వృషగిరినాథునకు హృద్యవగుటచేతను, నీ వాలక్ష్మీదేవివలె తమోగుణవర్జితమగు స్థానమున నీయొక్క వ్యక్తిని లేక ఆవిర్భవమును స్వయముగా నందటికి ప్రకటింప జేయుచున్నావు.

73. అవ. చేతనుల నుజ్జీవింపచేయుటకు నీచేగావింపని పనియొక్కటికలదా. తత్తదిచ్ఛానుగుణముగా భగవదనుభవ కైంకర్యప్రాప్తికొఱకు, శ్రీవేంకటగిరిమొదలగు అర్చావతారస్థలములాదిగా శ్రీవైకుంఠ మంత్యముగాగల అనేక దివ్యస్థానములు కల్పించి, చేతనుల నయ్యైస్థలముల ప్రాపింపజేయుటకు నిచ్చెనపగిది నొప్పుచున్నా వనుచున్నారు.

శ్లో॥ స్వయ ముదయిన స్సిద్ధాద్యావిష్కృతాశ్చ శుభాలయా
వివిధవిభవ వ్యూహావాసాః పదం చ పరం విభోః।
వృషగిరిముఖే ష్వేతే॰ష్విచ్ఛావధి ప్రతిలబ్ధయే
దృఢవినిహితా నిశ్రేణి స్త్వం దయే నిజపర్వభిః॥

టీ. హేదయే! స్వయముదయినః=స్వయంవ్యక్తములైన, సిద్ధా ఆది ఆవిష్కృతాః శుభాలయాః=సిద్ధాది దేవతాసమూహములచే ప్రకాశితములైన దివ్యదేశములు, వివిధ = వివిధప్రకారములైన, విభవవ్యూహా ఆవాసాః=మత్స్య కూర్మాది భేదములను వ్యాసా ద్యావేశావతార భేదవిశేషములను గల విభవస్థానములును వాసుదేవ సంకర్షణాది భేదములచే గల్గిన వ్యూహవిశేషముల కునికిపట్టగు చోట్లును, విభోః పరం పదం చ = సర్వస్వామి త్వరుండగు శ్రియఃపతిచే నధిష్ఠింపబడిన శ్రీవైకుంఠమును, ఇట్లనేకవిధములై, వృషగిరిముఖేషు ఏతేషు=వృషగిరియను దివ్యస్థానము మొదలు శ్రీవైకుంఠమువఱకు గల మధ్యస్థానములందు, ఇచ్ఛావధి ప్రతిలబ్ధయే= కోరికచొప్పున ప్రాపించు నిమిత్తము, అనగా చేతనుల రుచ్యనుగుణముగా భగవదనుభవ కైంకర్యప్రాప్తికొఱకు, త్వం = నీవు, నిజపర్వభిః = ఆయాస్థానములు నీకు సోపానములై విలసిల్లగా, దృఢవినిహితా = గట్టిగా నిర్మింపబడిన, నిశ్రేణిః = నిచ్చెనవై పరగుచున్నావు. అనగా దివ్యదేశములందును విభవవ్యూహస్థానము

లందును, పరమపదమునందును జీవులను త త్తత్సుకృతకర్మల కను గుణముగా పొందునట్లు చేయుటకు నీవు నిచ్చెనవలెనొప్పుచున్నావు. సత్పథంబు లెక్కుటకు భగవద్దయ నిచ్చెనవంటిదనియు, స్థిరముగా చరణము లూని యెక్కుట కాయాస్థానములు మెట్లువలె నొప్పు చున్నవనియు, ఆనిచ్చెనయొక్క తుదిమెట్టు శ్రీవైకుంఠమనియు భావము. ప్రాప్యస్థానలాభము దయాయత్తమని ఫలితార్థము.

స్రగ్ధరా॥

దేవీ! శ్రీశేషశైలా ♦ దిగబహువిభవా ♦ ధిష్ఠితస్థానముల్ వ్యూ
హావాసంబుల్ సురాద్యా♦యతపరమపదాం♦త్యంబుగాఁగల్గుచోట్లన్
జీవాళిన్ గోరినట్లు ♦ స్థిరతర భగవ ♦ త్సేవలన్ సిద్ధిఁ బొందన్
నీవే పర్వాఢ్య నిశ్రే♦ణిగఁ బరగి దయా♦నేర్తు వెందైనఁజేర్పన్॥

తా. దయా! వేంకటాద్రిమొదలగు అర్చావతారస్థలములు గాని, అనేకవిధములైన విభవవ్యూహములచే నొప్పు స్థలములు గాని, శ్రీవైకుంఠముగాని చేరి చేతనులందఱు భగవత్సేవల సిద్ధిని బొందుటకు, నీవు నిచ్చెనవలె నొప్పి వారి నభ్యుష్టలములు పొందు నట్లు చేయుచున్నావు.

74. అవ. పై శ్లోకమున జీవుల ప్రాప్యస్థానము దయాధీన మని చెప్పి, ఈశ్లోకమున ప్రాపకలాభముకూడ దయా విధేయ మనుచున్నారు.

శ్లో॥ హితమితి జగద్దృష్ట్యా క్లృప్తై రక్లృప్త ఫలాంతరైః
అమతివిహితై రన్యైర్ధర్మాయితైశ్చ యదృచ్ఛయా।
పరిణత బహుచ్ఛద్మా పద్మాసహాయదయే స్వయం
ప్రదిశసి నిజాభిప్రేతం నః ప్రశామ్య దపత్రపా॥

టీ. హేపద్మాసహాయదయే! జగద్దృత్యాహితమితిక్లృప్తైః= "యద్యదాచరతి శ్రేష్ఠో తత్తదే వేతరే జనాః" అనునట్లు పెద్ద

లాచరించు కర్మానుష్ఠానములు హితమనుబుద్ధిచే నాచరింపబడుకర్మ ఫలములచేతను (ప్రాసంగిక సుకృతములనుట.) అక్లప్తైః ఫలాంతరైః = అసంకల్పితములైన ఇతరఫలములచేతను (ఆనుషంగిక సుకృతములనుట.) అమతివిహితైః = బుద్ధిపూర్వకముగా నాచరింపని కర్మఫలవిశేషములచేతను, యదృచ్ఛయా ధర్మాయితైఃఅన్యైశ్చ= తనంతట కాలకల్పితమై పుణ్యకర్మఫలముల నిచ్చు ఇతరక్రియల చేతను (యాదృచ్ఛికసుకృతవిశేషము లనుట. అవియు నీయధీనములే. మాబోటి మందప్రజ్ఞుల కెఱుగ నసాధ్యమని భావము.) ఇట్లు పైనవివరింపబడిన ప్రాసంగిక, ఆనుషంగిక, యాదృచ్ఛికములను త్రివిధ సుకృతకర్మఫలములచే ఆఫలములు మమ్ము బొందగానను, పరిణతబహుచ్ఛద్మా = పరిపక్వములైన రక్షణవ్యాజములు పెక్కు లేర్పఱచుకొని, ప్రశామ్యదపత్రపా=ఇంతకాలము రక్షించుటకు వ్యాజ మేర్పడనందున లజ్జితవగు నీవు శంకయు లజ్జయువీడి, నః = మాకు, నిజాభిప్రేతం=మాఅభీష్టమును కోరినఫలము ననుట, ప్రదిశసి = ఇచ్చుచున్నావు. కావున ప్రాపకము మాకు నీవేయని యర్థము.

మహాస్రగ్ధర॥

క్షితిపై వేదోక్తకర్మా♦ర్జితములు నదనై♦చేరు పుణ్యంబులుఁగా ని
శ్చితముల్ గానట్టియాదృ♦చ్ఛికసుకృతములుఁ♦ జేరఁగామమ్ముసంపా
దిత నానావ్యాజవై సం♦దియములు దొలఁగఁ♦ధీరవై మాకునీవే
హితబుద్ధిఁ వాంఛితార్థం♦ బెలమినిడుదుగా♦యిందిరేశానుకంపా॥

తా. ఓపద్మాదేవిని సహాయముగాగల శ్రీనివాసునిదయా! నీవు మమ్ము రక్షించుటకు వ్యాజమేమియు దొరకమిచే లజ్జించుచుండగా, మమ్ము ప్రాసంగికములు, ఆనుషంగికములు, యాదృచ్ఛికములు అను మూడువిధపుణ్యములు నీయధీనమగుచు జేరగా,

వానిలో నేదో యొకటి వ్యాజముగా గొని తటియెటింగి మాకోరిక లొసంగిమమ్ము రక్షించుచున్నావు.

75. అవ. సుకృతకర్మఫలంబులు మమ్ము బొందునట్లుచేసి మాకు కోరిక లొసంగెదవు సరే, మేమజ్ఞులమై దుఃఖాంతములగు నశ్వరసుఖములం దపేక్ష కలిగినను, నీవు మాకు కామ్యఫలంబులందు విడుపును విరక్తియు బుట్టించి, వృషాద్రినాథుని స్థానమగు పరమపదము నిచ్చి పునర్జన్మ లేకుండునట్లు చేయుచున్నా వను చున్నారు.

శ్లో॥ అతివిధిశివై రైశ్వర్యాత్మానుభూతిరసై ర్జనా
నహృదయ మిహోపచ్ఛిద్య శ్రైషా మసంగదశార్థినీ।
తృషితజనతా తీర్థస్నాన క్రిమ క్షపితైనసాం
వితరసి దయే ! తాతంకా వృషాద్రిపతేః పదం॥

టీ. హేదయే ! అతివిధిశివైః = బ్రహ్మ శివానందములకు మించినట్టి, ఐశ్వర్య ఆత్మానుభూతిరసైః = ఐశ్వర్య కైవల్య జనిత సుఖానుభవములందు, అహృదయ ముపచ్ఛిద్య = ప్రీతిలేమిని గలిగించి, తృషితజనతా తీర్థస్నానక్రమ క్షపితైనసాం = డప్పిగొన్న జనులను పుణ్యోదకమునముంచి వారి దాహమును తీర్చి, పాపములనుగూడ పోగొట్టు నీతి ననుసరించి, నీసమాశ్రయణమున క్షుద్రఫలములం దాసక్తి తొలగగా, జనాన్ = నీయాశ్రితులను, ఇహ అసంగదశార్థినీసతి = ఐశ్వర్య కైవల్యసుఖములందు రాగములేనట్టి " సంగము బంధ మఖిలనిస్సంగను మోక్షంబు " అన్నట్లు సంగ రాహిత్యమును ప్రకటించు దశను, స్థితిని, నీవు కోరినదానవై, వీతాతంకా=వీరికి మోక్షేతరఫలములందు ప్రీతిలేదు, భగవన్నిత్య కైంకర్యకాంక్షులగు వీరు మోక్షప్రదానమున కర్హులని తలచి ఏవిధమైన శంకగాని భయముగాని లేక, వారికి, వృషాద్రిపతేః పదం=

వృషగిరినాథుని స్థానమును లేక తచ్చరణారవింద నిత్యకైంకర్య ప్రాప్తిని, అనగా సాయుజ్యమును, వితరసి = ఇచ్చుచున్నావు. "సాయుజ్య మన్యే సతు మోక్ష ఉక్తః" "సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్రభక్తా స్తపస్వినః। కింకరా మమ తే నిత్యం భవంతి నిరుపద్రవాః" అను వాక్యములచొప్పున, మోక్షానందమును బొందుటనగా వారు భగవచ్చరణారవింద నిత్యకైంకర్య రసానుభవమును గాంచెదరని యర్థము.

మహాస్రగ్ధర॥

ఇల తీర్థస్నాన మెట్లున్ దృషితులశుచికిన్ హేతువైనట్లు నీచే
జలజోజ్జాతేశ్వరాదుల్ చవి మొఱుఁగనియైశ్వర్యకైవల్యభోగం
బులయందున్ రక్తిచిత్తంబులవదలుదశన్ బొందుటరించిశుద్ధా
త్ములకున్ సాయుజ్య సౌఖ్యంబు నొసఁగ కరుణా పూనవే
త్వ క్తభీతిః॥

తా. కమలాసన చంద్రశేఖరుల యానందమునకు మించినట్టి మహదైశ్వర్య కైవల్యజనిత సుఖములందును, ప్రీతియు సంగమును హృదయములో లేకుండుటను జూచి, దాహము గొన్నవారిని పుణ్యతీర్థములముంచి దప్పిని పాపవర్గములను దొలగించునట్లు, నీ సమాశ్రయణమున క్షుద్రఫలాసక్తికి హేతువులగు పాపములు వాయఁగా, నిర్మలాంతఃకరణములు గల భవదాశ్రితులకు భగవన్నిత్యకైంకర్యరూపమగు మోక్షము నొసంగెదవు. అనగా మోక్షైకపరాయణులగు అత్యంత భక్తియుక్తులకు మోక్షమొసంగు విషయమున నీ కెంతమాత్రము యోచనలేదు. వారియందట్టి సంగరాహిత్య దశ నీచేతనే కలుగుచున్నదని భావము.

76. అవ. తాపత్రయములచే బాధ్యమానుడగు జీవుడు అమృతసాగరమును బోలు శ్రీనివాసపదనిక్షిప్తుడై సమస్త పూర్వో

_త్తరాఘములచే విడువబడి, మోక్షకాంక్షులగు ఏకాంతి కాత్యంత భక్తుల సాంగత్యమున నిందే అపవర్గసౌఖ్యము ననుభవించుచున్నా డనుచున్నారు.

శ్లో॥ వృషగిరి సుధాసింధౌ జన్తు ర్దయే నిహిత స్త్వయా
భవభయ పరీతాప చ్ఛిత్త్యై భజ న్నఘమర్షణం।
ముషితకలుషో ముక్తే రగ్రేసరై రభిపూర్యతే
స్వయ ముపనతై స్స్వాత్మానంద ప్రభృ త్యనుబన్ధిభిః॥

టీ. హేదయే! జన్తుః=దయనీయుడగు జీవుడు, భవభయ పరీతాపచ్ఛిత్త్యై=సంసారభయతాపత్రయాదులచే విడువబడు నిమి త్తము, త్వయా=నీచే, వృషగిరిసుధాసింధౌ=వృషాద్రిపై వర్తించు అమృతసాగరమును బోలు శ్రీనివాసునియందు, నిహితః = ఉంచ బడినవాడై అనగా నీజీవుని నీవు స్వీకరింపవలయునని భగవంతునకు సదాచార్యులద్వారా సమర్పించగా; అఘమర్షణం భజన్=క్షమింప బడిన సర్వపాపములు గలవాడగుచు, (అఘమర్షణస్నానమును చేసిన వాడై) ముషితకలుషః = నిరస్తపాపుడై, ముక్తేః అగ్రేసరైః = మోక్షమార్గమునకు ముందు నడచువారును, స్వయ ముపనతైః = స్వయముగా ప్రాప్తులగువారునగు, స్వాత్మానందప్రభృ త్యనుబం ధిభిః=స్వాత్మస్వరూప స్వభావానుసంధాన ప్రీతియును, పరమాత్మ స్వరూప స్వభావానుసంధాన జనిత ప్రీతియును గల, అనుబంధిభిః= అనుసరించి ప్రవర్తించు మోక్షాయత్త చిత్తులచే, అభిపూర్యతే = అభితః పూర్యతే = అంతటను పరివేష్టింపబడుచున్నాడు. "సంసృ జ్యతే యది చ దాసజన స్త్వదీయః సంసారఏష భగవన్ అపవర్గ ఏవ" అన్నట్లు ముముక్షువుల గోష్ఠినుండి, సర్వకాలము భగవద్గు ణానుభవజనిత మహానందమును బొందునని భావము. భగవద్దయకు పాత్రుడైన ఒకానొక చేతనుని భగవచ్చరణారవింద ప్రాప్తివర్ణన

మున, రాజ్యలాభమున సుహృద్బాంధవులెల్ల దన్ను గూడియుండగా సుఖించునట్టి యొకానొక రాజకుమారుని వృత్తాంతము ప్రస్ఫురించుటచే, అలంకారము సమాసోక్తి.

మహాస్రగ్ధర॥

దయనీయర్థిన్ జీవుఁ దాప ♦ త్రయ వినిహతిచే ♦ ధన్యునింజేయ నీవే
స్స్వయమై శేషాద్రిపీయూ ♦ షమయజలధిముం ♦ చర్థిన్ వీతసర్వాపంకా
శయుఁడై స్వాత్మైకనిష్ఠా ♦ జనిత వరసుఖా ♦ స్వాదులంగూడివాఁడ
క్షయమోక్షానందమిందే ♦ సతతముఁబడయున్ ♦ శార్ఙ్గధన్వానుకంపా॥

తా. ఓదయా! నీవిషయమునకు పాత్రుఁడైన మహాత్ముడు శ్రీనివాసపదకమలములం దుంచబడి, సమస్తపాపములచే విడువబడినవాఁడై సంసారతాపత్రయములచే గారింపబడక, సర్వకాలము మోక్షాసక్తులగు భగవద్దాసుల గోష్ఠిలో నుండి, భగవద్గుణానుభవము చేయుచు నిరుపద్రవముగా సుఖించుచుండును. "నివృత్తరాగస్య గృహం తపోవనం", "తపము గృహమునందైన తత్పరతనాచరించి సంసారజలధి తరించునతడు" అన్నట్లు భగవద్దయాప్రభావమున ప్రపన్నుఁడు సర్వసంగరహితుఁడై, సంసారమందున్నను అపవర్గసౌఖ్యము పరిపూర్ణముగా ననుభవించును.

77. అవ. భగవత్పాదమూల ప్రపన్నుఁడు శరణవరణానంతరము బుద్ధిపూర్వకముగా పాప మాచరించి ప్రాయశ్చిత్తాదులు చేయకుండినను, నతనికి ప్రపత్తిఫలము చెడదని తెలుపుచున్నారు.

శ్లో॥ అనితరజుషా మంతర్మాలే వ్యపాయపరిప్లవే
కృతవిసనఘావిచ్ఛిద్యైషాం కృపే యమవశ్యతాం।
ప్రపదనఫల ప్రత్యాదేశ ప్రసంగవివర్జితం
ప్రణివిధి ముపాదిత్సే సార్ధం వృషాద్రి హితైషిణా॥

టీ. హేకృపే! అనితరజుషాం = అనన్యశరణులైన వారికి, అంతర్యాంలే = బుద్ధిపూర్వకముగా, అపాయపరిప్లవేపి=పాపసంకర త్వము కలిగినను, కృతవిత్ అనఘా ఏషాం యమవశ్యతాం విచ్ఛిద్య = ప్రపత్తిప్రభావమున దోషరహితులగు వారికి "నఖలు భాగవతా యమవిషయం గచ్ఛంతి" అనుచొప్పున యముని అధీనత్వము లేకుండునట్లొనరించి, ప్రపదనఫల ప్రత్యాదేశ ప్రసంగవివర్జితం = ప్రపత్తిఫలము మోక్షము, తత్ప్రాప్తికి భంగము కలుగు టను మాట నెంతమాత్రము లేనట్లె, ప్రతివిధిం = స్వల్పదండన రూపమగు ప్రతిక్రియను, వృషాద్రి హితైషిణాసార్ధం = వృషాద్రి నాథుడను చేతనుల హితముగోరు శ్రీనివాసునితో తగినవిధముగా నాలోచించి, ఉపాదిత్సే = కలుగజేసెదవు. శ్రీనివాసు డొకవేళ ఎక్కువగా దండించునేమో యను శంకచే నీవు నతనితో గలిసి యాలోచించి, అపరాధియగు రాజకుమారునకు స్వల్పదండన విధించు నీతిప్రకారము పాపపరిహారార్థము ప్రతివిధిని కల్పించెదవు. ప్రపన్నుడు "కృతమిహ దురితం ప్రమాదవృత్త్యా కిమపి ముకుంద కృపానిమగ్న మేనం। పవనతనయ వాలవహ్నినీత్యా న దహతి ధక్ష్యతి యోఽతం పరేషు" ప్రమాదమున దురితము లాచరించినను ముకుంద కృపానిమగ్నుడగుటచే, హనుమంతుని వాలాగ్ని తనున్న గాల్పక శత్రువులనే బాధించినట్లు స్వల్పదండనవిధిచే పాపవినిర్ముక్తుడై మోక్షమును దప్పక పొందుచున్నాడని భావము.

మహాస్రగ్ధర॥

జగతిన్ బుణ్యుల్ ప్రపన్నుల్ సకలుషమతిదుష్కర్మముల్ సేసినన్ బా
పగతిన్ బోనీక వారిన్ ప్రపదనఫల సంప్రాప్తి కేయడ్డులేకన్
దగుమైశిక్షింపఁగా నిత్యముసలుపుదుమంత్రంబు దేవీదయా ప
న్నగశైలేశాప్తుతో మానవపతితనయన్యాయతన్ స్వల్పరీతిన్॥

తా. దయా! శరణాగతిచేసినవాడు ప్రారబ్ధవశమున మనః పూర్వకముగా పాప మొనరించినను, నీయందు పరిత్యాగబుద్ధి లేని వాడగుటచే, వానికి యమదండన లేకుండచేసి. నీకు విధేయుడైన శ్రీనివాసునిచే మిక్కిలి స్వల్పమగు దండనము విధింపజేసి; ప్రపత్తి ఫలమగు మోక్షమునకు భంగము కలుగకుండ జేసెదవు.

78. అవ. మోక్షప్రాప్తి కొఱకు ప్రపత్తి చేసినవానికి ధీ పూర్వకముగా ఉత్తరాఘప్రసక్తి కలిగినను మోక్షఫలమునకు భంగ ములేదని నుడివి తత్ప్రసంగమున స్వర్గాది దివ్యభోగము లర్థించిన వారికిని, మధ్యలో ఫలములనిచ్చు దేవతానాశనమైనను, ఆఫల ములుకూడ తప్పక భగవద్దయచే సమకూరు ననుచున్నారు.

శ్లో॥ క్షణవిలయినాం శాస్త్రార్థానాం ఫలాయ నివేశితే
పితృసురగణే నిర్వేశాత్ప్రాగపి ప్రళయం గతే।
అధిగత వృషక్ష్మాభృన్నాథా మకాలవశంవదాం
ప్రతిభువ మిహ వ్యాచఖ్యు స్త్వాం కృపే నిరుపప్లవాం॥

టీ. హేకృపే! క్షణవిలయినాం శాస్త్రార్థానాం = క్షణకా లములోనశించునట్టి జ్యోతిష్టోమాదుల, ఫలాయ=ఫలప్రాప్తికొఱకు, అనగా స్వర్గాది దివ్యభోగముల నొందుటకై, నివేశితే=ఫలప్రదాత యగు నీచేత స్థాపితమైన, పితృసురగణే = పితృదేవతానిర్జరగణ ములు, నిర్వేశాత్ ప్రాక్=ఫలకాంక్షియగు కర్త యనుభవించు టకు ముందుగానే, ప్రళయంగతేపి = నాశమునొందినను, అనగా భోగప్రదాతలు తమభోగస్థానములతో నశించినను, అధిగత వృష క్ష్మాభృన్నాథాం = పొందిన వృషాచలపతిని కలదానవును (దయ స్థిరమగు పరమాత్మని ఆశ్రయించుటను తెలుపుచున్నది.) అకాల వశంవదాం = కాలపైపరీత్యముచే గలుగు వికారములు లేనిదాన

వును (ఈవిశేషణము దయయొక్క నిరపాయమైన స్వరూపమును తెలుపుచున్నది.) నిరుపప్లవాం = పరులచే నెట్టియెడరు లేనిదాన వును నగు, త్వాం = నిన్ను, ఇహ = తత్తత్కర్మఫలప్రదానవిషయమున, ప్రతిభువం వ్యాచఖ్యుః = పూటకాపగుదని జ్ఞానులు తెలుపుచున్నారు. స్థిరాశ్రియత్వమును, నిరపాయస్వరూపమును, పరోపద్రవరాహిత్యమునుగల భగవద్దయ, జామీన్‌దారుగానుండి క్షుద్రదేవతలు నశించినను అవియొసంగెడు స్వర్గాదిభోగరూపములగు ఫలములు వానిని కోరినవారి కిచ్చుచున్నదని యర్థము.

స్రగ్ధర॥

కాలాధీనంబులై స్వ♦ర్గముఖ వివిధభో♦ గస్థలంబుల్ ఫలార్థుల్
బోలన్ బ్రాపించుమున్నే♦పొలుపరిననుద♦ద్భోగముల్ బొందజేయన్
స్థాలిత్యం బెందులేకే♦ జగదధిపతికిన్ ♦ స్థానమై నిత్యవౌటన్
భూలోకంబందునిన్నే♦బుధవరులుదయా♦పూటకాప్రండ్రు కాదే॥

తా. దయా! స్వర్గప్రముఖ బహువిధ కామోపభోగములాసించి వేదోక్తకర్మ లాచరించువారు ఫలములు బొందుటకు మునుపే భోగస్థానములు నశించినను, ఆద్యంతములులేని శ్రీనివాసుని యాశ్రయించిన నీవు సర్వశక్తిమంతురాలై ఫలకాములకు కోరిన సర్వఫలములు గలుగజేయు విషయమున పూటకాపై అనగా జామీన్‌దారై యున్నావని ప్రాజ్ఞులగు భాష్యకారులు వక్కాణించెదరు.

79. అవ. దయా! పెక్కుమాటలేల? భవత్సమాశ్రయణముచే శ్రీనివాసు డెల్లరకు క్రమముగా, నిప్పుడే కాకున్న కొంత కాలమునకైన ముక్తినిచ్చును కావున, నెవ్వరికి నిన్ను దాటరాదు; అనగా నేరికైన నిన్నతిక్రమించి పోవ నలవికా దనుచున్నారు.

శ్లో॥ త్వదుపసదనా దద్య శ్వో వా మహాప్రళయేపివా
వితరతి నిజం పాదాంభోజం వృషాచలశేఖరః।
తదిహ కరుణే తత్తత్క్రీడాతరంగపరంపరా
తరతమయా జుష్టాయాస్తే దురత్యయతాం విదుః॥

టీ. హేకరుణే! త్వదుపసదనాత్ = నీయాశ్రయమున, పురుషకారభూతయగు నీసహాయమున, వృషాచలశేఖరః=వృషాద్రినాథుడు, అద్యశ్వో వా=నేడైన ఎల్లియైన, మహాప్రళయేఽపివా= మహాప్రళయకాలమునందైనను, నీపురుషకారబలముయొక్క తారతమ్యానుగుణముగా ఇప్పుడో రేపో మఱికొన్నాళ్లకో, నిజం పాదాంభోజం = నిజపాదారవిందములను, వితరతి = ఇచ్చుచున్నాడు చరణపరిచరణార్థమై భక్తుల కొసగుచున్నాడనుట. తత్ = ఆకారణమున, ఇహ ఈఫలప్రదానవిషయమునందు, క్రీడాతరంగపరంపరాతరతమయా జుష్టాయాః = చేతనులను నీకటాక్షమునకు పాత్రులుగా నొనరించుటను నీయొక్క క్రీడవిహారమను అలలపరంపరల భేదముచే గూడియున్న, తే = నీయొక్క (ఈవిశేషణము మోక్షప్రాప్తి క్రమేణ గలుగుటకు హేతువును సూచించుచున్నది.) దురత్యయతాం విదుః = మోక్షాపేక్షగల చేతనులచేతను, మోక్షఫలప్రదాతయగు శ్రీనివాసునిచేతను, దాటగూడమిని అతిక్రమించుటకు వీలులేమిని తెల్పుదురు. చిన్నపెద్ద అలలపరంపరలచే నది దుస్తరమైనట్లు విషయాకారతరతమభావముచేనొప్పు భగవద్దయను ఆశ్రయించినవారికి క్రమముగా మోక్షము గల్గును గావున నెవ్వరికిని దయను మీఱిపోవుటకు సాధ్యము కాదని భావము.

మహాస్రగ్ధర

అకళంకంబైనయూత్మీయపదముకరుణా యామ్పగేంద్రాదినిర్వాహకుఁ డిచ్చున్ నేఁడునున్ తే పయిన్ ప్రళయమం దైన
నిన్ బొంద; రక్షో

త్సుకతా క్రీడాతరంగ స్ఫురిత విభవ సం♦జుష్టయో నిస్ భవత్రా
త్రకున్నై నన్ సంసరచ్ఛే♦తనతతికయిసన్♦చాటంగా వచ్చునోక్షో॥

తా. కరుణా! చేతనులయెడ నీకుగలుగు ఆదరాతిశయ భేదముచే నీవు తరంగపరంపరలచే నొప్పు దాటగూడని నదివలె నొప్పుచున్నావు. నీవిషయాకారముయొక్క బలమును బట్టియే చేతనులకు శ్రీనివాసుడు సమాశ్రితులగు చేతనులకు నేఁటైన నెల్లియైన మహాప్రళయవేళనైన నిజచరణ కైంకర్యప్రాప్తిని గలుగజేయుచున్నాడు. నీయాశ్రయములేక ఎవ్వరికి ముక్తి బొంద నలవి కాదు.

80. అవ. ఇంతవరకు భగవత్పాదమూల ప్రపన్నులవిషయమై తెలుపుచు, నీశ్లోకమున భగవదుపాసనాపరులకు, విషయాంతర స్పర్శనరహితమగు భావనాశక్తి అనగా భగవంతునిపై తలంపు నిశ్చలమై కలుగుటకు భగవద్దయయే కారణ మనుచున్నారు.

శ్లో॥ ప్రణిహితధియాం త్వత్సంపృక్తే వృషాద్రి శిఖామణౌ
ప్రసృమర సుధాధారాకారా ప్రసీదతి భావనా।
దృఢమితి దయే దత్తాస్వాదం విముక్తివలాహకం
నిభృతగరుతో నిధ్యాయంతి స్థిరాశయచాతకాః!

టీ. హేదయే! ప్రణిహితధియాం = ఏకాగ్రచిత్తమున భగవంతు నుపాసింపగోరువారికి త్వత్సంపృక్తే = శర్కరాక్షీరన్యాయమున నీవుగూడినపుడు అనగా నీమహిమచేననుట వృషాద్రిశిఖామణౌ = శేషగిరిశిఖరమున ఇంద్రనీలచూడారత్నమువలె నొప్పు శ్రీనివాసునియందు ప్రసృమర సుధాధారాకారా భావనా ప్రసీదతి = మనోజ్ఞమగు అమృతధారవలె విపులమును అవిచ్ఛిన్నమును ఆనందదాయకము నగు భావనా = ఎడతెగని స్మృతి లేక, చింతన ప్రసీదతి = ప్రసన్నమగుచున్నది. నిర్మలమగు నిశ్చలభావన గల్గుచున్నదని

యర్థము. దృఢం = నిశ్చయము ఈవిషయములో వివాదమునకు చోటులేదు లేక, దృఢం యథాతథా భావనా ప్రసీదతి = దృఢమగుభావన తలంపు లేక, సంతతస్మృతి కలుగుచున్నది; ఇతి = ఈహేతువుచే స్థిరాశయాః =దృఢమగు అధ్యవసాయముకలవారను, చాతకాః = చాతకపక్షులను బోలిన ప్రపన్నులు; నిభృతగరుత స్వన్తః = స్వప్రయత్నము కొంచెమైనలేక (చాతకపక్షమున నిశ్చలమగు అనగా చలింపని రెక్కలు గలవని యర్థము.) దత్తాస్వాదం విముక్తివలాహకం =భావనాశక్తిచే ప్రసాదింపబడిన పరిపూర్ణ బ్రహ్మానుభవముగల ముక్తియనెడు, వలాహకం = తాపహరమగు మేఘమును నిధ్యాయన్తి = ప్రతీక్షించుచుందురు. (చాతకపక్షమున అంతరాళమున రెక్కలుకదల్పక స్వప్రయత్నము మాని ఎప్పుడు మేఘము వర్షించునా యని యెదురుచూచునని యర్థము.) దయైకశరణ్యులగు ప్రపన్నజనులకు గల్గు భగవన్నిరంతరస్మరణము భగవదుపాసనాపరులకును అవిచ్ఛిన్నముగా గల్గుచున్నదని భావము.

మహాస్రగ్ధర॥

తలఁపుల్ నీదివ్యసాంగ♦త్యమునవరసుధా♦ధారలట్లయ్యహీంద్రా
చల చూడారత్నమందున్♦సతతభజనసం♦సక్తిమైఁబొంది పుణ్యా
త్ములు తృప్తిం దాల్తు రిందు♦మ్ముల శుభరసభ్రా♦న్ముక్తి మేఘంబుకై ని
శ్చలవృత్తిన్ వేచి విశ్వా♦సముగలిగిదయా♦చాతకోదార లీలన్॥

తా. దయా! భగవ త్ప్రపత్తిచేసినవారు నిర్మల నిశ్చల భావనాశక్తిచే, మేఘోదకమును చాతక మపేక్షించి నిరీక్షించుచుండునట్లు స్వప్రయత్నములు విడిచి ముక్తి కెదురుచూచెదరు అట్టి సంతతస్మృతి భగవదుపాసకులకు నీవు కలుగజేసి బ్రహ్మానందమనుభవింపజేసెదవు.

81. అవ. ఈక్రింది దశకమున దశావతారములద్వారా దయను స్తోత్రము చేయువారై, దేశికులవారీశ్లోకమున అర్చావతారముచే నైన లోకోపకారమును వర్ణించుచున్నారు.

శ్లో॥ కృపే విగతవేలయా కృతసమగ్రపోషై స్త్వయా
కలిజ్వలన దుర్గతే జగతి కాళమేఘాయితం।
వృషక్షితిధరాదిషు స్థితిపదేషు సానుప్లవై
వృషాద్రిపతివిగ్రహై వ్యపగతాఖిలావగ్రహైః॥

టీ. స్తుతిజనిత శ్రమపరిహారార్థము అమృతాయమానమగు "కృపే" యను సంభోధనపదము పద్యాదియందు ప్రయోగింపబడినది; విగతవేలయా = వేలయనగా కాలము లేక, అవధి అదిలేనట్టి అనగా నిరవధికయు, కృతసమగ్రపోషైః = ఆచరింపబడిన సర్వసంపూర్ణపోషణము గలదానవు నగు, త్వయా = నీచేత (కాళమేఘాయితం అనుటచే కాళమేఘముకూడ ఉత్కూలముగా గట్టుపొరలి ప్రవహించునట్లు నదులను గావించి యంత్రటను సస్యాభివృద్ధిచేసి సర్వజంతువులను పోషించుచున్నది.) వృషక్షితిధరాదిషు స్థితిపదేషు = వృషాద్రిమొదలగు (ఆదియనుటచే హస్తిగిరి, శ్రీరంగము మొదలైన క్షేత్రములు పరిగ్రహము) భగవన్నివాసస్థలములందు ఆవిర్భూతమైన (కాళమేఘమును వృషాద్రిమొదలగు స్వస్థానములందు ఆవిర్భవించి వర్షించును.) సానుప్లవైః, వ్యపగత అఖిలఅవగ్రహైః వృషాద్రిపతి విగ్రహైః సానుప్లవైః = విష్వక్సేనాద్యనుచరసహితములైనవియు (కాళమేఘపక్షమున అనుకూలవాతాదుల సహితమైన), వ్యపగత = వీడిన, అఖిలఅవగ్రహైః = ఆశ్రితనిగ్రహమును గలవియు (కాళమేఘపక్షమున వర్షప్రతిబంధకముచే గల్గు సర్వోపద్రవరహితమనియర్థము.) 'అఖిల' యనుటచే మహాపరాధులకునైన నిగ్రహ మెంతమాత్రము లేదని సూచింపబడినది; అట్టి

వృషాద్రిపతివిగ్రహైః శ్రీనివాసుని దివ్యమంగళవిగ్రహములచేత, కలిజ్వాలనదుర్గతే జగతి = కలిపురుషుడను అగ్నిచే భాధితమగు లేక దుర్దశను బొందిన జగతివిషయే = జగమునందు కాళమేఘాయితం = కాళమేఘమువలె నాచరింపబడినది. అష్టోత్తరశత దివ్యస్థానములందు భగవంతుడు దయాప్రేరితుడై యావిర్భవించుటచే కాళమేఘముయొక్క గుణములుగల యతనిదివ్యమంగళవిగ్రహములు కలిప్రచారమున బాధనొందిన జగజ్జనములను సుఖింపజేయుచున్నవని భావము. దీనిచే కలియుగమున అర్చావతారముల ఆశ్రితానుగ్రహవిశేషమహిమ ప్రకాశింప బడినది. కలియుగమున జనులు క్షీణశక్తి బలారోగ్య బుద్ధులు గలవారగుటచే వారెక్కువగా దయనీయు లగుచున్నారనియు, సేవాదులచే కృతార్థు లగుదురనియు భావించి, దయాళువగు శ్రీకాంతుడు శ్రీవైకుంఠమును బరిత్యజించి, సానుచరుడై వృషగిరిప్రముఖ దివ్యక్షేత్రములం దావిర్భవించెనని ఫలితార్థము. అలంకారము శ్లేషతోగూడిన వాచకలుప్తోపమ.

మందాక్రాంత॥

> ప్రాఙ్నిమ్నేఘ ♦ ప్రచురరుచితో ♦ పన్ రమేశానుకంపా
> దేవున్ దివ్య ♦ స్థితపదములన్ ♦ దెచ్చి సానుప్లవుండై
> నీ వేనెమ్మిన్ ♦ నిలిపి జగముల్ ♦ నిహ్ను తానుగ్రహంబై
> కావన్ గాదే ♦ కలిదహనుచేఁ ♦ గ్రాఁగి చేటొందకుండున్॥

తా. దయా! అవధిలేని ప్రభావముగల్గు సర్వపోషకురాలగు నీవు కలిదహనునిచే సంతాపితమగు జగమునకు సౌఖ్య మాపాదింపగోరి, భగవంతుని వేంకటాద్రి మొదలగు దివ్యప్రదేశములందు నర్చావతారవిగ్రహుడై యవతరింపజేసినందున ఆవృషగిరినాథుని

విగ్రహములద్వారా కాళమేఘముయొక్క కృత్యము నీచే నాచరింపబడినది.

82. అవ. కేవల మర్చారూపమున శ్రీనివాసుని దివ్యదేశములం దవతరింపజేయుటయే కాక మత్స్య కూర్మా ద్యవతారము లచేతను లోకోపకారము చేసియున్నా వనుచున్నారు. మత్స్య కూర్మ హంసావతారము లిందు వర్ణితము.

శ్లో॥ ప్రసూయ వివిధం జగ త్తదభివృద్ధయే త్వం దయే
సమీక్షణవిచింతనప్రభృతిభి స్స్వయం తాదృశైః ।
విచిత్రగుణచిత్రితాం వివిధదోషవైదేశికీం
వృషాచలపతే స్తనుం విశసి మత్స్యకూర్మాదికాం॥

టీ. హేదయే! వివిధం జగత్ = దేవ తిర్యఙ్మనుష్య స్థావరాత్మకమగు జగంబులను, లేక సత్యలోకాది భేదములచే ననేకమైన భువనములను, ప్రసూయ=పుట్టించి (ప్రసూయ యనుటచే దయ జగంబులకు జననివంటిదని సూచితము; సృష్టి భగవద్దయాకార్యమనుట,) తదభివృద్ధయే = అట్లు కలిగించిన లోకముల యొక్క అభివృద్ధికొఱకు, తాదృశైః = అభివృద్ధికి హేతువగు అచింత్యమైనదివ్యశక్తులుగల, సమీక్షణవిచింతనప్రభృతిభిః-సమీక్షణ= స్వాపత్యము సమీపమున నిల్చి దానినిచూచుటయును, విచింతన= ఎందేని నిల్చి స్వాపత్యమును మనమున దలచుటయు, ప్రభృతిభిః= మొదలగు క్రియలచే (దీనివలన స్వార్భకమును ఱెక్కలతో గప్పి స్పర్శించి వృద్ధిచేయుట తెలుపబడమైనది. "ఈక్షణ ధ్యానసంస్పర్శైః మత్స్య కూర్మ విహంగమాః । పుష్ణంతి స్వా న్యపత్యాని తథాహమపి పద్మజే" అనురీతి మత్స్యములు తమపిల్లలను నిరీక్షణముచేతను, కూర్మము ధ్యానించుటచేతను, పక్షులు హంసాదులు గ్రుడ్లను స్పృశించుటచేతను వర్ధిల్లునట్లు చేయు చున్నవి. అట్లు భగవంతు

మును తాను సృజించిన జగములను సమీక్షణ ధ్యాన స్పర్శక్రియ లచే వర్ధిల్లజేయు నిమిత్తము దయాప్రేరితుడై మత్స్య కూర్మ హంసావతారములు ధరించెనని భావము ఆ మత్స్యకూర్మాది దివ్య శరీరము లెట్టివని తెలుపుచున్నారు; విచిత్రగుణచిత్రితాం = అత్యద్భుతమగు ప్రాకృత మత్స్యాది దుర్లభములగు జ్ఞానశక్త్యాది గుణములచేతను, సౌందర్య సౌగంధ్య సౌకుమార్యాదులగు శరీరగుణములచేతను ముద్రితమైనదియు, వివిధదోషవైదేశికీం = దుర్గంధాది బహువిధ దోషరహితమైనదియు నైన, మత్స్య కూర్మాదికాం = మత్స్య కూర్మ హంస శరీరములందు, వృషాచలపతేః తనుం = శ్రీవేంకట గిరినాథునిశరీరమును, స్వయం విశసి = నీవే స్వయముగా ప్రవేశింపజేసెదవు; అనగా అట్టిఅవతారములు భగవంతుని నీవుధరింపజేసితి వని భావము.

మందాక్రాంత॥

చిత్రస్ఫూర్తిన్ ♦ జెలఁగ జగముల్ ♦ సృష్టి గావించి వానిన్
మైత్రిన్ వీక్షా ♦ ప్రముఖవిధులన్ ♦ మన్పఁ గాంక్షించి దేవీ
చిత్రాకారాం ♦ చితశుభగుణా ♦ శ్లిష్ట మత్స్యాది శుంభ
ద్గాత్రంబుల్ వేం ♦ కటగిరిపతిన్ ♦ గైకొనం జేసి తీవే॥

తా. విచిత్రములైన బహువిధలోకములను సృష్టింపజేసి వానిని మనిచి పెంచునిమిత్తము భగవంతుని మత్స్య కూర్మాది దివ్యావతారము లెత్తునట్లు గావించి, నిరీక్షణ ధ్యాన స్పర్శన వ్యాపారములచే ప్రసూతజగముల అభివృద్ధి నొందజేసెదవు.

83. అవ. పైశ్లోకమున మత్స్యకూర్మావతారములు వర్ణించి క్రిందిపద్యమున భగవంతుని వరాహావతారముచేనైన దయాకార్యమును దెల్పుచున్నారు.

శ్లో॥ యుగాంతి సమయోచితం భజతి యోగనిద్రారసం
వృషక్షితిభృదీశ్వరే విహరణక్రియా జాగ్రతి।
ఉదీర్ణ చతురర్ణవీ కదనవేదినీం మేదినీం
సముద్ధృతవతీ దయే తదభిజుష్టయా దంష్ట్రయా॥

టీ. యుగాంతసమయ ఉచితం = బ్రహ్మయొక్క చతుర్యుగ సహస్రాంతమున కలుగు దివసాంతసమయమునందు పరిచితమైనట్టి, యోగనిద్రారసం = నాగభోగపర్యంకమున యోగరూపమగు జగద్రక్షణ చింతనరూపమైన, నిద్రారసమును = నిర్వ్యాపార శయనమును, భజతి = పొందుచున్న, వృషక్షితిభృత్ ఈశ్వరే విహరణ క్రియాత్ జాగ్రతి సతి = శ్రీవేంకటేశ్వరుడు చతుర్ముఖ దినావసానసమయమున జాగరణమును మేలుకొనుటను బొందుచుండగా, ఉదీర్ణచతురర్ణవీ కదనవేదినీం = ప్రవృద్ధములైన చతుస్సాగరముల యొక్క పీడను భగవంతునకు నివేదించు అనగా దాను ప్రళయార్ణవమగ్నయగుటను తెలుపు, మేదినీం = భూదేవిని, తదభిజుష్టయా దంష్ట్రయా = ఆమహావరాహరూపియగు శ్రీవేంకటపతియొక్క కోఱపంటిచే (త్వం = నీవు,) సముద్ధృతవతీ = పైకి లేవనెత్తజేసితివి. అనగా నీకు సపత్నియగు పృథ్విని మునిగిపోవక ఆపత్సమయమున నుద్ధరించితివి. భగవంతుడు దయావిధేయుడై క్రోడరూపమున ప్రళయసాగరమగ్నయగు పృథ్విని సగిరికాంతారముగా నొక్కకోఱచే పైకి లేవనెత్తెనని భావము.

మందాక్రాంతా॥

కల్పాంతంబున్ ♦ గని జలధిపై ♦ గాంచి తా యోగనిద్రన్
కల్పాదిన్ వేం ♦ కటవిభుడు మే ♦ ల్కాంచుచో నీవ దేవీ
తెల్పన్ గాలా ♦ బ్ధి మునిఁగిన పృ ♦ థ్విన్ ఘనుం డుద్ధరించెన్
బ్రాల్పొందంగాఁ ♦ బొడమి కుహనా ♦ పోత్రియై యొక్కకోఱన్॥

తా. దయా! బ్రహ్మదేవునకు ఒక్కపగలు నిండగా సము ద్రముపై నాగపర్యంకమున యోగనిద్రలోనున్న శ్రీవేంకటేశ్వరుడు, తిరిగి బ్రహ్మదేవునియొక్క రాత్రి ముగిసి దినారంభమైనపుడు మేలుకొనగా, నీచే ప్రేరితుడై నీసపత్నియగు భూదేవిని ప్రళయ సాగరమున మునిగిపోకుండునట్లు, దివ్యవరాహరూపముతో బొడమి తనయొక్క దంష్ట్రిచే బట్టి పైకెత్తెను.

84. అవ. అంత క్రమప్రాప్తమగు శ్రీనృసింహావతార ప్రసం గమున భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదుని లాలించుటయే దయాకా ర్యముగ వర్ణించుచున్నారు.

శ్లో॥ సటాపటలభీషణే సరభసాట్టహాసోద్భటే
స్ఫురత్క్రుధిపరిస్ఫుట భృకుటికేఽపి వక్త్రే కృతే।
దయే వృషగిరీశితు ర్దనుజడింభ దత్తస్తనా
సరోజసదృశా దృశా సముదితాకృతి ర్దృశ్యసే॥

టీ. హేవృషగిరీశితుః దయే! = వృషాద్రినధిష్ఠించిన శ్రీవై కుంఠనాథుని దయా; సటాపటలభీషణే=జూలు వెంట్రుకలసమూ హముచే నతిభయంకరముగను, సరభస అట్టహాసోద్భటే = వేగ ముతోగూడిన అట్టహాసముల ధ్వనులచే అత్యుద్ధతముగను, పరిస్ఫుట భృకుటికే = అతివ్యక్తముగా గనుపడు బొమముడి గల్గునట్లు, వక్త్రే స్ఫురత్క్రుధికృతేఽపి = ముఖమునందు అతితీక్ష్ణకోపమును ప్రకటిం చినను, 'అపి' అనుటచే ఆసమయమునందే విరోధము దర్శితము. అట్టి రౌద్రావేశమును జూపు సందర్భమున, సరోజసదృశా దృశా= తామరపువ్వును బోలు వృషగిరిపతికంటితో (అనగా హిరణ్యవధా ర్థము ముఖమునందు కోపోద్రేకము కనబడినను ప్రహ్లాదునివిషయమై వాత్సల్యాతిశయమున శీతలమగు పద్మారుణనయనముచేత), దనుజ

డింభదత్త స్తనా=కరుణాకటాక్షావలోకనమున స్తన్యపానముచే శిశువును దృప్తిచేయునట్లు రాక్షసబాలుడగు ప్రహ్లాదున కానందమును గల్గజేసిన నీవు, సముదితఆకృతిః దృశ్యసే=సంపూర్ణమగు నీయొక్క స్వరూపమును లోకులెల్ల గనునట్లు ప్రకటించితివి. డింభకవిషయ వాత్సల్యాతిరేకమును స్వామియొక్క దివ్యామల కోమలావలోకనమున, హిరణ్యకశిపునకై పూనిన క్రోధావిర్భావ సమయమునందే కనుపఱచితివని తాత్పర్యము. ఒకనేత్రముచే స్వామి హిరణ్యకశ్యపుని దహించినను, రెండవకన్నుచే ప్రసన్నతను దెల్పి ప్రహ్లాదుని లాలించెను. భగవత్కటాక్షమును శిశుతోషణకరమగు స్తన్యపానమునకు సమముగా జెప్పఁబడినది. అందుచే ప్రహ్లాదునివిషయమై 'డింభ' శబ్దము ప్రయోగింపబడినది. క్రోధకరుణారసములు రెండును సమకాలీనములై కల్గుట"ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ కరుణారస రౌద్రావేశపరిపూర్ణుఁడు" అను పోతనగారి, భాగవతములోని వాక్యమునందును జూచునది.

మందాక్రాంతా॥

క్రోధస్ఫూర్తిన్ ♦ భ్రుకుటియు సటా ♦ రూక్షదంష్ట్రాదు లొప్పన్
నాథుం డుగ్రా ♦ ననుఁడయి హిర ♦ ణ్యప్రహారార్థి యైనన్
సాధున్ బాలున్ ♦ సదమలసుధా ♦ సారసంవాదవీక్షా
మాధుర్యశ్రీ ♦ మనిచి తనుకం ♦ పా తతిన్ దోఁచిసీవే॥

తా. దయా! హిరణ్యవధనిమిత్తము శ్రీవేంకటనాథుఁడు నృసింహుడై భయంకరముగ మెడమీఁది వెండ్రుకలచేతను, బొమముడిపాటుచేతను, అట్టహాసముల చేతను ముఖమున కోపావేశమును జూపుసందర్భమున, ప్రహ్లాదరక్షణమునందు జాగరూకతగల నీవు, స్వామి శీతలాపాంగములచే ప్రహ్లాదబాలునియెడ వాత్సల్యమును

బ్రికటించి స్తన్యపానముచే శిశువును పోషించినట్లు ఆ దనుజడింభకుని రక్షించితివి.

85. అవ. ఇట్లు నృసింహావతారమున ప్రహ్లాదలాలనము దయాకార్యముగ నిరూపించు హరి వామనుడై నపుడు జగత్క్రాంతుడై సర్వచరాచర వస్తుజాతములను నిజచరణారవిందములచే స్పర్శించునట్లు చేయుట దయాకృతకార్యమని తెల్పుచున్నారు. బలినిగ్రహాదికములు అవాంతరకార్యములు ప్రధానమైనవి కావు. సర్వశ్రేయోదాయకములగు భగవచ్చరణారవింద నివేశనమే ముఖ్యమగు దయాకృత్యము.

శ్లో॥ ప్రసక్త మధునా విధిప్రణిహితై స్సపర్యోదకై
స్సమస్తదురితచ్ఛిదా నిగమగంధినా త్వం దయే।
అశేషమవిశేషత స్త్రిజగ దంజనాద్రీశితుః
చరాచర మచీకర చ్చరణపంకజే నాంకితం॥

టీ. హేదయే! విధిప్రణిహితైః=బ్రహ్మచే సమర్పింపబడిన, సపర్యోదకైః = పాద్యజలములచే (త్రివిక్రమావతారమున సత్యలోకపర్యంతము పైకి ఎత్తిన భగవచ్చరణారవిందమును పాద్యజలములచే బ్రహ్మ పూజించెనని పౌరాణికకథ.) ప్రసక్తమధునా = సంపన్నమకరందమువలె మనోజ్ఞమైనవాడును, సమస్తదురితచ్ఛిదా= నిజపాదసలిలమయమగు గంగచే సమస్తపాపములను ఛేదించువాడును, నిగమగంధినా = శ్రుతిపరిమళముచే నొప్పువాడును "త్రీణి పదా విచక్రమే విష్ణు ర్గోపాఅదాభ్యః। ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధేపదం॥" ఇత్యాది శ్రుతివాక్యములచే ప్రతిపాదింపబడిన వైభవము గలవాడనుట, అట్టి అంజనాద్రీశితుః = త్రివిక్రమరూపధారియగు శ్రీనివాసునియొక్క, చరణపంకజేన = పాదకమల

ముచే (దీనిచే చరణసుఖస్పర్శనము వ్యంజితము.) అశేషతః=అంత టను, చరాచరం త్రిజగత్ = జంగమస్థావరమయమగు స్వర్గమధ్య పాతాళము లనబడు మూడుజగంబులును, అంకితం=ముద్రితమగు విధమున, అచీకరత్ = చేసితివి. కొఱతలేక చరాచర భూతజాలము లన్నిటిని భగవచ్చరణకమలముచే స్పర్శింపజేసి సర్వమును పావనమగునట్లు కావించితివి. వీరు పాపులు వీరు పుణ్యులనక అందఱకు భగవత్పాదకమలస్పర్శనము గల్గునట్లు చేయుట దయాకృత్య మనుట.

మందాక్రాంతా॥

సర్వస్రష్ట్రా ♦ చరితపదపూ ♦ జా జలోద్ధూతపాపుఁ
ఖర్వుండై వేం ♦ కటవిభు జగ ♦ త్క్రాంతుఁ వీక్షించి దేవుఁ
సర్వంబుఁ ద ♦ చ్చరణకమల ♦ స్పర్శచేఁ భావితంబై
పర్వఁ గాన్పిం ♦ పవె దయ! భవ ♦ త్పాలనం బేర్పడంగఁ॥

తా. ఓదయా! బలిచక్రవర్తిని నిగ్రహించుటకై శ్రీవేంకటగిరినాథుడు వామనుడై యవతరించి, త్రివిక్రముడై సత్యలోకపర్యంత ముంచిన పాదకమలమును బ్రహ్మదేవుడు పాద్యవిధిచే పూజించెను. ఆపూజాజలముచే సమస్తలోకముల పాపమును హరించు స్వామి యొక్క చరణకమలస్పర్శచే సర్వ చరాచర జంతుసముదాయము లన్నియు పావనత్వ మొందునట్లు నీవేకదా చేసితివి. దానిచే నీపరిపాలనక్రమము మాకు స్పష్టమగుచున్నది. దయానియుక్తుడై భగవంతు డట్లు చేసెనని యర్థము.

86. అవ. హరి పరశురామావతారమున ఇరువదొక్కమాఱు దుష్టమనుజపతుల దునుముట క్రోధకార్యమైనను, తాదృశ పాపాత్ములగు నరపతులను గూల్చుట యాగీయపశుహింసనమువలె

వారికి శ్రీయోదాయుక మగుటచే నిహతిరూపమగు రక్షణము దయాకార్యమని తెల్పుచున్నారు.

శ్లో॥ పరశ్వథ తపోధన ప్రధన సత్క్రితూపాకృత
క్షితీశ్వర పశుక్షరత్ క్షతజ కుంకుమ స్థాసకైః।
వృషాచలదయాళునా సను విహర్తు మాలిప్యథా,
నిధాయ హృదయే దయే నిహతరక్షితానాం హితం॥

టీ. హే దయే! పరశ్వథతపోధన = పరశుధరముని యని ప్రసిద్ధినొందిన జామదగ్నియొక్క, ప్రధనసత్క్రితు = యుద్ధమను యజ్ఞమున, ఉపాకృత=హింసార్థము యూపస్తంభమున కట్టబడిన, క్షితీశ్వర = అతిపాపప్రసక్తిగల రాజులనే, పశుక్షరత్ = పశువుల శరీరమునుండి కారుచున్న, క్షతజకుంకుమస్థాసకైః = నెత్తురను కుంకుమపూతలు లేక రచనలచే, (అలంకారార్థము), నిహతరక్షితానాం హితం = చంపుటయే రక్షణరూపముగా గల వారియొక్క, హితం = మేలును; తిరిగి పాపవృత్తియందు చొరకుండుటను, హృదయే నిధాయ=మనమున భావించినదానవై, వృషాచలదయాళునా = దయాళువైన శ్రీనివాసునితోగూడి, విహర్తుం=విహరించుటకు క్రీడించుటకై యనుట, ఆలిప్యథాసను = ఆలేపన మొనరించుకొంటివా యేమి? పాపాత్ములగు దుష్టక్షత్రియుల శరీరరక్తమును కుంకుమతో బోల్చుట. హననరూపమగు రక్షణమును బొందిన రాజులయెడ దయయొక్క వాత్సల్యము ప్రకటితము. 'పరశ్వథతపోధన' యనుటచే పరశురాముని యుద్ధార్హత్వ సామగ్రియు, యజ్ఞోచిత పుణ్యప్రవృత్తి సంపత్తియు దెలుపుచున్నవి. పరశురాముని శౌర్యవీర్యాదులను జూడ క్షుద్రినృపతులు పశుప్రాయులే కావున వారిని యాగపశువులుగా నిరూపింపబడినది. వృషాచల

దయాళునా యనుటచే శ్రీపతి దయాప్రేరితుడై శేషాద్రిని చేరు టయు "త్వయా దయాళుః" అన్నట్లు దయాసంబంధమున శ్రీని వాసుడు కృపాళు వయ్యెననియు సూచితము. దుష్టక్షత్రియులను గూల్చుటచే అనివర్త్య పాపప్రసక్తిగల హిరణ్యరావణాదుల బోలు రాజుల హననమే వారికి శుభోదర్క మైనదనియు, అందుచేతనే వారిశరీరరక్తము కుంకుమపూతలవలె దయకు భోగ్యమైనదనియు నెఱుగవలయు

మందాక్రాంతా॥

రోషాత్కుంఠై • దురితగతి నృప • ద్రోహులన్ క్షత్రవంశ
ద్వేషుం డయ్యెం • దెగనఱకఁ • దేహరక్తోరుధారల్
దోషోన్ముక్తిన్ • ద్రుటితులు గనన్ • దోఁచెసంలేపనంబై
శేషాద్రీశుక్ • జెలువుగ దయా • చేరి క్రీడించు నీకున్॥

తా. దయా! చేగొడ్డలిచే జంపి యుద్ధయజ్ఞాగ్నులందు ఇరు వదొక్కమాఱు క్రూరులగు రాజులనే యాగపశువులను వృషాద్రి నాథుడు పరశురాముడై వ్రేల్చగా, అట్లు కూలిన రాజులహితమును కాంక్షించిన నీవు, వారి శరీరరక్తధారలను కుంకుమపూతలుగా స్వీక రించుటను జూడ వృషగిరినాథునితో గ్రీడించుటకా యని తోచు చున్నది.

87. అవ. ఇక శ్రీరామావతారముచేసైన కృపాకార్య మును వర్ణించుచున్నారు.

శ్లో॥ కృపే కృతజగద్ధితే కృపణజంతుచింతామణే
రమాసహచరం తదా రఘు ధురీణయన్త్యా త్వయా।
వ్యభజ్యత సరిత్పతి స్సకృదవేక్షణా త్తత్క్షణాత్
ప్రకృష్టబహుపాతక ప్రశమహేతునా సేతునా॥

టీ. హేకృపే! ఇత్యాది సంబోధనలచే దేశికులవారు శ్రీరామగుణావిద్ధహృదయులై తదవతారమునకు హేతుభూతమగు దయను రంజింపచేయుచున్నారు ; కృతజగద్ధితే=అనేకవిధములుగా నాచరించిన లోకోపకారకృత్యములు గలదానా! కృపణజంతుచింతామణే = దీనజనులకు వాంఛితఫలములు సమకూర్చుదానా ! రమాసహచరం = లక్ష్మీసహచరుడగు శ్రీనివాసుని, తదా = లోకములకు రావణాసురునిచే నుపద్రవములు గల్గినట్టి యాపత్సమయమున, రఘుధురీణయన్త్యా త్వయా = రఘుశ్రేష్ఠుడై యవతరింపచేయు నీచేత, సకృత్ అవేక్షణాత్ = ఒకమాటు కనుగొనటచేత, తక్షణాత్ = కాలవిలంబములేక అప్పుడే; ప్రకృష్ట బహుపాతక ప్రశమహేతునా = శమింపజేయబడిన ఘోర మహా పాపములుగల, సేతునా = నలసేతువుచే, సరిత్పతిః సముద్రము, వ్యభజ్యత = రెండుగా జేయబడెను. " యత్పురా పాపదశక చ్ఛేదసాధనతాం గతః । స సేతు ర్న కథం శక్తః పాపపంచకభంజనే. " పాపదశకంధరుని వధార్థము నిర్మింపబడిన సేతుదర్శనమాత్రమున పంచమహాపాపములు తొలగుటచే, అట్టి సేతుబంధనమే కేవలము దయాకృత్యము. రావణాదిరాక్షసవధ ఆనుషంగికఫలములుగా నెఱుంగవలయు. రాముడు 11000 సం॥ రాజ్యపరిపాలనము చేసెను. అతనిచే నిర్మింపబడిన సేతువు ఆకల్పస్థాయియై చూచువారల పాపములను హరించుచున్నది కావున, దీనినే ముఖ్యమగు రామావతారదయాకృత్యముగా నిరూపింపబడినది.

మందాక్రాంతా॥

శ్రీమంతుం డా ♦ శ్రితహితుడు నీ ♦ చేఁ గృపా ప్రేరితుండై
రాముండై యు ♦ ర్వరను నవతా ♦ రంబు గావింపఁగా వీ

జూమాత్రక ద ♦ క్షణము పటుదో ♦ షఘ్నమహా సేతు చేతక
భూమిక రెండై ♦ పొలుపుఁగనె నం ♦ భోనిధానుండు దేవీ॥

తా॥ ఓదయా! నీచే నియుక్తుడై శ్రీనివాసుడు రఘువంశ తిలకుడగు శ్రీరాముడై పృథ్విలో నవతరించుటచేత, ఒక్కసారిచూచుట మాత్రమున పంచమహాపాతకములను దక్షణమే హరించునట్టి సేతువుచేత సాగరుడు రెండుగా విభజింపబడెనుగదా! సేతుబంధనమే రామావతార ముఖ్యదయాకృత్యము.

౪౪. అవ. పరిపూర్ణుడును అవాప్తసర్వకాముడునైన లక్ష్మీవల్లభుడు బలరాముడై క్రీడించుటల్లను జూడగా దయాప్రేరితుడై లోకముల హితముకొఱకే యట్లు విహరించె ననుచున్నారు.

శ్లో॥ కృపే పరవత స్త్వయా వృషగిరీశితుః క్రీడితం
జగద్ధిత మశేషత స్తదిద మిద్ధ మర్థాప్యతే ।
మదచ్ఛల పరిచ్యుత ప్రణత దుష్కృత ప్రేక్షితై
ర్హత ప్రబలదానవై ర్హలధరస్య హేలాశతైః॥

టీ. హేకృపే! త్వయాపరవతః = నీకు విధేయుడై వర్తించు, వృషగిరీశితుః క్రీడితం = బలభద్రుడై యవతరించిన వృషగిరినాథునియొక్క వ్యాపారములు, అశేషతః = అంతటను, జగద్ధితం = లోకములమేలుకొఱకేయని, ఇదమిద్ధం అర్థాప్యతే = విస్పష్టముగా ప్రకాశితము లగుచున్నవి. ఆబలదేవుని లీలావ్యాపారములెట్టివనిన దెల్పుచున్నారు; హతప్రబలదానవైః = కూల్పబడిన ప్రలంబాసురుడు మున్నగు రాక్షసులనుగలవియు, మదచ్ఛల = మధుపాన జనిత మదవ్యాజమున, పరిచ్యుత ప్రణతదుష్కృత ప్రేక్షితైః = విడువబడిన ఆశ్రితజనములయొక్క దోషదర్శనమును గలవియునైన, హలధరస్య = బలరామునియొక్క, హేలాశతైః = అనేక

లీలావ్యాపారములచే, అర్థాప్యతే = జగద్ధిత పర్యవసానములగుట స్పష్టము. ఆశ్రితులయొక్క దోషములను జూడకుండుట దుష్టాత్ములగు దుర్యోధనాదులవిషయమై కనబడుచున్నది. ప్రలంబ వధయు కాళిందీకర్షణమును లోకహితముగా నాచరింపబడిన కృత్యములు. ఇట్లే బలదేవుడు లోకహితార్థమై దయకు విధేయుడగుచు వర్తించెనని భావము.

మందాక్రాంతా॥

కాళిందీని ♦ గ్రహుఁడయి వృష ♦ క్ష్మాధరాధీశుఁ డుర్వీ
లీలన్ దైత్యా ♦ ళిని దునిమి వి ♦ క్లేశుఁడై పానమోహ
వ్యాలోలాత్ముం ♦ డయి మెలఁగుటల్ ♦ యాశ్రితాఘానవేక్షన్
బాలింపన్ దవ్వ ♦ త్పరతజగముల్ ♦ స్పష్ట మీయర్థ మంబా॥

తా. దేవీ! దయా! వృషగిరినాథుడు నీకు వశుడై భూమిపై బలరాముడై యవతరించి ప్రలంబాసురుని జంపి, కాళిందీనదిని ప్రవహింపకుండ నిగ్రహించి మరుభూమిలో ప్రవహింపజేసి, మధుపాన మోహాభినయముచే తన్నాశ్రయించినవారి పాపములను జూడకుండునట్లు విహరించు తెల్లను జూడగా, యమ్మహాత్ముని లీలావిహారములు సర్వము లోకోపకారార్థమే యని మాకు స్పష్టముగా గనబడుచున్నవి.

89. అవ. అంత కృష్ణావతారప్రసంగమున గీతాజ్ఞానోపదేశము దయాకార్యముగా తెలుపుచున్నారు. ఇతర జగదుపకారకృత్యము లానుషంగికములు.

శ్లో॥ ప్రభూత దివిజద్విష ద్భరణ భిన్న విశ్వంభరా
భరాపనయనచ్ఛలా త్త్వ మవతార్య లక్ష్మీధరం।
నిరాకృతవతీ దయే నిగమసౌధదీపశ్రియా
విపశ్చి దవిగీతయా జగతి గీత యాంధంతమః॥

టీ. హేదయే! ప్రభూత = ఎక్కువగు, దివిజద్విషద్భరణ= దేవశత్రువులగు (రాక్షసాంశమున బుట్టిన) క్షత్రియులను భరించుటచే, ఖిన్న = విషణ్ణయగు, విశ్వంభరా = భూమియొక్క (విశ్వము లను దాల్చుశక్తిగల్గినను భూదేవికి భగవత్సంశ్రిత విరోధులను భరించుట కష్టమని విశ్వంభరా శబ్దముచే సూచితము) భర అపనయనచ్ఛలాత్ = భారమునుబోగొట్టు నెపమున, త్వం = నీవు, లక్ష్మీధరం= శ్రీరమణుని, అవతార్య= వసుదేవగృహమునను నందగోపకులమునందును కృష్ణుడై యవతరింపజేసి, (లక్ష్మీధరం అనుటచే ఉరస్స్థిత లక్ష్మితో నవతారమనిసూచితము.) నిగమసౌధదీపశ్రియా=వేదాంతమను పెద్దరాజభవనముపై నెత్తిన దీపకాంతిని బోలినదియు, విపశ్చిదవిగీతయా గీతయా = సర్వదేశసర్వకాలములందు సర్వప్రాజ్ఞులచే నభినందింపబడు, వేదోపబృహ్మణ రూపమగు భగవద్గీతలజ్ఞానముచే, జగతి = సర్వలోకముల నావరించిన, అంధంతమః = అజ్ఞానము లేక మోహమను చీకటిని, నిరాకృతవతీ = నిరసింపజేసితివి తొలగించితివి. పెద్దమేడపై నెత్తినదీపము నాల్గువైపులను కాంతులచే చీకట్లను బాఱదోలునట్లు ధర్మాధర్మధియాకులుడై ధర్మయుద్ధపరాఙ్ముఖుడైన పార్థున కుపదేశించిన గీతలచే, అజ్ఞానాంధకారములను దొలగజేసితివని భావము. ఇంతకంటె గొప్పదియగు దయాకార్యము లేదని యర్థము.

మందాక్రాంతా॥

హీనుల్ దేవా ♦ హితు లవనిపుల్ ♦ హింసగావింపఁ బృథ్వీ
దీనావస్థన్ ♦ దెలిసి భరమున్ ♦ దీర్ప శ్రీశున్ యశోదా
సూనుం జేయన్ ♦ సారిది విబుధ ♦ స్తుత్యగీతోపదిష్ట
జ్ఞానశ్రీచే ♦ జగములు తమ ♦ స్వ్యక్తమై వెల్గు దేవీ॥

తా. ఓదయా! నీవాలక్ష్మీధరుడైన శ్రీనివాసుని, వేదబ్రాహ్మణ హింసాపరులును భగవదాశ్రితవిరోధులునగు కంసాదిభూపతులచేనైన జగత్పీడను నివర్తించునెపమున, శ్రీకృష్ణుడై నందగోపకునియింట నవతరింపజేసి, వేదాంతసారభూతమైన గీతోపదేశకృత్యముచే, లోకముల నావరించిన యజ్ఞానమను చీకటిని తొలగునట్లు చేసితివి. "కృత్వా భారావతరణం పృథివ్యాః పృథులోచన! మోహయిత్వా జగత్సర్వం గత స్స్వస్థాన ముత్తమం॥" అను విధమున శిష్టరక్షణ దుష్టశిక్షణ రూపములగు పెక్కు అవతారకృత్యములచే జగదుపకారములు గావించినను వానియన్నిటిలో సర్వోపనిషత్సారమగు గీతామృతము నిచ్చుటయే మహోపకారకృత్యమని భావము.

90. అవ. తర్వాత వృషగిరినాథునియొక్క రాబోవు కల్క్యవతారమునందలి దయాకృత్యమును దెల్పుచున్నారు.

శ్లో॥ వృషాద్రి హయసాదినః ప్రబలదోర్మరుత్ప్రేంఖిత
స్త్విషా స్ఫుట తటిద్గుణ స్త్వదవసేక సంస్కారవాన్ ।
కరిష్యతి దయే కలిప్రబల ఘర్మనిర్మూలనం
పునః కృతయుగాంకురం భువి కృపాణధారాధరః॥

టీ. హేదయే! వృషాద్రిహయసాదినః = వృషభాద్రిపై నెలకొన్న శ్రీనివాసుడను అశ్వారోహకుని లేక గుఱ్ఱపురాతుయొక్క (కల్క్యవతారమున భగవంతుడు తురగవాహనుడై, చేతిఖడ్గమున మ్లేచ్ఛాది పాపభూయిష్ఠ నరులను జంపి, కలిదోషము లడంచి, మఱల కృతయుగధర్మము నాల్గుపాదములు పూర్తిగా ప్రవర్తిల్లునట్లు చేయునని పురాణప్రసిద్ధి. ఈశ్లోకమున నాకల్కిరూపుడగు శ్రియఃపతియొక్క చేతికృపాణమును వార్షుకమేఘముతో రూపింపబడినది.) ఆరాతుయొక్క, ప్రబలదోర్మరుత్ప్రేంఖితః = బలముగల బాహువులను వాయువుచే చలింపబడి (మేఘమున్ను ప్రబలవాయువుచే

చలించి యిష్టమైనట్లు వర్షించును.) త్విషా స్ఫుటతటిద్గుణః = స్వకీయ తేజస్సుచే ప్రకటింపబడిన మెఱుపుయొక్క కాంతిగలదియు, అనగా పరమాత్ముని శరీరకాంతిని ఖడ్గమనుమేఘము మెఱుపుగా గల్గియున్నదనుట; త్వదవసేకసంస్కారవాన్ = నీచే తడుపబడు టను సంస్కారముగా గల్గినదియు, అనగా అగ్నితప్తమైన శస్త్రాదులు నీళ్లచే తడుపబడి సాద్గుణ్యప్రాప్తిని పొందువిధమున పరమాత్ముని చేతికత్తియు దయాసాంగత్యముచే కార్యానుకరత్వమును బొందినదని భావము. అట్టి, కృపాణధారాధరః=ఖడ్గమనుమేఘము, కలిప్రబల ఘర్మనిర్మూలనం = కలిపురుష కింకరభూతులైన మ్లేచ్ఛ యవన బర్బరాది క్రూరజనులచే గల్గు జగత్పీడనమను వేసవికాల తాపమును దొలగించుటయును, పునః కృతయుగాంకురం = మఱల కృతయుగధర్మమను మహావృక్షముయొక్క అంకురమును లేక మొల కెత్తుటను, భువి = భూమియందు, కరిష్యతి = చేయగలదు. అలం కారము సావయవరూపకము.

మందాక్రాంత॥

> రాతౌ యా స ♦ ర్పగిరివిభు దో ♦ ర్వాత సంచాలితంబై
> హేతిన్ విద్యు ♦ త్స్ఫురితరుచియుం ద్వ ♦ ద్పృష్టిసిక్తంబు నొంచున్
> మాతా! పృథ్విన్ ♦ మలినకలిసం ♦ బంధతాపంబు దీరన్
> ఖ్యాతిన్ ధర్మ ♦ క్రమ మెసుగం ద ♦ త్ఖడ్గమేఘంబు సేయున్॥

తా. దయా! కలియుగాంతమున కల్కియై యవతరించు శ్రీమహావిష్ణువుచేతిలోని ఖడ్గమను మేఘము, అతనిచేతుల బలమను మహావాయువుచే చలింపబడి, అతని శరీరకాంతులను మెఱుపుగా గల్గి నీయొక్క చల్లని సాంగత్యముచే సంస్కరింపబడినదియు నగుచు, పాపప్రవర్తనులైన మ్లేచ్ఛాదిజనులచే గల్గు దుస్సహాపీడ లేక యుప ద్రవమను నిదాఘతాపమును వారించునదియై, తిరిగి భూమిపై కృత

యుగధర్మప్రవర్తనమను మహావృక్షమును అంకురింప చేయగలదు. మేఘమువర్షించి సస్యాభివృద్ధి చేయువిధమున కల్కిరూపియగు విష్ణుదేవుని చేతిఖడ్గము జగత్సంతాపకారులగు దుష్టులను ఖండించి భూమిపై వర్ణాశ్రమాచార ధర్మప్రవృత్తిని తిరిగి స్థాపించునని భావము.

91. అవ. ఇట్లు బహువిధములుగా దయను పై తొంబది శ్లోకముల స్తుతించి యీపద్యమున స్వాభీష్టమును ప్రార్థించు చున్నారు.

శ్లో॥ విశ్వోపకార మితి నామ సదా దుహానా
మద్యాపి దేవి భవతీ మవధీరయన్తం ।
నాథే నివేశయ వృషాద్రిపతౌ దయే త్వం
న్యస్తస్వరక్షణభరం త్వయి మాం త్వమేవ॥

టీ. హేదయే! దేవి! ఇతినామ = ఈప్రకారము సర్వ లోకవిదితముగా, విశ్వోపకారం = విశ్వజనులకు బహువిధములగు ఉపకారములను, సదా = నిరంతరముగా, దుహానాం = కావించు నట్టి, భవతీం = నిన్ను, అద్యాపి అవధీరయన్తం = ఇప్పటికిని నీ మహిమయు జగదుపకృతులును తెలియలేక నీయెడ తిరస్కారభావ మును గలిగినవాడును, త్వయి న్యస్తస్వరక్షణభరం, త్వయి = నీయందు, న్యస్త = ఉంచబడిన, లేక సమర్పింపబడిన, స్వరక్షణ భరం మాం = నారక్షణవిషయమగు భారమునుగల నన్ను ; అనగా అనన్యగతికుడగు వీడు, నాయందు తనరక్షణభారమును సమర్పించిన వాడని నీవే తలచి, నన్ను భగవచ్ఛరణారవింద కైంకర్యనిరతు నిగా జేయుటకై, త్వమేవ = నీవే, నాప్రార్థనలేకయే యనుట, నాథే వృషాద్రిపతౌ = దాసుల కైంకర్యమును ప్రీతితో నంగీక

రించు నాథుడగు శ్రీశ్రీనివాసుని సమీపమున, నివేశయ = ప్రవేశ పెట్టుము. నాథుడనుటచే భగవంతుడు కైంకర్యోద్దేశ్యుడగుటను; దేవీ యని సంబోధనముచే, శ్రీనివాసునకు దయను దాటగూడ మియు, లేక దయావిధేయత్వమును దెలుపుచున్నవి.

మాలిని॥

జగదుపకృతు లిమ్మై సర్వదా ♦ చేయు నిన్నుఁ
దెగడు జడుని నన్నుఁ ♦ దేవి దీనుఁ బ్రిపన్నుఁ
దగ నిలుపుము నీవే ♦ ధన్యునిం జేయఁగా శే
షగిరిరసికుఁడౌ మత్స్వామి ♦ సాన్నిధ్యమందుఁ॥

తా. ఓదయా! జగదుపకారపరంపరలు సర్వకాల మాచ రించు నీయెడ దుర్బుద్ధియగుటచే తిరస్కారభావముగల ప్రిపన్ను డైన నన్ను, నాస్వామియైన శేషగిరిప్రభుపుసమీపమున నిల్పి, త త్పదకమల భృత్యునిగా జేయుము.

92. అవ. నీవట్లు కోరుట బాగు గాని, ఆనుకూల్యలేశము లేక, ప్రాతికూల్యబాహుళ్యముగల నిన్ను శ్రీనివాసునిదయకు విష యముగా జేయుటెట్లు? తత్తత్కర్మఫలప్రదాతయైన యా సర్వచ రాచరనియంతయగు విభుడు సమ్మతించుటెట్లు? అను ఆక్షేపణలకు సమాధానము చెప్పుచున్నారు.

శ్లో॥ నైసర్గికేణ తరసా కరుణే నియుక్తా
నిమ్నేతరేపి మయి తే వితతి ర్యది స్యాత్।
విస్మాపయే ద్వృషగిరీశ్వర మప్యవార్యా
వేలాతిలంఘనద శేవ మహాంబురాశేః॥

టీ. హేకరుణే! నిమ్నేతరపి = ఉన్నతుండైనను, అనగా వినయాది దయాహేతుకములగు సుగుణసంపత్తి కొంచెముకూడ

లేనప్పటికిని, నైసర్గికేణతరసా = ఆశ్రిత రక్షణమునందు నీకు స్వాభావికమైన వేగముచే, నియుక్తా = ప్రేరితురాలై, మహాంబు రాశేః = సముద్రముయొక్క, వేలాతిలంఘన దశఇవ = ప్రళయ కాలమున జగముల నాక్రమించుటకై మర్యాద నతిక్రమించు సముద్రమట్లు, అట్టివేళ సముద్రమును వారించుటకు వీలుపడని యట్లు నీవును, అవార్యా=మద్విషయీకరణ విషయమున నిలుప గూడని వేగముగలదానవై, మయి తే వితతిః స్యాద్యది = నీవు నాపై ప్రసరించినచో, అనగా నన్ను కటాక్షించి దయకు పాత్రు డని స్వీకరించినచో, వృషగిరీశ్వరమపి విస్మాపయేత్ = వృషగిరి పతినిగూడ ఆశ్చర్యపడువిధమున జేసెదవు. అనగా శ్రీనివాసుడు "ఆపన్నులయెడ నీదయకు ఎంత నిర్వ్యాజవత్సలత్వము గలదని" వెఱగంది చూచునని భావము. అతివేగముతో ప్రవహించు నదీ జలములు ఉన్నతప్రదేశములను గ్రమ్మునట్లు, దయయు తనకు నైజ మగు వేగముతో ఉన్నతులైనవారినిగూడ భగవదనుగ్రహమునకు బాత్రునిగా చేయగలదని భావము. ఉన్నతులనగా అవినయులై శమదమాది గుణసంపత్తి లేనివారని యర్థము.

మాలిని॥

ఎడపక కరుణా ని ♦ మ్నేతరుండైన నాపైఁ
గడలిపొరలి హద్దుల్ ♦ గ్రమ్ము చందంబు దోఁచన్
గడుకొని యడరంగాఁ ♦ గాద్రివేయాద్రివర్యే
శుఁడు వెఱఁగున నిన్నున్ ♦ జూచి తా మెచ్చు నాత్మన్.

తా. దయా! రక్షణోచితములైన యాత్మగుణ పరిపూర్తి లేనట్టి హీనుఁడగు నాపై నీవు దయఁచూపుటకై, నీకు సహజమగు వేగమున, వేలాతిక్రమణ మాచరించు సముద్రమట్లు పొంగిపొర

లగా, నీకు దీనులయందుగల యవ్యాజవత్సలత్వమునకు శ్రీనివాసుడు మెచ్చి యాశ్చర్యపడగలడు.

93. అవ. న్యాయకృత్యకరణము లేమియు చూడక నన్ను రక్షించి, విభుని దండనకు లోగాకుండునట్లు చేయవలయునని, దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ విజ్ఞాత శాసనవిధి ర్విపరీతవృత్త్యా
వృత్రాదిభిః పరిచితాం పదవీం భజామి।
ఏవంవిధే వృషగిరీశదయే మయి త్వం
దీనే విభో శ్శమయ దండధరత్వలీలాం॥

టీ. హేవృషగిరీశదయే ! సంబోధనము ; విజ్ఞాత శాసనవిధిః=సర్వశాస్త్రార్థ తాత్పర్యము తెలిసినవాడయ్యును, (అహం=నేను,) విపరీతవృత్త్యా= శాస్త్రవిరోధమగు ప్రవర్తనమున "జానామి ధర్మం నచమే ప్రవృత్తిః జానామ్యధర్మం నచ మే నివృత్తిః" అను విధమున, ధర్మాధర్మవివేకము గల్గియున్నను, వాసనారేణుకుంఠితుడనై పాపకృతుండ నగుచు, వృత్రాదిభిః = వృత్రాసుర రావణ హిరణ్యాదులచే, పరిచితాం పదవీం = పోయినత్రోవను, భజామి= సేవించెదను. అనగా దుర్మార్గమునందు ప్రవర్తించెదను. "మహాజనో యేన గతః సపంథా" పెద్దలు త్రొక్కిన త్రోవయే త్రోవ; అదివిడిచి, తెలిసినప్పటికి యసజ్జనుల త్రోవను ద్రొక్కెదను. (దీనివలన నధికమగు దండనకర్హత తెలుపబడినది.) ఏవంవిధే దీనే మయి=అట్టి దుష్ప్రవర్తనగల దీనుడనగు నాయందు (దీనుడనుటచే పూర్వకర్మవాసనాప్రేరితుడై వశముగాక పాపకృత్యముల దగులుటచే దండనమున కనర్హత్వము సూచితము.) విభో: = నిగ్రహానుగ్రహశక్తి గలవాడయ్యు దీనానుకంపియగు శ్రీనివాసునియొక్క, దండధరత్వలీలాం = దండనప్రవృత్తిని, శమయ = పోగొట్టుము. నీ విభ్రమ

విలాసములచే నాథుని లోఁబఱచి నన్ను దండింపకుండునట్లు చేయుము. దీనుడనగుటచే అదండనీయుడనగు నన్ను దండింపకుండ చేయుటసులభ సాధ్యము కావున 'లీల' గా జెప్పబడినది. భగవంతుడు మహాపరాధులయెడ కలుషితస్వాంతుడైనను "కిమేతత్, నిర్దోషః కఇహ జగతి" ఏమిది? జగమున నిర్దోషులుకలరా? ఇంతకోపమేల? యనియు, "నకశ్చి న్నాపరాధ్యతి" అపరాధములు చేయనివా డెవడు, అని బహువిధములగు వాక్యముల విభుని నీలీలకు లోబఱచి నాయెడ ప్రసన్నుడగునట్లు చేయుమని భావము

మాలిని॥

అనయ నయవిదుండై ♦ యర్థి వృత్రాద్యులట్లే
యనయము విపరీతం ♦ బైన మార్గంబె కొందుఁ
జనని వృషభభూభృ ♦ త్స్వామి దండప్రలీలల్
నను దనుకని భంగిఁ ♦ నర్మిలిఁ బ్రోవరాదే॥

తా. జననీ! కార్యాకార్యవివేకము గల్గినను పాపాచారులగు వృత్రాసురప్రముఖులు నడచిన మార్గమునందే పోయెదను. అట్టి దీనుడగు నాయందు శ్రీనివాసునియొక్క దండనోద్యోగమును నీవు మాన్పుము.

94. అవ. దండనహేతుభూతమగు అకృత్యకరణాదులనుండి నివృత్తి కలిగించునట్లు దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ మా సాహసోక్తి ఘనకంచుక వంచితాన్యః
పశ్యత్సు తేషు విదధా మ్యతిసాహసాని।
పద్మాసహాయకరుణే నరుణత్సి కిం త్వం
ఘోరం కుళింగశకునేరివ చేష్టితం మే॥

టీ. హేపద్మాసహాయకరుణే = లక్ష్మీదేవిని సహాయముగా గల శ్రీనివాసునికరుణా!, మాసాహసోక్తి = 'మాసాహసం' సాహ

సము చేయ రాదని నుడువుచు అనగా ఇతరులకు దెల్పుచు, ఘనకం చుక వంచిత అన్యః = అట్లు పాపకృత్యములు చేయరాదని ఇతరుల కుపదేశించుటను మాటుగా జేసుకొని పరులను వంచించువాడగు నేను; తేషు పశ్యత్సు = ఉపదేశింపబడినవారే చూచుచుండగా (ఆహా! ఏమి నాకు లజ్జయు భీతియు లేని తనము) అతిసాహసాని విదధామి = అతిసాహసకృత్యములను చేయుచున్నాను. ఇట్లు, కుళింగ శకునేరివ=కుళింగమనుపక్షియొక్క, ఘోరం = అతిక్రూరమగు లేక భయంకరమగు, మే చేష్టితం = నాయొక్క దుర్వ్యాపారములను, త్వం = నీవు, కిం నరుణత్సి = నిరోధించుటకు లేక అడ్డగించి యట్టి వ్యాపారములందు చొరకుండునట్లు చేయకుండుటకు ఏమికారణము? ఈకుంళిగపక్షి "మా సాహసం" అని స్వయముగా పల్కుచు విదారితమగు సింహముయొక్క నోటిలోని దంతములనడుమ చిక్కిన మాంసమును దానుగ్రహించుచుండును. అట్లు పరుల కుపదేశించు నేను "ధర్మోపదేశసమయే జనా స్సర్వేపి పండితాః। తదనుష్ఠాన సమయే మునయోపి నపండితాః" అన్నట్లు అకృత్యములే చేయుచున్నాను. అట్టి యకృత్యాచరణమును నీవెందుకు మాన్పి నన్ను మంచిమార్గములో నడచునట్లు చేయకున్నావని యర్థము. సర్వశేషియగు పరమాత్ముని స్తుతివిషయమున ఆత్మనిందచేయుట, పరకాల పరాంకుశ భగవద్యామునాచార్యు లాదిగాగల పూర్వగురువర్యుల స్తుతియందును జూడవచ్చును. మహాత్ములకు నైచ్యానుసంధానము సహజము. నిజముగా పరోపదేశమునకు విరుద్ధముగా నడచువార లెందఱో గలరు, అట్టివారివిషయమై చెప్పబడినదని యెఱుగ వలయు.

మాలిని॥

జనులకు ననుకంపా ♦ సాహసం బొప్పదంచున్
దనరఁ బలికి నేన ♦ త్యంత ఘోరంపు చేష్టల్

జనులు గనుంగొనంగా ♦ నల్పుదుర్ణర్ణ గుళింగం
బును నెనయు దురాత్ముల్ ♦ బోల వారింపవేలా॥

తా. ఓదయా! ఇతరులకు సాహసకృత్యములు చేయుట తప్పని తెలుపుచు వంచకుడనగుచు నేను వారు చూచుచుండగనే శాస్త్రాతిలంఘనక్రియలు సాహసించి చేయుచుందును. ఆకులింగ పక్షివలె ఘోరమగు చేష్టలు చేయుటను నీవేల వారింపక చూచుచున్నావు? అనగా నా దుష్ప్రవృత్తులను మాన్చి నన్ను సదాచారనిరతునిగా జేయుమని భావము.

95. అవ. ఇట్లు శాస్త్రవిధులను విడిచి యకృత్యములు చేయు తన్ను శ్రీనివాసుని దండనకు లోనుగాకుండునట్లు చేయను, దండనమునకు హేతువగు అకార్యకరణము లేకుండునట్లును దయను ప్రార్థించినవారై, దేశికులవారీశ్లోకమున దయను శ్రీనివాసుని చేతివలగాను, తన్నొక పసుగెత్తు జంతువుగాను నిరూపించి, పట్టుకొని శ్రీనివాసున కొప్పగించునట్లుగా వేడికొనుచున్నారు.

శ్లో॥ విక్షేప మర్హసి దయే విపలాయితేఽపి
వ్యాజం విభావ్య వృషశైలపతే ర్విహారం
స్వాధీనసత్త్వసరణి స్స్వయ మత్రజంతౌ
ద్రాఘీయసీ దృఢతరా గుణవాగురా త్వం॥

టీ. హేదయే! బాలున కాపత్తురాకుండునట్లు స్వయముగా వాత్సల్యవిశేషమున రక్షించు జననింబోలు దయా! స్వాధీన సత్త్వసరణిః = నీకధీనమైన సత్త్వగుణప్రవృత్తిని గలదానవును(భగవత్కృప చేత జీవులకు సత్త్వోన్మేషము గల్గుననుట "సాత్త్వికస్సతు విజ్ఞేయస్సవై మోక్షార్థచింతక" అను వాక్యముచే స్పష్టము. (వాగురా= వలపక్షమున తనకధీనమైన, సత్త్వసరణిః=మృగములయొక్క గమనము గలదని యర్థము.) ద్రాఘీయసీ = మిక్కిలి దీర్ఘతరమైనదానవును,

ఎంతపాపాత్ముఁడై భగవత్కృపకు దూరవర్తియైనను నీవు వానిని కటాక్షించగలవని యర్థము. (వలపక్షమున దూరముగా పరుగెత్తు జంతువును గ్రహించుటకు శక్తిగల నిడదయగువాగురయనియర్థము.) దృఢతరా = మిక్కిలి దృఢమైనదానవును, అనగా నీవు గ్రహించిన ప్రాణిని ఎప్పటికిని పరిత్యాగముచేయువని యర్థము. (వాగురా పక్షమున వల దృఢమైనది కావున చిక్కినజంతువు పాఱిపోవలేదని భావము.) అట్టి విశేషణములుగల, గుణవాగురా త్వం = అనేక కల్యాణగుణములచే గూర్పబడి జంతువులను బట్టుటకై నిర్మింపబడిన వాగురనుబోలు నీవు, (వలపక్షమున, గుణ = రజ్జువులచే, త్రాళ్లచే గూర్పబడిన వలయని యర్థము.) వృషశైలపతేః వ్యాజం విభావ్య= వైకుంఠవర్తియగు శ్రీమన్నారాయణుఁడు చేతనులను ఆకర్షించునిమిత్తము "మాయావీ పరమానందః..." అని ముందుచెప్పినట్లు వైకుంఠనాథుడు శ్రీనివాసుడై వేంకటగిరిపై నవతరించుటను, విభావ్య = పరిశీలించి, అతనిచేతి వలనుబోలుచున్న నీవు, విపలాయితేఽపి = ఆనుకూల్యలేశము లేక ప్రాతికూల్యాధిక్యకారణమున అనుగ్రహమునకు దగనివాఁడై భగవద్దూరవర్తియైనను(వలపక్షమున జంతువు దూరముగా పరుగెత్తినను,) అత్రజంతౌ = ఈజంతువగు నావిషయమున, (తన్ను దక్కువయగుటను దెల్పుటకై నీచమగు జంతువనబడినది.) స్వయం = స్వయముగా, నాయపరాధగణము లేమియు చూడకనుట, విక్షేపమర్హాసి = నన్ను గ్రహించుటకై వలను విసరుము. శ్రీనివాసు డుపేక్షించినను నీవే నన్ను బట్టుమనుట "ప్రసాదం కర్తు మర్హాసి" "అభయం దాతు మర్హాసి" అను వాక్యములవలె 'స్వయం విక్షేప మర్హాసి' మృగబంధినిం బోలు నీవు నేను పలాయితుఁడైనను నన్ను బట్టుకొని శ్రీనివాసుని చరణారవింద పరిచారకునిగా నొనరింపుమని భావము.

మాలిని॥

కరము దృఢము దీర్ఘ ♦ గ్రాహియున్ వశ్యసత్వ
స్థిరసరణియునై వి ♦ క్షేప మొప్పన్ వృషాద్రీ
శ్వర మృగయున కియ్యన్ ♦ వాగురన్ బోలు నీకున్
పరుగిడు నను జంతున్ ♦ బట్టఁగారాదె దేవీ.

తా. స్వాధీనమగు జంతువులపరివర్తనముగల్గి, గట్టిగానిర్మింపబడి, దూరపుజంతువులను బట్టగల మృగబంధినిం బోలునీవు, అకృత్యకరణాదులచే భగవత్కృపకు పాత్రుడుగాక దూరముగాపరుగెత్తు జంతువును బోలు నన్ను, సంసర జ్జంతుజాలముల బట్టుటకై వేంకటగిరిపై నవతరించిన శ్రీనివాసున కొప్పగించునిమిత్తము, నాపై ప్రసరించి పట్టుకొనరాదా? ఏల నన్నుపేక్షించెదవని భావము.

96. అవ. జననీ జడపుత్రన్యాయము ననుసరించి మహాపరాధ దూషితుడగు తన్ను భగవద్దయ కర్హునిగా జేయ ప్రార్థింపబడినది. ఈశ్లోకమున మహాపరాధవర్గములను దయ తప్పక సహించునను దృఢమగు నమ్మకమును వానివలన నెంతమాత్రము భీతిలేకుండుటయును గలుగజేయునట్లు దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ సన్తన్యమాన మపరాధగణం విచిన్త్య
త్రస్యామి హన్త భవతీం చవిభావయామి
అహ్నాయ మే వృషగిరీశదయే జహీమా
మాశీవిష గ్రహణకేళినిభా మవస్థాం॥

టీ. హేవృషగిరీశదయే! సన్తన్యమానం అపరాధగణం= నిత్యమెడతెగక కాయిక వాచిక మానసికము లనబడు మూడువిధములైన అపరాధసమూహములను ఆచరించుటను, విచిన్త్య = తలిచితలచి, త్రస్యామి = మిక్కిలిగా నెట్టిదండనకు లోనగుదునో యని దిగులొందెదను. భవతీంచ విభావయామి=సర్వాపరాధము

లను సహించునట్టి స్వభావముగల నిన్నును దోడనే తలచెదను. అందుచే భీతి తొలగుచున్నది. హంత ! = ఆశ్చర్యము ఇట్లు భయ అభయములు రెండును పర్యాయముగా గల్గుట ఆశ్చర్యము. ఇట్లు, మే = నాకు, ఆశీవిషగ్రహణకేళిసిభాం అవస్థాం = గరుడ మంత్రసిద్ధిని బొందినవాడు ఘోరవిషసర్పములను బట్టునపుడు విష సర్పముల క్రౌర్యమును దలచి భయమును, గరుడమంత్రప్రభావ మునుదలచి ధైర్యమును భయములేమియు బొందునట్టి, ఇమాం అవస్థాం = ఈ అవస్థను, దశను, అహ్నాయ=శీఘ్రముగా, జహి= పోగొట్టుము. "అడుసుద్రొక్కనేల కాళ్లుగడగనేల" యన్నట్లు నాచే అపరాధములు గావించి వానివలన భయమును బొందునట్లు చేయ నేల, తర్వాత నీమహిమను దలచుటచే భయనివృత్తి గావింపనేల, నన్ను సన్మార్గమున నిల్పి యపరాధప్రవర్తనలను మాన్పరాదాయని భావము. ఆశరీరపాతము ఈభయాభయముల అనువృత్తిని మాన్పు మనుట.

మాలినీ॥

> భయ మొదవెడు నన్నుఁ ♦ బాపకృత్యంబు లెంచఁ
> దయ నినుఁదలఁతుఁ జి ♦ త్తంబునన్ దోడ నాకీ
> క్రియను విషధరంబుల్ ♦ గేళిమైఁ బట్టు మంత్రి
> శ్రియునకగు నవస్థన్ ♦ జయ్యనన్ మాన్పరాదే॥

తా. ఓదయా ! నేనాచరించు పాపకృత్యములను దలచు టచే భీతియు, వెంటనే సర్వాపరాధసహిష్ణువగు నిన్నుదలచుటచే నభయమును గల్గుటచే, నాకు గరుడమంత్రవిదుడు సర్పములను బట్టుట కుద్యోగించునట్టి దురవస్థ యేర్పడినది. ఆదురవస్థనుండి నన్ను తప్పింపుము.

97. అవ. శాస్త్రోల్లంఘనరూపములగు బహువిధ భగవ ద్భాగవతాపచారముల నెల్ల దయ తప్పక సహించి ప్రసాదము చూపునని దృఢనిశ్చయముతో నున్న యాచార్యులవారు, దయ యందు మాతృత్వభావమును పురస్కరించుకొని, తిరిగి వ్యాజస్తుతి అలంకారమున నుతించుచున్నారు.

శ్లో॥ ఔత్సుక్యపూర్వ ముపహృత్య మహాపరాధా
న్మాతః ప్రసాదయితు మిచ్ఛతి మే మన స్త్వాం।
ఆలిహ్య తా న్నిరవశేష మలబ్ధతృప్తి
స్తామ్య స్యహో వృషగిరీశధృతా దయే త్వం॥

టీ. హే మాతః దయే = నయ సర్వపోషకురాలగుటచే మాతః యను సంబోధనము ; ఔత్సుక్యపూర్వం = ఉత్తరపాటుతో ఎప్పు డెప్పుడని, మహాపరాధాన్ ఉపహృత్య = నేనాచరించినట్టి సర్వ విధాపచార సమూహములను నీ కుపహారముగా నిచ్చి, త్వాం ప్రసాదయితుం = నిన్ను ప్రసన్నురాలగునట్లు చేయుటకు, మేమనః = నాయొక్క మనస్సు, ఇచ్ఛతి = కోరుచున్నది. జననికి ప్రీతిసల్పుట కంటె వేఱు గొప్పకార్య మొకటిలేదు కావున, నెట్లైన నీకు ప్రియ మని భావించి నాసర్వపాపవర్గములను నీకు కానుకగా నిచ్చి నీమె ప్పును సంపాదింపవలయునని నేను కోరుచున్నాను నీ వన్ననో, తాన్ నిరవశేషం ఆలిహ్య = వానినంతయు దిక్కుండ నాకి, అనగా నీకిచ్చిన యాహారము ఒకముద్దకైన చాలమిచేత వ్రేళ్లమధ్య చిక్కిన తేనెను బాలకులు నాకునట్లు దానినంతయు నాస్వాదించి, కడుపునిండమిచే, అలబ్ధతృప్తిః = తృప్తినొందనిదానవై, తామ్యసి = ఛిక్కి సోలిపోవుదవు లేక బడలికచే వ్రాలెదవు. ఆట్టిసమయ మున, త్వం వృషగిరీశధృతా = శ్రీనివాసునిచే ధరింపబడెదవు. కుమారు డిచ్చిన యాహారము చాలక తల్లి డస్సి నిలువలేకున్నపుడు

తండిరి దాని నోదార్చునని భావము. దయను తిండిపోతని దూఱు నట్లు తోచినను, త్రివిధములగు సకలాఘవర్గములను నిశ్శేషముగా హరించునట్లు వర్ణించుటచే అలంకారము వ్యాజస్తుతి ; మఱియొక యర్థము. అలబ్ధతృప్తిః = ఆశ్రితుని పాపముల నెల్ల హరించితిని గాని, యంతకంటె వానికి మేలు చేయజాలనైతినని తృప్తి నొందని దానవై, ఆశ్రిత వ్యామోహాతిశయమున నతనికి పరబ్రహ్మత్వప్రాప్తి మొదలగు మహాఫలము లిచ్చునవసరమున, త్వం=నీవు, వృషగిరీశ ధృతా తామ్యసి అహహా! = వృషగిరినాధునిచే నిరోధింపబడి, తామ్యసి = గ్లాని నొందెదవు ఆశ్చర్యము. భగవంతునికంటె భగ వంతు నాశ్రయించిన దయయొక్క పేర్మి యెక్కువయని భావము. దయ అవాఙ్మానసగోచరమగు ప్రభావము గలదని ఫలితార్థము.

మాలిని॥

ఘనమగు దురితంబుల్ ♦ గానుకల్ సేసి యెమ్మె
జనని ముదము నీకుఁ ♦ సల్పఁ గాంక్షింతు నా నె
మ్మనమున నవి నీకుం ♦ ద్బాధ వెంపంగ వాడొం
దిన నిను వృషశైలా ♦ ధీశుఁ డోదార్చుగాదే॥

తా. నీకు ప్రీతికరముగా నేను నాయొక్క అనాదికాల ప్రవృత్తానంత పాపసంచయముల నెల్ల కానుకగా నిచ్చి నీప్రసాద మును బడయగోరుచున్నాను. కాని నేనిచ్చిన యుపహారములు నీకుచాలమిచే కృశించి పోలునట్టి నిన్ను వృషగిరినాధుడే యోదార్చు చుండును.

98. అవ. "నీపాపబృందముల నేను హరించెదను. నిజమే; అయితే తత్తత్కర్మఫలప్రదుడైన నాధుడు పాపాత్ములయెడక్రూరుడే, యతనిచరణకమలములను పరిచరించునట్లు నిన్నుచేయుటెట్లు" అని యంటివేని, యింతవఱకే యతనికోపము "కలమే యవసాపచాయ

నీత్వా కరుణే కింకరతాం తవోపయాతి" యని 24వ పద్యమునందును, "జలధేరివ శీతతా దయే త్వం వృషశైలాధిపతే స్స్వభావభూతా" యని 23వ పద్యమునందును, అతనికోపము పైకిమాత్రము గోచరించును గాని లోపల నంతటయు కరుణగలవాడనియు, తత్కోపఫలము దండితులకు మేలాచరించి నీకువశ్యమై వర్తించుచున్న దనియు తెల్పియుంటిని. అందుచే నీవాతని కటాక్షములకు పాత్రునిగా నన్ను జేయుమని దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ జహ్యా ద్వృషాచలపతిః ప్రతిఘేఽపి న త్వాం
ఘర్మోష్మతప్త ఇవ శీతళతా ముదన్వాన్ ।
సా మాం మరుస్తబకభర వ్యసనానువృత్తి
స్త్వద్వీక్షణై స్స్పృశ దయే తవ కేళిపద్మైః॥

టీ. హే దయే! వృషాచలపతిః=శ్రీనివాసుడు, ప్రతిఘేఽపి= ఒకసమయమున కోపగించినను, ('అపి' అనుటచే అతనికి క్రోధము కల్గదనియే భావము. "అరోషణో హ్యసౌ దేవః; నక్రుద్ధ్య త్యభిశప్తోఽపి" అనువాక్యములచే భగవంతునకు క్రోధములేమిస్పష్టము.) ఘర్మోష్మతప్తః = ఎండకాలమున పైభాగమునమాత్రము వేడిమిని బొందినట్టి, ఉదన్వాన్=సముద్రుడు, శీతలతాం ఇవ=చల్లదనమును లోపలనంతటయు గల్గునట్లుగా, అనగా అంతశ్శీతలత్వము విడువకుండునట్లు, త్వాం=నిన్ను, నజహ్యాత్ = విడువకుండును. అతనికి కోపప్రసంగమేలేదు, ఒకవేళ గల్గినను ఆసమయమున ఆపద్బంధువగు నిన్ను విడువడు. అందుచే, అరుంతుద భరన్యసనానువృత్తిః = ఒక్కపర్యాయము ప్రపత్తి చేసినవారియెడ ప్రసన్నురాలగు నీవు సర్వఫలప్రదాత వగుటచే, తర్వాత ప్రపత్తియొక్క అనువృత్తిని అనగా మాటిమాటికి ప్రపత్తినిగోరని, సా త్వం = నీవు, తవకేళిపద్మైః = నీకు విలాసార్థ మేర్పడిన తామరపువ్వులనుబోలు, తద్వీ

క్షుణైః = ఆశ్రితపతిచూపులచే, మాం స్పృశ = నన్ను దాకుము. అనగా నీసాంగత్యముచే మృదుత్వ శీతలత్వ తాపహరత్వాదిగుణములను జెందిన మనోజ్ఞములగు నీవరుని కడకంటి చూడ్కులచే నన్ను జూడుమని భావము. కులశేఖర భగవ ద్యామునాచార్యులాదిగాగల పరమభాగవతోత్తములు ప్రార్థించినట్లు క్షణకాలము మాత్రము కరులాకాంతుని కటాక్షపాతము గల్గినచాలుననియర్థము.

మాలిని॥

అరయను పరితప్తుం ♦ డయ్యు శైత్యంబు వారా
కరుఁ డెడలడు, నిన్ శ్రీ ♦ కాంతుఁడున్ గ్రుద్ధుడైనన్
దొరఁగడు కరుణాత్వ ♦ త్తుంగ కేళ్యంబుజంబై
పరగు వరుని కంటన్ ♦ భాసిలన్ జూడు నన్నున్॥

తా. దయా! మండు వేసవికాలమున సముద్రుడు పైన కించి దుష్ణత్వమునుబొంది లోపల శీతలత్వమును వదలకుండునట్లు, భగవంతు డొక్క వేళ కోపమును బొందినను నిన్నువిడువడు. అనగా కరుణామయమగు అంతరంగమును గల్గియుండును. కావున నీవు లీలారవిందములగు నీశ్రీనివాసుని కన్నులతో నన్ను గటాక్షించి వీక్షింపుము. అతడు తప్పక నన్నునిజపాదభృత్యునిగానంగీకరించును. భగవన్నయనంబులు దయాదేవియొక్క కరగృహీత లీలాంబుజములనుటచే, భగవత్కటాక్షముల ప్రవర్తన నివర్తనములు రెండును, దయావిధేయములని సూచితము.

99. అవ. బహుదోష దూషితుడైనను, మిత్రభావమున నాశ్రయించిన వానిని జేకొందుననియు, నతని దోషముల పాటింపననియు భగవంతుడు ప్రతిజ్ఞచేసియుండు "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన। దోషో యద్యపి తస్య స్యాత్సతా మేత

దగర్హితం” అనురామాయణశ్లోకమును దలచి, సదాచార్యపుర స్సరముగా ప్రపదనమొనరించిన తన్ను, స్వయముగా స్వీకరించు నట్లు దయను వేడుకొనుచున్నారు. అందునిందు పరుగెత్తు మదపు టేనుగును, రాజు తనగజముయొక్క అనుమతిని చూడక, స్వయముగా తనమదపుటేనుగును బంధించునట్లు నిరంకుశమతినై గర్వించి విహరింపు, శేషభూతుడైనను మదగజమునుబోలు తమ్ము అనుగ్రహమను గొలుసులతో గట్టి బంధింపవలయునని ప్రార్థించుచున్నారు.

శ్లో॥ దృష్టేఽపి దుర్బలధియం దమనేఽపి దృప్తం
స్నాత్వాఽపి ధూళిరసికం భజనేఽపి భీమం
బధ్వా గృహాణ వృషశైలపతే ర్దయే మాం
త్వద్వారణం స్వయమనుగ్రహ శృంఖలాభిః॥

టీ. హేవృషశైలపతేర్దయే! = ఓ శ్రీనివాసునిదయా! దృష్టేఽపి = గురుముఖమున శాస్త్రార్థములను గ్రహించి సదసద్వివేకము పొందియున్నను, దుర్బలధియం=యథా శాస్త్ర మనుష్ఠించుటకు మనోనిశ్చయ శక్తిరహితుడును, (గజపక్షమున మావటివానిచే సరియైన గమనమార్గము చూపబడినను, మదవశమున గన్నుగానక తప్పుదారి నడచునదియని యర్థము.) దమనేఽపి దృప్తం = ఒకటి రెండుపర్యాయము లింతకుముందే నిగ్రహింపబడినను, దృప్తం = అనుతాపరహితుడై గర్వించినడచువాడును (గజపక్షమున అంకుశాదులచే పీడింపబడినను, దృప్తం = లెక్కచేయక వర్తించునట్టి యేనుగని యర్థము.) స్నాత్వాఽపి ధూళిరసికం = మహాంతులచే నుపదేశింపబడుటయు, ప్రాయశ్చిత్తక్రియలు చేయుటయు శుద్ధికి కారణమగుటచే స్నానతుల్యముగాజెప్పబడినది; అట్లు, స్నాత్వాపి= సుస్నాతుడైనను, ధూళిరసికం = ధూళిశబ్దము మలిన వర్తనములేక

పాపాచరణమునందు పున్యప్రవృత్తిని తెలుపుచున్నది. అట్టి యకృత్యకరణమునందే, రసికం = ప్రీతిగలవాడును (గజపక్షమున స్నానముచేయించినను తిరిగి శరీరముమీఁదను కుంభస్థలముమీఁదను దుమ్మును వేసుకొనుటయందు ప్రీతికలదనియర్థము.) భజనేఽపి భీమం= హితముపదేశించి, మంచిమార్గమున ద్రిప్పుటకై సమీపించినవారి యెడ, భీమం = హుంకారాదులచే భయమును ప్రకటించువాడును (గజపక్షమున ఆరోహణాదులచే పరిచితులైనవారియెడను, భీమం= భయంకరమగునట్లు వర్తించుపనుగని యర్థము.) అయినట్టి, త్వద్వారణం = నీచేవారించుటకు దగినవాడనగు నన్ను; తవ వారణం = నీయొక్క గజమును, గుణసార్వభౌమియగు నీకు అనన్యార్హ శేషభూతుడైన, మాం = నన్ను, స్వయం = స్వయముగా, నాయను మత్యాదులు చూడక, అనుగ్రహశృంఖలాభిః = అవ్యాజకరుణ యను గొలుసులచే, బధ్వా = కట్టి విధేయునిగా జేసి, (గజపక్షమున మదపుటేనుంగును బట్టి బంధించి) గృహాణ = అంగీకరింపుము స్వీకరింపుము. ఒకానొక సార్వభౌముడు నిజమత్తమాతంగమును గట్టి బంధించునట్లు గుణసార్వభౌమియగు నీవు స్వయముగా, నీకు సంబంధించిన మదగజమునుబోలు నన్ను క్రోడీకరించి, అనుగ్రహమునకు దగినవానిగా నొనర్చుమని భావము. అలంకారము రూపకము శ్లేష, మదగజవృత్తాంతవర్ణనమున స్వభావోక్తికూడ.

మాలిని॥

నను దయ యవివేకు ♦ న్మత్తునిఁ శిక్షితుండై
నను గుపథగ శీలుఁ ♦ స్నాతుఁడైనఁ రజస్స
క్తుని బరిజనసంక్రు ♦ ద్ధుఁ భవద్వారణంబుఁ
గనికరమను త్రాటఁ ♦ గట్టి పాలింపు మీవే॥

తా. ఓదయా! గురూపదేశాదులసన్మార్గముచూపబడినను అనుష్ఠానజ్ఞానరహితుడును, పాపఫలానుభవరూపమగు శిక్షలుబొందినను తిరిగి పాపమునందే వర్తించువాడును, జ్ఞానాదిగుణయోగమున స్నాతుడైనను రజోగుణసక్తుడును, హితులగు పరిజనముల యెడ భయంకరమై నడచువాడును, నీవారణమును నైన నన్ను నీవు స్వయముగా నాయందు ప్రసాదించుట లేక యనుగ్రహమను గొలుసులతో గట్టి నన్ను పరిపాలింపుము.

100. అవ. ఈప్రకారము జ్ఞానవైరాగ్యాది సుగుణభూషితులైన దేశికులవారు పై యెనిమిదిశ్లోకముల తన యకించినత్వమును నైచ్యమును ప్రదర్శించి, నిజ దయనీయతమత్వమును ప్రకటించి, యీ నూఱవపద్యమున భగవత్ప్రాప్తిరూపమగు ఫలము నిందే సమకూర్చునట్లు దయను ప్రార్థించుచున్నారు.

శ్లో॥ నాత్మఃపరం కిమపి మే త్వయి నాధనీయం
మాత ర్దయే మయి కురుష్వ తథా ప్రసాదం।
బద్ధాదరో వృషగిరిప్రణయీ యథాసౌ
ముక్తానుభూతి మిహ దాస్యతి మే ముకుందః॥

టీ. హేమాతః దయే! అతఃపరం = ఇప్పుడు నేను గోరుదానికంటె వేఱొక్కటి, త్వయి నాధనీయం = నీవలన ప్రార్థింపతగినట్టిది, కిమపిన = ఒకటియు లేదు. అయితే ఇహమునందుగాని పరమునందుగాని నేను గోరుచున్నదేమనగా, బద్ధాదరః = బద్ధజీవులయం దాసక్తిగలట్టి అనగా “సస్మార ప్రోషితౌ సుతౌ” అను న్యాయమున దూరదేశమునకు బోయిన కొడుకును తండ్రి స్మరించునట్లు, సంసారమున పరిభ్రమించు జీవులనుదలచి వారియం దెక్కువప్రీతిగల, అసౌ వృషగిరిప్రణయీ = అందుచేతనే శ్రీవై

కుంఠమును త్యజించి చేతనానుగ్రహార్థము వృషగిరిపై నెలకొన్న యీశ్రీనివాసుడు, ముకుంద; = మోక్షమొసంగు దేవసార్వభౌముడు, మే = నాకు, ముక్తానుభూతిం = జీవన్ముక్తులకునయ్యేడు అనుభూతిని భోగమును లేక అనుభవమును, యథా ఇహ దాస్యతి= ఎట్లిందు నాకొడగూర్చునో, తథా = అట్లు, మయి = నాయందు, ప్రసాదం కురుష్వ = అనుగ్రహముచూపుము. శిశుమనోరథపూరణము తల్లికవశ్యముకావున "మాతః"యనిసంబోధనము. ఈసంసారమండలమందే యావచ్ఛరీరపాతము నిరంతర భగవదనుభవజనిత మహానందరూపమగు మోక్షప్రాప్తి కలిగింపుమని భావము. "త్వంచేత్ప్రసీదసి తవాస్మి సమీపతశ్చే త్త్వయ్యస్తి భక్తి రనఘా యది హస్తినాథ! సంసృజ్యతే యది చ దాసజన స్త్వదీయ స్సంసారఏష భగవ న్నపవర్గఏవ" అని దేశికులవారు వరదరాజపంచాశత్ స్తోత్రమున సాయించినట్లు, భగవంతుని యనుగ్రహమును, తత్సమీపవర్తనమును, తద్భక్తియు, తద్దాసజనుల నిరంతరసాంగత్యమును గల్గి ప్రవర్తించు నరుడు సంసారమండలమున నున్నను, మోక్షానుభవమునే పొందుచున్నాడని భావము. అట్టిపరిస్థితులు గలుగజేయవలయునని దయ ప్రార్థింపబడినది.

మాలిని॥

వెలయఁ గరుణ నాకున్ ♦ వేడ్కలే దెందు నీచే
నిల నలచెడు నర్థం ♦ బింతకంటెన్ ఫణీంద్రా
చలరసికుఁడు సర్వ ♦ స్వామి బద్ధాదరశ్రీ
నిలయుఁ డిడెడు నాకున్ ♦ నిత్యముక్తానుభూతిన్॥

తా. ఓకరుణా! సర్వస్వామియు, బద్ధచేతనులయం దాదరముగలవాడును, శ్రీనిలయుడును, శేషాచలవాస ప్రియుడునగు భగవంతుడు, నాకీ సంసారమునందే ముక్తులకగు నిత్య భగవత్సా

న్నిధ్యానుభవములు నీప్రసాదమున గలుగజేయుగాక. ఇదియే నేను నీవలన గోరువరము. ఇంతకంటె వేఱొక్కటియు లేదు.

101. అవ. ఈప్రకారము పైనూఱుశ్లోకముల దయను స్తుతించి, దయేతరములగు జ్ఞానశక్తి బలాద్యనంతగుణములను విడిచి, దయనుమాత్రము స్తుతించుటచే వానికి కోపమురాదనియు, సకలగుణేశ్వరియగు దయాస్తోత్రమున, నాగుణాంతరములు దయకధీనములగుటచే, తృప్తినొందినవై తనకెందును భయములేమిని ప్రకటించుచున్నవని తెలుపుచున్నారు.

శ్లో॥ నిస్సీమ వైభవజుషాం మిషతాం గుణానాం
స్తోతు ర్దయే వృషగిరీశగుణేశ్వరీం త్వాం।
త్రైరేవ నూన మవశై రభినందితం మే
సత్యాపితం తవ బలా దకుతోభయత్వం॥

టీ. హేదయే! నిస్సీమ వైభవజుషాం = శ్రుతిప్రసిద్ధ నిరవధికమహిమగల, వృషగిరీశగుణేశ్వరీం త్వాం=వృషగిరినాథుని గుణములకెల్ల ప్రభ్వియగు నిన్ను, గుణానాం మిషతాం=ఇతరగుణములెల్ల చూచుచుండగా, వానినాదరింపక విడిచియనుట, స్తోతుః = నుతిచేయుచున్న, మే=నాకు, అవశైః=తమకెల్ల సార్వభౌమియగు నిన్ను స్తుతించుటచే సంతోషమున పరవశత్వమొందిన, తైః = ఆగుణములచే, అభినందితం=శ్లాఘాపూర్వకముగ అనగా "శక్త్యాది గుణములను అనుచరులుగాగలదియు, గుణసార్వభౌమియు, ఇతర గుణములకెల్లను గుణత్వసిద్ధిని కలిగించునదియు, వశ్యవృషగిరి నాథయు నైన దయను నుతించుటయే మాకు సంతోషకరము. అదియే మేమును గోరునట్టిది" యని, గుణాంతరములు ఆమోదించినవియై, అకుతోభయత్వం = నాకెందును దేనివలనను భయమును

మాట లేకుండుటను, తవబలాత్ = నిన్నాశ్రయించుటచే కలిగిన ప్రాబల్యమున, సత్యాపితం = నిశ్చయమని తెల్పుచున్నవి, లేక దృఢీకరించుచున్నవి. నూనం = ఈవిషయమున సందేహము లేదు అనగా దయాస్తవము చేత, సకలగుణాంతరములు స్తుతింపబడుచున్న వని భావము.

ఉత్సాహ॥

జ్ఞానశక్తు లాదిగాఁ బ్ర • శస్తగుణగణంబులన్
మానికరుణ ! వృశగిరీశ • మాన్య నిన్ గుణేశ్వరిన్
బూని పొగడఁజూచి యవియ • పోలునంచుఁ ద్వత్పరుం
డైన నాకు నెందు నిర్భ • యత్వ మారఁ దెల్పెడున్॥

తా. దయా ! భగవద్గుణాంతరముల నెల్లవిడిచి వాని నాదరింపక వృషగిరీశమాన్యవై గుణేశ్వరివై పరగు నిన్ను పొగడుటను జూచి, యా జ్ఞానశక్త్యాది కల్యాణగుణములన్నియు, సంతోషించి నవిషై నాకెందును, దేనివలనను భయములేకుండుటను దెల్పుచున్నవి.

102. అవ. వేదములకును గోచరముగాని యవాఙ్మానస వైభవముగల దయను నుతింప బూనుకొనిన నిజసాహసకృత్యమును క్షమింపవలయునని వేడుకొనుచున్నారు.

శ్లో॥ అద్యాపి తద్వృషగిరీశదయే భవత్యా
మారంభమాత్ర మనిదంప్రథమ స్తుతీనాం ।
సందర్శిత స్వపరనిర్వహణా సహేథా
మందస్య సాహస మిదం త్వయి వందినో మే॥

టీ. హేవృషగిరీశదయే! భవత్యాం=నీవిషయమున, అనిదంప్రథమ స్తుతీనాం=ఆద్యంతములులేని వేదజాలముయొక్క నుతులు,

అద్యాపి ఆరంభమాత్రం = ఇప్పటికి స్తోత్రముయొక్క ప్రారంభమే కాని, నీవైభవములోసహస్రాంశముకూడ తెలుపలేకున్నవనిభావము. అపౌరుషేయములగు తొలిపలుకులకు నుతింప శక్యముగాని నీమహిమను బొగడబూనుకొనిన, మందస్య = మందబుద్ధిగల, త్వయి వందిన్యః మే = నీయందు వందివలె అనగా స్తుతిపాఠకునివలె నొప్పు, నాయొక్క, ఇదం సాహసం = స్తోత్రప్రవృత్తి యను నీసాహసముచే నొనరింపబడిన కార్యమును, సందర్శిత స్వపరనిర్వహణా (త్వం) = ప్రకటింపబడిన సర్వనిర్వాహక శక్తిగల నీవు (అనగా దయావశమున నే సర్వమహాపరాధములు సహింపబడుచున్న వనుట.) అట్టి లోకాతీతవిశేషవైభవముగల నీవు నాసాహసమును, సహేథాః = సహింపుము. దయాస్తవవిషయమున " మందస్య " త్వయి వందినః "యని తనయల్పత్వమును దెలుపుట దయనీయతమత్వమునకు హేతువగు సాభిప్రాయవిశేషణములగుటచే పరికరాలంకారము. వాచికకైంకర్యరూపముగ భక్తితో భగవద్దయను బొగడుట భగవత్ప్రీతికరమైనను అల్పమతులు అపరిచ్ఛిన్నమగు విషయమునుగూర్చి పలుకుట యపరాధమునకు హేతువగునేమో యని కవియభిప్రాయము. కృపాభిప్రాయమును బట్టిచూడ యపరాధము కానేరదు. శిశుభాషణములకు జనని సంతోషించునట్లు దేశికులవారి స్తోత్రము జగజ్జననియగు దయకు సంతోషకరమేకాని, యపరాధమునకు కారణము కానేరదు. వినయముచే మహిమాన్నతిని ప్రకటించుట మహాత్ములకు నైజము.

ఉత్సాహ॥

వేదజాలములకునైన ♦ విశ్రుత ప్రభావవా
నీదుమహిమఁ దెలుపు నుడులు ♦ నేటి కాదిమైనచో

సాదరమున వందిభంగి ♦ సన్నుతింపఁ బూను నా
పేదతనము సైచుటొప్పు ♦ పేర్మి కీడుగా దయా॥

తా. దయా! ఆదియు నంతములేని నిగమములన్నియు, నీమహిమలో లవలేశముకూడ చెప్పనేరకున్నవి. అట్టివాక్కునకును మనమునకు నందరాని నిరతిశయ వైభవముగల నిన్ను, మందుడనై వందివలె బొగడయత్నించిన నాయొక్క సాహసమును, సర్వము నిర్వహించుటకు శక్తిగల నీవు సహింపుము.

103. అవ. అవితర్క్య వైభవముగల దయను నుతింప బూనుట యపరాధమే యైనను దానిని క్షమించుటకు హేతువును దెల్పుచున్నారు.

శ్లో॥ ప్రాయో దయే త్వదనుభావ మహాంబురాశౌ
ప్రాచేతస ప్రభృతయోఽపి పరం తటస్థాః।
తత్రావతీర్ణ మతలస్పృశ మాప్లుతం మాం
పద్మాపతేః ప్రహసనోచిత మాద్రియేథాః॥

టీ. హేదయే! ప్రాయః = తఱచుగా విచారించిచూడగా, ప్రాచేతసప్రభృతయోఽపి = మహాజ్ఞానులును, మహర్షిసత్తములును, త్రికాలవేదులును, ప్రసిద్ధ రామాయణ భారతాద గ్రంథకర్తలును, నగు వాల్మీకివ్యాసపరాశరాదులైనను, త్వత్ అనుభావ మహాంబురాశౌ = నీమహిమయను మహాసముద్రమునందు (దిగలేకయనుట) పరంతటస్థాః = మిక్కిలిగా గట్టుమీదనే నిల్చినవారైరి. అనగా నీమహిమను తెలియలేకున్నారు. ఇది నిశ్చయము, అట్లుండగా 10వ శ్లోకమున "అంజనాద్రీశ్వరదయా మభిష్టౌమి నిరంజనాం" అని స్తుతివిషయమై ప్రతిజ్ఞచేసి, "అనుచర శక్త్యాది గుణాం ..." అని 11వ శ్లోకమున స్తవమును మొదలుపెట్టుటచే, తత్రావతీర్ణం =

నీవైభవమను సాగరములో దిగి, అగాధమగుటచే అతలస్పృశం= అడుగుముట్టలేక లోతు తెలియక, అప్లుతం = దురవగాహమగు విషయమున మునుగుటచే ఆకులీకృత వాక్యములు గలవాడనై; సముద్రపక్షమున మునుగుటచే నంతటను దడిసినవాడనై; అందుచేత, పద్మాపతేః ప్రహాసనోచితం = పద్మాకాంతుడగు శ్రీనివాసప్రభువుచే చూచి నవ్వుటకాస్పదమైనవాడునగు, మాం=నన్ను, ఆద్రియేథాః= ఆదరింపుము. ప్రభువు హాస్యగానిపల్కులకును, చేష్టలకును నవ్వి సంతోషించును గావున, మందప్రజ్ఞుడనగు నా స్తవమును శ్రీనివాసుడు విని తప్పక యాదరించునని భావము.

ఉత్సాహ॥

నీప్రభావమను మహాబ్ధి ♦ నీఁ జొరంగలేక వ్యా
సప్రముఖులు గట్టునిల్వ ♦ సాహసించి లోనికిన్
గుప్రయత్న మొప్పడిగ్గి ♦ క్రుంకి లోతుఁజూచునన్
శ్రీప్రియునకు హాస్యపాత్రుఁ ♦ జేకొనంగదే దయా !॥

తా. ఓదయా ! నీమహిమ సముద్రమును జొరలేక వ్యాస వాల్మీకాది మహర్షిసత్తములు గట్టుమీద అనగా తీరమునందే నిల్చినవారైరి నేను తెలియక యందుదిగి లోతుగానక యంతటను, దడిసి చిక్కుపడియుండగా నన్నాశ్రీవల్లభుడు చూచి యిదియేమి హాస్యమని పరిహసించుచుండును. అందుచే అతనికి పరిహాసాస్పదుడగు నన్ను దయతో నాదరింపుము.

104. అవ. ఇట్లాచార్యులవారు భక్తిపురస్సరముగా భగవద్దయాస్తోత్ర మాచరించి, పరిసమాప్తి గావించి, అనుకూలప్రవృత్తిగల దయాశతకపాఠకుల నుద్దేశించి క్రింది అయిదుశ్లోకములు తెల్పువారై, యీశ్లోకమునందు తాము భగవత్పరతంత్రులై గ్రంథ

రచనకు బూనినట్లు తెలుపుచున్నారు. అనగా కర్త సర్వప్రవర్త కుడగు శ్రీనివాసుడే యని యనుసంధించుచున్నారు.

శ్లో॥ వేదాంతదేశికపదే వినివేశ్య బాలం
దేవో దయాశతక మేత దవాదయ న్మాం।
వైహారికేణ విధినా సమయే గృహీతం
వీణావిశేషమివ వేంకటశైలనాథః॥

టీ. దేవః వేంకటశైలనాథః, దేవః=సంసారమునందు చిక్కి భ్రమించు చేతనులను రక్షించుటయను క్రీడయం దాసక్తిగల, అందుచేతనే నిజవైకుంఠపదవిని విడిచి వేంకటగిరియం దవతరించిన శ్రీనివాసుడు, బాలం = అజ్ఞుడైన, మాం=నన్ను, వేదాంతదేశికపదే = నాథ యామున యతిపతి ప్రభృతులగు గురువుల పాదము నందు లేక పూర్వాచార్యులచే నలంకరింపబడిన వేదాంతాచార్య పదవియందు, వినివేశ్య = ఉంచి, వైహారికేణ విధినా=నిజ విహార వ్యాపారానుగుణముగా, సమయే = మద్రక్షణోచితసమయమున, లేక నా సుకృతపరిపాకసమయము నెఱింగి, గృహీతం = తనదయకు తగినవానిగా గ్రహించిన, మాం బాలం=అజ్ఞుడగునన్ను, ఆచార్య పదవిలోనుంచి, ఏతత్ దయాశతకం=ఈ దయాశతకస్తోత్రమును, అవాదయత్ = పలికించెను. తనవల్లభయొక్క మహిమాతిశయము లను స్వయముగా తాను జెప్పగూడదని నాచేపలికించెనని భావము. ఎట్లునాచేపలికించెనని దెల్పుచున్నారు. వైహారికేణ విధినా సమయే గృహీతం వీణావిశేషమివ, వైహారికేణ=విహారణోద్దేశ్యముగల, అనగా లీలావిహారముగోరిన, విధినా = శాస్త్రజ్ఞునిచే, సంగీతవిద్వాంసునిచే, సమయేగృహీతం = వీణావాదనసమయము తెలిసి పుచ్చుకొనబడిన, వీణావిశేషమివ = వీణయను వాద్యవిశేషమునలె, మాం అవాదయత్ =నన్ను పలికింపచేసెను. వేదాంత

గురువర్యుల స్థానముననుంచి యచేతనమగు తన్ను పలికించినట్లు చెప్పుటచే, నీదయాశతకము ద్వయమంత్రార్థవివరణమై వేదాంత తాత్పర్యవిషయములను దెల్పుచున్నదని ప్రకాశితము. వేంకట శైలనాథుడగు శ్రియఃపతి సర్వనియామకుడైనందున, స్వశేష భూతుడైన నాచే, స్వయముగా దయాశతకమును (నన్ను నిమిత్త మాత్రముగ గ్రహించినాచేత)నిర్మించెనని తాత్పర్యము. "అహం కారవిమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" అహంకారమమకార ములచే దూషితులగువారు తాము కర్తయనితలంతురు. అయితే ప్రాజ్ఞులు భగవంతునియందు కర్తృత్వబుద్ధి ననుసంధించుచుందురు.

ఉత్సాహ॥

విహరణార్థియగు వృషాద్రి ♦ విభుఁడు నన్ను బాలునిఁ
మహితులైన నాథయాము ♦ నప్రభృతుల పాదస
న్నిహితుఁ జేసి వీణగా గ ♦ ణించి సమయమెఱిఁగి తా
రహి దయాశతకము బుధులు ♦ రాగిలంగఁ బల్కెఁగా॥

తా. చేతనులను రక్షించుటయనువిహారమునుగోరి శేష గిరిపై స్వయంవ్యక్తుడైన శ్రీవైకుంఠనాథుడు, ఏమియెఱుగని నన్ను నిగమాంతగురువుల స్థానమునందుంచి, సమయోచితముగా వీణ వాయించుటకై వాద్యమును గ్రహించిన సంగీత శాస్త్రజ్ఞునివలె, నాసుకృతములు పండగా, తఱియెఱింగి నా చే నీదయాస్తుతిని పలి కించెను. అందుచే కర్త యతడేకాని నేనుగాదు.

105. అవ. తాము భగవత్పరతంత్రులై వ్రాసిన గ్రంథము నిర్దుష్టమై సకలఫలప్రదమై శిష్టజన పరిగ్రహయోగ్యమై విలసిల్లు టను, దెలుపుచున్నారు.

శ్లో॥ అనవధి మధికృత్య శ్రీనివాసానుకంపా
మవితథవిషయత్వా ద్విశ్వమవ్రీళయంతీ।

వివిధకుశలసీవీ వేంకటేశప్రసూతా
స్తుతి రియ మనవద్యా శోభతే సత్వభాజాం॥

టీ. అనవధిం శ్రీనివాసానుకంపాం =ఏవిధమైన కొలతగాని, యద్దుగాని లేని శ్రీనివాసునిదయను, అధికృత్య = స్తోత్రవిషయముగా గైకొని, అవితథవిషయత్వాత్ = వ్యర్థముకాని సత్యమగు మహిమనుగల విషయమగుచు, విశ్వం అవ్రీళయంతీ = చెప్పువారు వినువారు, చదువువారు అందఱిని సిగ్గుచెందకుండునట్లు చేయునట్టి, అనగా సామాన్యనరుని మహేంద్రుడు చంద్రుడనినను, జాత్యంధుని జూచి పుండరీకాక్షుడనివర్ణించినను వ్రీళసిగ్గునకు హేతువగును. దయావిషయమైన స్తోత్రమట్టిదికాదనుట, అట్టి క్షుద్రవిషయమునకు వెలిమైన, వివిధకుశలసీవీ=నానావిధపురుషార్థములకు మూలధనమగు, వేంకటేశప్రసూతా ఇయం అనవద్యా స్తుతిః = కవితార్కికకేసరియగు శ్రీమద్వేంకటనాథ దేశికోత్తములచే జనితమైన నిర్దుష్టమగు నీదయాస్తవము, సత్వభాజాం శోభతే = సత్వగుణగరిష్టులకు, శిష్టులకు, రోచతే=సమ్మతమై మహానందమునుగూర్చును. విషయవక్తృవైలక్షణ్యములుగల యీదయాస్తవము సాత్వికజన సంతోషకరమనుట.

పృథ్వీవృత్తము॥

విశేషఫలహేతువై ♦ విషయసౌష్ఠవం బొప్పఁగా
నశేషజనసమ్మతం ♦ బగుచు వేంకటేశార్య స
ద్యశోనిధి సుజాతమై ♦ తనరు కావ్యముల్ దీని శే
షశైలవిభు సద్దయా ♦ స్తవము సాత్వికుల్ మెచ్చరే॥

తా. సకలపురుషార్థప్రదమై, వాస్తవమగు స్తవమగుటచే సర్వజనసమ్మతమై, శ్రీమద్వేంకటనాథ కవిగ్రామణినిర్మితమై, శ్రీని

వాసుని దయను గురించి వ్రాయబడిన యీస్తోత్రము సాత్వికులు చూచి మహానందభరితులగుదురు.

106. అవ. ఈశ్లోకమున దయాశతకము నభ్యసించువారికి గల్గు ఫలమును దెల్పుచున్నారు.

శ్లో॥ శతక మిద ముదారం సమ్య గభ్యస్యమానాన్
వృషగిరి మధిరుహ్య వ్యక్త మాలోకయంతీ।
అనితరశరణానా మాధిరాజ్యే భిషించే
చ్ఛమితవిమతపక్షా శార్ఙ్గధన్వానుకంపా॥

టీ. ఇదండఉదారంశతకం = సర్వపురుషార్థప్రదమై "దేవో దయాశతక మేత దవాదయన్మాం" అన్నట్లు శ్రీవేంకటపతిచే వాదితమై అనగా తత్ప్రేరితులై దేశికులవారిచే నిర్మింపబడినశతకమును (నూఱుగాదు, వేయియైనను, పదివేలైనను శ్లోకములు రచింపశక్తి గల్గినను పాఠకుల సౌకర్యము నుద్దేశించి శతకమై పరిసమాప్తి గావింపబడిన యీగ్రంథమును) సమ్య గభ్యస్యమానాన్=చక్కగా భక్తిశ్రద్ధలతో అభ్యసించువారిని, భగవద్దయ వృషగిరిమధిరుహ్య= వేంకటగిరినాథుని దయయైనను బాగా చదువువారిని చూచునిమిత్తము కొండశిఖరము నెక్కి, వ్యక్తం ఆలోకయంతీ = స్పష్టముగా అమృతవర్షమువలె శీతలకటాక్షములచే జూచుచున్నది, అనగా దయకు వారు పాత్రులగుచున్నారు. అట్టి శమితవిమతపక్షా శార్ఙ్గధన్వానుకంపా = నశింపజేసిన సమస్త ఆశ్రితవిరోధులనుగల శార్ఙ్గమను వింటిని ధరించిన శ్రీనివాసునిదయ, అనితరశరణానాం = తన్ను గాక వేఱొండుదిక్కు లేదని అనగా దయైకశరణులగు ప్రపన్నులను, అధిరాజ్యేభిషించేత్ = మోక్షసామ్రాజ్యమున కర్తలుగా జేయుచున్నది. అనగా వారికి నిత్యైశ్వర్యము కరతలామలకమై యుండుననిభావము. శార్ఙ్గధన్వుని అనుకంపయనుట విమతులగు

శత్రువులను నిరసించు సాధనమును సూచించు విశేషణముకావున అలంకారము పరికరము.

పృథ్వీ॥

దయైకశరణుల్ బుధో • త్తములు శాస్త్రసారంబు నీ
దయాశతకముఁ బ్రియ • త్నమున జూడ శేషాద్రిరా
డ్దయావిషయభూతులై • తనరి మోక్షసామ్రాజ్యమ
వ్యయంబుగ భజింతురిం • దఖిలపాప నిర్ముక్తులై॥

తా. ఈ శ్లాఘనీయమైన దయాశతకమును జదువువారు పుణ్యాత్ములై సను స్తపాపములచే విడువబడి భగవద్దయకు పాత్రులై మోక్షసామ్రాజ్యమున పట్టాభిషిక్తు లగుదురు.

107. అవ. దయకు నివాసమైన శ్రీనివాసుని విడిచి యతని దయను నుతించుటకు కారణమగు దయాప్రభావమును దెల్పుచు దనశతకములోని పద్యముల సందర్భము భగవత్సంకల్పాయత్తమని తెలుపుచున్నారు.

శ్లో॥ విశ్వానుగ్రహమాతరం వ్యతిషజ త్స్వర్గాపవర్గాం సుధా
సధ్రీచీమితి వేంకటేశ్వరకవి ర్భక్త్యా దయా మస్తుత।
పద్యానా మిహ య ద్విధేయ భగవ త్సంకల్ప కల్పద్రుమా
జ్జంఝామారుతధూతచూతనయతస్సామ్యాతికోఽయంక్రమః॥

టీ. విశ్వానుగ్రహమాతరం = నిగ్రహమున నెట్టిదియో మెఱుంగక సర్వజనులను దల్లివోలె నరసి బోషించునదియు, వ్యతిష జత్ స్వర్గాపవర్గాం = స్వర్గాదిభోగములు గోరువారికి వానినిచ్చి మోక్షమొసంగునదియు, అపవర్గము మోక్షము గోరువారికి స్వర్గాది ఫలములనుగూడ నొసంగునదియు, అనగా కృపణజనులకు కల్పలతి కయై కామితములను కాంక్షాధికముగా నిచ్చునట్టిదియు, సుధాస

ధీ్రచీం = అమృతముతో సమానమై మృతసంజీవినియై పరగునట్టి దియునగు, దయాం=భగవద్దయను, ఇతి=ఉక్తప్రకారముగా "వీణా విశేషమివ వేంకటశైలనాథః" అన్నట్లు(భగవత్ప్రేరణమున) వేంక టేశ్వరకవిః = వేంకటనాధులనబరగు కవి, అస్తుత=నుతించెను. ఇహ పద్యానాం అయం క్రమః = ఈప్రబంధమునందు పద్యములవరుస, లేక క్రమము, యద్విధేయ భగవత్ = ఏదయకువశ్యుడైన శ్రీని వాసునియొక్క, సంకల్పకల్పద్రుమాత్ = సంకల్పము లేక ఇచ్ఛ యను కల్పతరువునుండి, ఝంఝామారుతధూత చూతనయతః = పెనుగాలిచే విసరబడిన తియ్యమామిడిపండ్ల న్యాయముమ లేక రీతిని బోలి, సాంపాతికః = కేవలము దైవికమైనది; స్వబుద్ధిచేతగాని, భక్త్యతిశయముచేతగాని, పద్యములక్రమ మేర్పడినదికాదు. మహా వాతముచే దూలి పండ్లురాలుట దైవికమైనట్లు, కృపావిధేయుడైన భగవంతునిసంకల్పముచే పద్యము లొకటివెంట నొకటిగా నేర్పడిన వని భావము.

సీ॥ కరుణాపరుండైన ♦ సురసార్వభౌముని
సంకల్ప కల్పవృ ♦ క్షంబునుండి
పెనుగాలిఁ దూలుచు ♦ తనయంత రాలిన
తియ్యమామిడిపండ్ల ♦ తీరు దోఁప
పద్యక్రమం బతి ♦ హృద్యమై యమరంగ
వేంకటనాధక ♦ విప్రవరుఁడు
ఘనగుణేశ్వరి జగ ♦ జ్జననిఁ ద్రివర్గమో
క్షప్రదాయిని సుధా ♦ సదృశదయను
ఆ॥ సన్నుతించె భక్తి ♦ సంసరచ్చేతన
తతిహితంబు గోరి ♦ తచ్ఛతకము

హారికృపార్ధి యగుచు ♦ నరసింహకవియును
బరగఁ జెప్పె నాంధ్రి ♦ పద్యములుగ॥

తా. విశ్వమ్మాతయై యందఱకు మేలొడగూర్చునదియు, త్రివర్గాపవర్గము లన్నిటికి కారణభూతయు, అమృతసహచరియై యొప్పుచున్నదియు నైన శ్రీనివాసునిదయను శ్రీవేంకటేశ్వరకవి భక్తియుక్తముగా నుతించెను. ఈనుతియందలి పద్యములవరుసక్రమము, భగవత్సంకల్ప కల్పతరువునుండి పెనుగాలిచే రాల్చబడిన తియ్యని మామిడిపండ్లక్రమము ననుసరించి కేవలముదైవికముగాని వేఱొండు కాదు. ఈశ్వరాయత్తమైనదని భావము.

108. అవ. "స్తుతి రియ మనవద్యా శోభతే సత్వభాజాం" 105 వ శ్లోకమున సకలగుణసంపన్నమై దోషగంధరహితమై, వివిధ కుశల నీవియై పరగుచున్న యీ స్తవరాజమును, సబహుమాన ముగా శిష్టజనులు పరిగ్రహింపగలరని చెప్పబడినది. తామసరాజ సావిష్టమతులు, గుణములందు దోష మారోపించు అసూయాపరులు ఎవ్వరేని, నిర్దుష్టమగు శతకశ్లోకములందు తప్పుపట్టి దూటినయెడల, భగవద్దయ అసజ్జనకృత దోషోద్భావనమును వ్యర్థముగా జేయునని తెల్పుచు గ్రంథమును ముగించుచున్నారు.

శ్లో॥ కామం సన్తు మిథః కరంబితగుణావద్యాని పద్యాని నః
కస్యాస్మిన్ శతకే సదంబుకతకే దోషశ్రుతిం క్షామ్యతి।
నిష్ప్రత్యూహ వృషాద్రినిర్ఝర ఝరత్కారచ్ఛలేనోచ్ఛల
ద్దీనాలంబన దివ్యదంపతిదయా కల్లోలకోలాహలః॥

టీ. నః పద్యాని = మాయొక్క పద్యములు (స్వాములవారు తామేవ్రాసినను, నిర్మమకారము ననుసంధించుచు పాఠకులలో నొకరిగా తమ్ము భావించి 'నః పద్యాని' అనుచున్నారు.) మిథః కరం

బితగుణావద్యాని = అన్యోన్యముగా సంమిశ్రితమైన గుణములును, దోషములును గల్గినవైనను, అనగా గుణదోషములు రెండును, పరస్పరసంకీర్ణములై, కామం సంతు = ఉండుగాక, విషయవైలక్షణ్యాతిభవముగలట్టి, సదంబుకతకే అస్మిన్ శతకే = సాధువులనుఅంబువులకు జలములకు, కతకే = ప్రసాదము తేటదనమునుగల్గించు, నీశతకమునందు (సాధువులు ప్రసన్నచిత్తులుగదా "దర్శనాదేవ సాధవః" అని వారిదర్శనము పరమపావనమని చెప్పియుండగా, వారికి మఱల నీశతకముచే చిత్తప్రసాదక మగు టెట్లనిన, తాపత్రయాదులచే మహాత్ములకైన మనఃఖేద మొకప్పుడు కల్గనోపును, అట్టిసమయమున నీశతకము ననుసంధించుటచే మనఃక్లేశమును బోగొట్టి సుఖ మొడగూర్చునని భావము.) కస్య (దూషకస్య) దోషశ్రుతిం = ఒకానొక దూషకునియొక్క నిష్ఠురోక్తులను వినుటను (భగవద్దయ సహించును. ఎట్లు? ఆదయాస్వరూప మెట్టిదని తెల్పుచున్నారు.) నిష్ప్రత్యూహా = అడ్డులేని, వృషాద్రి నిర్ఝరఝరత్కారచ్ఛలేన = వేంకటాద్రి సెలయేఱులయొక్క గొప్పమ్రోతను వ్యాజముగాగొని, ఉచ్ఛలత్ = విజృంభించినదైన, దీనాలంబన దివ్యదంపతిదయా కల్లోలకోలాహలః = దీనులకాశ్రయమైన దివ్యదంపతులగు పద్మాదేవిశ్రీనివాసుల దయాతరంగముల కోలాహలధ్వని, గొప్పఅలలయొక్క రవళి, కస్య దోషశ్రుతిం = ఒకానొకదూషకుని నిందావాచకములను వినుటను, క్షామ్యతి = సహించుచున్నది. అనగా దయాతరంగఘోషములు తామసావిష్టమతుల దూషణోక్తులను వినకుండునట్లు అణచివేయుచున్నవని భావము. అనగా శ్రీనివాసుని దయావిషయమైన పద్యజాలములు గల యీశతకము, సదోషమైనను నిర్దోషమైనను, నిర్గుణమైనను, సగుణమైనను, సర్వజనసేవ్యమై సర్వశుభప్రదమై యొప్పుచున్నదని తాత్పర్యము. 'దివ్యదంపతిదయా' అనుటచే నీదయాస్తుతి

శ్రీశ్రీవల్లభులకు జేరిన దయావిషయమైన స్తవమని తేలుచున్నది. సెల యేటిధ్వనుల నెపమున కృపాతరంగఘోషము దూషణ శ్రవణ మును సహించునట్లు వర్ణించుటచే, అలంకారము కైతవాపహ్నుతి. "దయాకల్లోల," "సదంబుశతకే" అనిచెప్పుటచే రూపకము అలం కారము.

ఉ॥ దోషములున్ గుణంబులును ♦ దోఁచిననేమిట, పద్యముల్ సుహృ
త్తోషకరంబు లజ్ఞతను ♦ దూఱిన శ్రీశదయాప్రవాహని
ర్ఘోషము దూషకోక్తులను ♦ గ్రుంగఁగఁజేయు వినంగరాక, యా
శేషగిరీంద్రనిర్ఝర వి ♦ శేషరవంబుల కైతవంబునన్ ॥

తా. ఈదయాశతకములోని మాపద్యములు గుణదోషము లచే సంకీర్ణమైయున్ననేమి? ఎవ్వఁడైనను తప్పులువట్టి దూషించి నచో, వాని నిందావాక్యములు వినరాకుండునట్లు అణచివేయుటకు, భగవద్దయాప్రవాహతరంగఘోషములువృషాద్రిసెలయేఱుల మ్రోత లనెపంబున బయలుదేరును. అనగా నిందకుల వాక్యములు వ్యర్థ మనియు, కావ్యము నిర్దుష్టమనియు, సకలగుణ సంపన్నమనియు, వేదాంతార్థ సమ్మతమనియు, అందుచే సర్వజనాదరణీయమనియు భావము.

దయాశతకము

ఆంధ్ర పద్య టీకాతాత్పర్యసహితము

—♦ సంపూర్ణము. ♦—

## శ్రీ శ్రీ ని వా సా ర్ప ణ ము.

శ్లో॥ కవితార్కికసింహాయ కల్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే-నమః॥

కం॥ కవివాది కలభసింహుని
స్వవశీకృత సకలతంత్రు ♦ సజ్జననుత వై
భవు వేదాంతాచార్య
ప్రవరుని శ్రీవేంకటేశు ♦ భజియింతు మదిన్॥

శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః॥

# తప్పొప్పుల పట్టిక.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 10 | సవ్రింత్యేవ | స్రివంత్యేవ |
| 5 | 8 | కుపితుడై | కుపితుడైన |
| 9 | 18 | లిలోల | విలోల |
| 13 | 4 | గుణేశ్వరుని | గుణేశ్వరిని |
| 16 | 24 | దీనిజనముల | దీనజనముల |
| 32 | 22 | నీక్రోధము | నీకుక్రోధము |
| 33 | 17 | గుణేంశుడగు | గుణేశుండగు |
| 58 | 7 | దేలి | దేవి |
| 75 | 12 | గిల్గిన | గల్గిన |
| 77 | 3 | శ్రేయాస్సూతిం | శ్రేయస్సూతిం |
| 78 | 4 | గురుః | గురుం |
| 90 | 21 | విభూతమతీ | విభూతిమతీ |
| 123 | 20 | క్లప్తై | క్లుప్తై |
| 123 | 24 | దృట్వా | దృష్ట్వా |
| 128 | 6 | పీతసర్వపంకా | వర్జీపీతపంకా |
| 148 | 22 | భిన్న | ఖిన్న |
| 159 | 3 | నిడద | నిడుద |
| 170 | 14 | తాం | త్వాం |
| 175 | 3&13 | వినిలేశ్య | వినివేశ్య |
| 179 | 15 | త్సగ్గా | త్స్వర్గా |



## శ్రీవైష్ణవముద్రాక్షరశాలయందు వెలకుదొరకు గ్రంథములు.

| | శ్రీవైష్ణవపత్రికచందాదారులకు. | | ఇతరులకు. | |
|---|---|---|---|---|
| | రు. | అ. | రు. | అ. |
| శ్రీరామానుజచరిత్రము | 1 | 0 | 1 | 2 |
| శ్రీగుణరత్నకోశము ఆంధ్రపద్యటీకాతాత్పర్యసహితము | 0 | 14 | 1 | 0 |
| ఊర్ధ్వపుండ్రవిజయధ్వజము | 0 | 4 | 0 | 6 |
| పంచసంస్కారరత్నాపణము | 0 | 5 | 0 | 6 |
| ఉపన్యాససంగ్రహము | 0 | 6 | 0 | 8 |
| ఆంధ్రగీర్వాణశతకోపసహాస్రము పూర్వార్ధము | 1 | 6 | 1 | 11 |
| ఆంధ్రగీర్వాణశతకోపసహాస్రము ఉత్తరార్ధము | 1 | 6 | 1 | 11 |
| శ్రీరామానుజచరిత్ర హరికథ | 0 | 5 | 0 | 6 |
| ఆశౌచసర్వస్వము | 0 | 4 | 0 | 5 |
| నారాయణానందలహరీ | 0 | 2 | 0 | 2 |
| శ్రీరామానుజశతకము సటీకాతాత్పర్యము | 0 | 8 | 0 | 10 |
| శ్రీకృష్ణవైభవప్రకాశిక ప్రథమభాగమువచనము | 0 | 8 | 0 | 10 |
| శ్రీరామానుజాష్టపదులు పాటలు, పద్యములు. | 0 | 3 | 0 | 4 |
| సంకల్పసూర్యోదయనాటకము ఆంధ్రీకృతము | 1 | 6 | 1 | 8 |
| దివ్యసూరిచరిత్రము వచనము | 0 | 15 | 1 | 0 |
| శ్రీవైకుంఠస్తవముఆంధ్రపద్యటీకాతాత్పర్యసహితం | 0 | 15 | 1 | 0 |
| వైరాగ్యసూర్యోదయము | 0 | 11 | 0 | 12 |
| భరద్వాజసంహిత సపరిశిష్టము టీ॥ తా॥ సహితం | 2 | 2 | 2 | 8 |
| తిరువధ్యయనమంత్రము సంకల్పవిధానము | 0 | 2 | 0 | 2 |
| ధర్మశాస్త్రకారికాసంగ్రహము. | 0 | 2 | 0 | 3 |
| శ్రీవైష్ణవ సంధ్యావందనము. | 0 | 2 | 0 | 2 |
| సావిత్రము. | 0 | 2 | 0 | 3 |
| దుర్వాదనిర్వాపణము | 0 | 4 | 0 | 5 |
| జాతకామృతసారము | 1 | 12 | 2 | 0 |

చిరునామా:— మేనేజరు, శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల,
పెంటపాడు, పశ్చిమగోదావరిజిల్లా.